# దశరథరాజనందన చరిత్ర

(నిరోష్ఠ్య రామాయణము)



మరింగంటి సింగరాచార్య ప్రణీతము

పరిష్కర్త

శ్రీ రంగాచార్య






ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనం - హైద్రాబాదు - 4

Paper used for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

# దశరథరాజనందన చరిత్ర

(నిరోష్ఠ్య రామాయణము)

శతఘంటావధాన

మరింగంటి సింగరాచార్య ప్రణీతము



పరిష్కర్త

శ్రీ రంగాచార్య

ఉపన్యాసకుడు - శ్రీ వేంకటేశ్వర భాషాకళాశాల

పాలెము - మహబూబునగరము జిల్లా




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనం - హైదరాబాదు - 4

'దిశల జను లెల్లఁ బొగడఁగ
దశరథనందనచరిత్ర ధాత్రి వెలయఁగా
నిశితమతిఁ జేసె నసదృశ
యశుఁడగు మరిగంటి సింగరాచార్యుఁ డిలన్'

# కృతజ్ఞతలు

ఇది చిరవాంఛితము. నేడు ఫలించినది.

తెలుగు సారస్వతములో ప్రప్రథమ నిరోష్ఠ్య రచనయైన దశరథ రాజనందనచరిత్ర చాలకాలము క్రితము (1917) ముద్రణమై నేడు ఎచ్చటను లభించుటలేదు. అంజనమువేసి చూడవలసిన గతియేర్పడినది.

ఈ గ్రంథమును ముద్రించుటకు అంగీకరించిన సాహిత్యఎకాడమీ కార్యవర్గము ముఖ్యముగా శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు-

పరిష్కరణ సందర్భమున ప్రతులను పంపించిన మిత్రులు మరింగంటి పురుషోత్తమాచార్యులుగారు (సూర్యాపేట), నాగలింగశివయోగిగారు (మహబూబునగరము), పీఠిక వ్రాయుసమయమున అవసరమగు గ్రంథములను, పత్రికలను సాయముచేసిన మిత్రులు నిడుదవోలు శివసుందరేశ్వరరావుగారు-

గ్రంథ సంపాదకత్వ విషయమున మొదటినుండియు నాకు ఎంతో ప్రోత్సాహ మొసంగుచు ప్రకాశనమునకు ముఖ్యులై సాధుపాఠ నిర్ణయమునం దనుభవంతో గూడిన తమ యమూల్య సూచనల నొసంగిన వాత్సల్యహృదయులు ఆచార్య శ్రీ బిరుదురాజు రామరాజుగారు-

గ్రంథగ్రంథులను విడదీయుటలో ఎనలేని చేయూత నొసంగిన మిత్రులు డా. సుప్రసన్నగారు, అగ్రజులు శ్రీలక్ష్మణమూర్తిగారు-

వీరందరికిని మనఃపూర్వక కృతజ్ఞతలు.

ప్రతులను సూచికలను సిద్ధముచేయుటలో చేదోడు వాదోడుగానున్న వర్ధిష్ణువులు-చిరంజీవులు-నాగరాజు, గిరిజామనోహరు, హుసేను-ఈ విద్యార్థులకు ఆశీస్సులు.

30-12-1969 — శ్రీరంగాచార్య.

పాలెము.

# దశరథరాజనందన చరిత్ర

## విషయానుక్రమణిక

# పీఠిక

శ్లో॥ "సీతాలక్ష్మణ పూర్ణపార్శ్వ యుగళం స్మేరాననామ్భోరుహమ్
మేఘశ్యామ ముదారబాహుపరిఘం విస్తీర్ణవక్షస్థ్సలమ్
కర్ణాన్తాయతలోచనం కటితటీసంవీతపీతామ్బరమ్
ధ్యాయేఽస్మత్కులభాగధేయచరణం రామం జగత్స్వామినమ్"
(శ్రీరామ పాదుకా స్తవము)

## 1. తెలంగాణలోని ప్రాచీన కవులు-గ్రంథములు-సంస్థానములు-సాహిత్యము:

### *నల్లగొండ కవులు - రచనలు*

సర్వశ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు, శేషాద్రి రమణ కవులు, సురవరం ప్రతాపరెడ్డి, ఆదిరాజు వీరభద్రరావు, డా॥ బిరుదురాజు రామరాజు-మొదలగువారు ఆంధ్రసారస్వతమున కమూల్యాభరణము లర్పించిన మరింగంటి కవుల గూర్చి సారస్వత లోకమునకు కొంత తెలియపరచినారు. వీరికి నమోవాకములు.

'అచ్చతెనుంగు కబ్బమున కాదిపదంబయి పోల్చు భాగ్యము'ను పొందినది తెలంగాణా భూభాగము. ఈ ప్రాంతమందు కవులు-పండితులు హెచ్చుగానున్నను చరిత్ర కెక్కని చరితార్థుల సంఖ్యయే యధికము. పూర్వకవుల తలపించు శైలిగల వీరి గ్రంథములు చాల భాగము నష్టములైనవి. మరికొన్ని 'ఆలయమందముద్రితములై తెరచటున డాగియున్న బిబ్బీల విధాన' గలవు. ముద్రణమైన స్వల్ప సంఖ్యాక గ్రంథములును నేడు లభించుట లేదు.

ఈ ప్రాంతము-విద్యానాథుడు, మల్లినాథ సూరి, శాకల్య మల్లన-మొదలైన సంస్కృత కవిపండితులకే గాక-బమ్మెర పోతన, పాలకురికి సోమనాథుడు, వేములవాడ భీమన, బుద్ధారెడ్డి, పిన వీరభద్రుడు ఇత్యాది తెనుగు కవులు; సర్వజ్ఞ సింగభూపాలుని వంటి ఆలంకారిక శిఖామణులు; అప్పకవి, గౌరన వంటి లాక్షణికులు; కొఱవి సత్యనారన వంటి ఆంధ్ర కవితా పితామహులును-కలిగి విశేషఖ్యాతి గాంచినది.

కొంతకాలము క్రితమొక ప్రబుద్ధుడు—'నిజాం రాష్ట్రమున ఆంధ్ర కవులు—పండితులు పూజ్యము'—అని వ్రాసెనట.[1] ఈ వాక్యమునకు నాటి పెద్దలు—సాహిత్యాభిమానులు ఎంత కుమిలిపోయిరో? తద్బాధా నివారణార్థము 'ఇదిగో మా తెలంగాణ మండలి కవులు....,' అని చూపుటకు సిద్ధమొనర్చినదే 'గోలకొండ కవుల సంచిక'. సంపాదకులీ సంచికను—తాత్కాలిక కాల హరణమునకో—వినోదమునకో సిద్ధము చేసినదిగాక—ఇది 'తెలంగాణ కవుల కవిలె'వలె శాశ్వతముగా నుండునట్లు చేసినది. ఈ గో.క. సం.లో గల కవుల జాడ—గ్రంథముల వివరములు—నేటికే కొన్ని విస్మృత ప్రాయములయిన వనినచో—సంచికా నిర్మాణమే జరుగకున్న నిక యెట్లుండెడిదో? దీనియందు కొన్ని పొరపాట్లున్నను—తెలంగాణ కవులను గూర్చి సంక్షిప్త పరిచయము చేసికొనుటకు మాత్రము ప్రథమ పాథేయముగా – సాహిత్యలోక సంచారకుల కీసంచిక యుపకరించు ననుటలో నెట్టి సంశయమును లేదు.

మన తెనుగు సాహిత్య చరిత్రలం దేమి—కవుల చరిత్రలయం దేమి కవులను గూర్చి వ్రాయునపుడు—ముఖ్యముగా కాల నిర్ణయాదులు చేయునపుడు—ఆయా కవులను—ఇతడు మా ప్రాంతమువాడే యనియు—కాదు ఈ ప్రాంతము వాడనియు—కొన్ని దశాబ్దములు శతాబ్దములు వెనుకకు ముందునకు లాగి బీభత్సము చేసినారు. అంతతో నాగక కవులను గూర్చి వివాదములను ప్రత్యేక గ్రంథములుగనే ముద్రించుకున్నారు. ఓరుగల్లు పోతన్నను కడపకు, నల్లగొండ జిల్లా పాల్కురికి సోముని (బమ్మెర, పాల్కురికి నేడు వరంగల్లు జిల్లాలో చేరినవి) కర్ణాటక ప్రాంతమునకును, మహబూబునగర జిల్లా అప్పకవిని గుంటూరుకు లాగి—వీరిని యచ్చటివారని నిరూపించుటకు 'చారిత్రక పరిశోధనా సర్కసు' చేసినారు. ఇట్టి స్థితి ప్రస్తుత కాలమున కొంత తగ్గినను—అచ్చటచ్చట నయోమయస్థితి మాత్రము గలదు.

తెలంగాణమండలి ప్రాచీన తాళపత్ర గ్రంథముల సంపాదించి ప్రత్యేక గ్రంథాలయ మేర్పరచి—ఆయా జిల్లాల కవుల చరిత్రను సమగ్రముగా సిద్ధముచేసిన నాడిట్టిబాధ లన్నియు తొలగి తెలంగాణ కవుల చరిత్ర—ఉద్యమ స్వరూపము స్వరూపముగా గోచరించును. కాని యీ బృహత్ప్రణాళిక యెక్కరి చేతిమీదుగా జరిగి—సుదీర్ఘ పరిశ్రమయు ఫలవంతమగుట దుస్త

1. గోలకొండ కవుల సంచిక (1943) ''ప్రస్తావన'' xiii (గో. క. సం.)

రము. ఇట్టి సత్కార్యమునకు సాహిత్య సంస్థలు తలంచిన సాధ్యమగును. గోల కొండ కవుల సంచికవలెనైనా తెలంగాణ కవుల సంచిక యొకటి సిద్ధ మొనర్చుట మిక్కిలి యవసరము. మన ప్రాచీన గ్రంథ సంపద నశించిన పిదప విచారించిన నెట్టి ప్రయోజన ముండజాలదు. కొంత కాలముక్రితము డా॥ బి. రామరాజుగారు ఈ విధముగా వ్రాసినారు—

"తెలుగుదేశ చరిత్రమందు వలెనే-తెలుగు సాహిత్య చరిత్రమందును తెలంగాణము ప్రసక్తి తక్కువగా నుండుట సర్వవిదితము. దీనికి కారణము తెలంగాణ మందలి పూర్వ కవుల గ్రంథములన్నియు సేకరింపబడకపోవుట, సేకరింపబడినవి అనాదరము పాలగుట. కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు గోలకొండ కవుల సంచిక సంపాదించుట కుండిన యముద్రిత గ్రంథములు ఈనాడు తెలంగాణమున లభించుటలేదు. మనమెంత ప్రగతి మార్గమున పయనించుచున్నామో ఈ తాళపత్ర గ్రంథము లంత శీఘ్రగతిని శిథిలమగు చున్నవి. తెలంగాణమున తొలుదొల్త నీ యముద్రిత గ్రంథములను సేక రించుటకు నడుముగట్టినవారు లక్ష్మణరాయ పరిశోధక మండలివారే. ఆ మహా సంస్థ పక్షమున కీర్తిశేషులు దూపాటి వెంకటరమణాచార్యులవారు వందలకొలది తాళపత్ర గ్రంథములను, శాసనములను, నాణెములను సేకరించిరి. కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు రెడ్డి విద్యార్థి వసతి గృహ ములో నుంచిన గ్రంథములనే గాక నేను స్వయముగా సేకరించిన రెండు వందల లిఖిత గ్రంథములను కూడా లక్ష్మణరాయ పరిశోధక మండలి భాండాగారమున చేర్చితిని. పంద్రెండు సంవత్సరముల క్రిందట—నేనా గ్రంథముల పట్టికను సిద్ధము చేసితిని, అది పోయినదట. నాటి నుండి నేటి వరకు ఆ గ్రంథముల నొక మారైనను పరామర్శించినవారు లేరు. తమ్ము పరామర్శించిన క్రిములకు అవి తమ దేహము లర్పించినవి. మనము చేసిన అనాదరణము వలని పరాభవముచే వాని హృదయములు శతచ్ఛిద్రములై గడ్డకట్టుకొని పోయినవి[1]—" ఇది 1961లో వ్రాసిన విషయమైనను—నేటికిని ఎట్టి మార్పులేదు.

లోకమునకు విజ్ఞాన చంద్రికలు ప్రసరింపజేసిన వ్యక్తి కొమర్రాజు లక్ష్మణరావు గారి పేరగల 'పరిశోధక మండలి' దుస్థితియే యిట్లున్నచో—

---

1. "మరుగుపడిన మాణిక్యాలు"-"మనవి"-లో.

తెలంగాణమున ప్రాచీన గ్రంథ సంరక్షణ మెట్లుండునో మనమూహించుకొన గలము[1]. తాళపత్ర ప్రాచీన గ్రంథ సంపత్తు తెలంగాణములో నింకను గలదు. కాని లభించినవాని గతియే యిట్లున్నప్పుడు చెడిపోవుట కెచ్చట యున్న నేమి? భవిష్యత్తులో నైనను వీనికి సుదినములు రావలయునని యాశించుట మన విధిగద! తాళపత్ర గ్రంథములు వందలకొలదిగా సంపాదించి వానిని సంరక్షించలేక, ప్రభుత్వము వారు వీరిని లక్ష్యపెట్టక, అవి యన్నియు చాలా భాగము నష్టములగుచుండుట నా గుర్తులో గల్ల విషయము.

తెనుగు సారస్వతము రాజాశ్రయముచే నెక్కువగా అభివృద్ధిగాంచినది. రాజరాజనరేంద్రుని నుండి యిట్టి ప్రాపు గలదు. కాలక్రమముగా రాను రాను చిన్న చిన్న సంస్థానము లేర్పడినవి. వాటిలో ఆంధ్ర ప్రాంతమందలి వెలుగోడు(?)-రాజవీడు, బొబ్బిలి, విజయనగరము, పిఠాపురము మొదలగునవియు; తెలంగాణమందలి మహబూబునగరం జిల్లాలోని గద్వాల, వనపర్తి, ఆత్మకూరు కొల్లాపురము, జటప్రోలు, దోమకొండ, మొదలయినవి; నల్లగొండ జిల్లాయందలి రాజాచలమను నామాంతరముగల రాచకొండసంస్థాన నారాయణపురము, నడిగూడెము, బేతవోలు మొదలైనవియుగా ఈ సంస్థానములు ఎందరో కవి పండితులను పోషించి వారిచే నమూల్య కృతి రత్నముల వెలయింప చేసినవి. సంస్థానాధిపతులు కృతిభర్తలేగాక కృతికర్తలుగను ప్రసిద్ధి గాంచినారు.

గద్వాల-వనపర్తి సంస్థానములు దశాబ్దమునకు పూర్వమును మానవల్లివారి సాహిత్యకృషికిని-తిరుపతి వేంకటకవుల అవధానవర్షమునకును దివ్యసాహితీఫలముల నందింప నోచుకొనినవి. నీతివాచస్పతులును, మానినీమన్మథులునైన సురభివారు కొల్లాపుర సంస్థానాధిపతులు. వీరు చంద్రికాపరిణయాదు లొనర్చినవారు. రాచకొండ సంస్థానము శ్రీనాథునంతటివానికి కనకాభిషేకము చేసినది. అంతేగాక రసార్ణవ సుధాకరాది గ్రంథములు వెలువడిన దీ యాస్థానముననే! సంస్థాననారాయణపురము, బేతవోలు, 'సమాగతామితవచస్స్వీకారశయ్యా చమత్కృతి సద్గ్రంథ కవిత్వ తత్వఘటనా

1. "మన ప్రాచీన (తాళపత్ర) గ్రంథములు-వాని దుస్థితి"-(శ్రీ) "కృష్ణాపత్రిక" (1967 స్వాతంత్ర్య దినోత్సవ సంచిక).

వేద్యు'లైన కవిపండితుల కాశ్రయ మొసంగి సాహితీసారశీకరాసారముల కల్గించినవి.[1]

తెలంగాణ జిల్లాలలో నొకటైన నల్లగొండ చారిత్రకముగనే గాక సాహిత్య-సాంస్కృతికముగను పేరెన్నిక గనినది. గో. క. సం. లో ఆయా జిల్లాల కవుల సంఖ్య నొసంగిరి. అందు నల్లగొండ కవులసంఖ్య 57 మాత్రమే గలదు. ఏ కారణము వలననో గాని అప్పటికే యిందుచేరవలసిన కవులుచేర లేదు. వదిలిపెట్టబడిన కవులే యీజిల్లాలో సుమారు 60 మందిగలరు. వీరిలో కొందరినిగూర్చి లభించిన యాధారములతో 'భారతి', 'ఆంధ్రసాహిత్యపరిషత్ పత్రిక'లద్వారా నేను తెలుపుచున్నాను. కాని గ్రంథములు దొరకని కవులు, కవిపేరు తెలియని రచనలు కొన్ని గలవు. ఆయాకవివంశీయుల అశ్రద్ధవల్ల పాడైన గ్రంథములును హెచ్చుగా గలవు, మరికొన్ని గ్రంథములు మదరాసు కాకినాడలయందలి ప్రాచ్యపుస్తకభాండాగారములయం దముద్రితముగా వాసము చేయుచున్నవి, ఉదా.-1,400 ప్రాంతమున రాచకొండ సంస్థానము నందున్న బొమ్మకంటి హరిహరుడను కవి మురారి కృత అనర్ఘరాఘవము నకు వ్యాఖ్యవ్రాసెను, ఈ ప్రతి మదరాసు ఓరియంటల్ లైబ్రరీలోగలదని గో. క. సం. (22పుట) తెలుపుచున్నది. ఈవిధముగనే మరికొన్ని రచనలు గలవు. కవిత్రయము తర్వాత యథామూలముగా భారతము నాంధ్రీకరించిన చిలుమర్తి నరసింహకవి మిర్యాలగూడెం తాలూకా కంపాలపల్లి నివాసి. ఈయన భారతమును భువనగిరిలో నొకవైశ్యునకు అంకిత మిచ్చినాడట. నేటివరకదియలభ్యముగా నున్నది[2]. ఈ విధముగా నల్లగొండమండల కవులు-రచనలు-వికీర్ణములుగా నున్నవి.

---

1. వివరములకు - "తెలంగాణములోని సంస్థానములు - సాహిత్య పోషణ" కేశవపంతుల నరసింహశాస్త్రిగారి వ్యాసము (విజ్ఞానసర్వస్వము. 4. భా. విశ్వసాహితి పుటలు 1175-79) మహబూబ్‌నగర సంస్థానముల గూర్చి మాత్రమే గలదు. ఇటీవల డా॥ తూమాటి దొణప్పగారు ఆంధ్ర సంస్థానములు-సాహిత్య పోషణ గురించి ప్రత్యేక గ్రంథము వెలువరించిరి.

2. చిరుమర్తి నరసింహకవి-"లక్షణనవరత్నమాలిక" భారతి 1966 మార్చి) లక్షణనవరత్నమాలిక యను ఛందోగ్రంథ మిందు ప్రచురించనైనది. కవిని తత్కృతులనుగూర్చియును గలదు. (శ్రీ)

మరింగంటి వంశకవులు నల్లగొండమండల కవులలో లబ్ధాధిక ప్రతిష్ఠులు. వారియందు సింగరాచార్యులు ఆద్యుడుమిన్నయైనవాడు. సింగరాచార్యులను గూర్చి తెలిసికొనుటకు ముందు ఇతనికి పూర్వాపరముల గల ఆ వంశపు కవులను గూర్చి తెలిసికొందము.

## 2. మరింగంటికవులు - రచనలు

తరతరములుగా గీర్వాణాంధ్రభాషా కవివతంసులని పేరెన్నికగన్న యీ వంశపు కవులకు నల్లగొండమండల మాకరమైనది. అందు ముఖ్యముగా నేటి దేవరకొండ తాలూకాలోని 'కనగల్లు' గ్రామము. ఇచ్చటినుండి కొంత కాలము తర్వాత వీరిలో కొందరు ఇతర ప్రాంతములయందు స్థిరపడినారు. మిర్యాలగూడెం తాలూకాలోని 'అనుముల' హుజూర్‌నగర్ తాలూకాలోని 'యాదవాకిళ్ల' జనగాం తాలూకాలోని 'మల్లంపల్లి' మరియు సూర్యాపేట, విశాఖపట్నము జిల్లాయందలి భీమునిపట్నము, కృష్ణామండలములోని మొఖాసా కలువపూడి యందును గలరు.

వీరియింటిపేరు ఆసూరి మరింగంటివారు. ఈ పేరు (ఆసూరి) చాలా విశిష్టమైనది. ఎందుకనగా - శ్రీమద్రామానుజుల వారి గృహనామమును ఆసూరివారే! ఇక 'మరింగంటి' అని వీరికి గృహనామము కలుగుటకు గల కారణములను వీరు తమ రచనలయందు చమత్కారముగా నిట్లు తెల్పినారు. 'శేషాంశసంభవుడైన లక్ష్మణార్యుడు పంద్రెండు వేలమంది త్రిదండ సన్యాసులు, ఏడు వేల జనము, డెబ్బదినాల్గువేల గురుజనము, లక్ష తిరునామధారులు వెంటరాగా - శ్రీవైష్ణవమత స్థాపనార్థమై బయలుదేరి అనుకూలుర నను గ్రహించి, చెనటులను శిక్షించి అష్టదిశలయందు శ్రీమతమును నిల్పి శ్రీరంగమునకు తిరిగిరాగా లక్ష్మణార్యులతో శ్రీరంగేశుడు-

కంటిన్ లక్ష్మణమునివరు
గంటిన్, గూరేశదేశికస్వామి మఱిం
గంటి-నదెవ్వరన 'మఱిం
గంటి' మహాన్వయము దనరె గణ్యంబగుచున్.

(ద. రా. నం. చ. 1-15,16)

అనేనట; ఈ విధముగనే సింగరాచార్యుల తర్వాత కవులను తమ గృహనామ విషయమై తెల్పిరి. 'గోదావధూటీపరిణయము' (కృత్యాది 25,26 నెం. పద్యములు) తాలాంకనందనీ పరిణయమును ఇట్లే తెలుపుచున్నవి. తా. నం. పరిణయములో-

'కంటిమి మిము కూరేశులఁ
గంటిమి మీ వెంటవచ్చు ఘనులెవరో మఱిం
గంటి మని బల్క నది మా
కింటికి పేరుంట నామహీన్ రహి కెక్కెన్.'

(కృత్యాది)

అని గలదు. ఆసూరి వారు ఈ కారణాన మరింగంటివారై ఆసూరి మరింగంటి యనబడుచున్నారు.[1]

వీరు మౌద్గల్య గోత్రులు, హెచ్చుగా లక్ష్మీనృసింహ వేంకటేశ్వరభక్తులు.

దశరథరాజనందన చరిత్రలో 'కవివంశవర్ణనము'న గలవారియందు సింగరాచార్యులకు పూర్వముగలవారి రచనలు ఏవియు లభించలేదు. వారును పౌఢకవులే! ద. రా. నం. చ.[2] కృత్యాది ననుసరించి వంశవృక్షమును ముం దొసంగుచున్నాను. దాని ప్రకారముగా తెలియవచ్చువాదు—

*1.* **చెన్నయాచార్యులు:-** 'సకల రాజాధిరాజరాజమకుటాగ్రఘటిత చిరత్నరత్నబహుళనీరాజనాతివిభ్రాజితాంఘ్రిసరసిజుఁ'డైన-ఈ చెన్నయాచార్యులు మాధవగురుని పుత్రుడు. విశేష మేమనగా పుట్టుకతో నితడు సర్పరూపిగా కన్పించినవాడు. ఈయన మాహాత్మ్యము ద. రా. నం. చ, ని. సీ. క. కృత్యాదులయందు 'గోదా—' యందును వర్ణింపబడినది. ఈయన బహుశాస్త్రనిష్ణాతుడట. పణ్కరాజుపల్లి గుట్టపై ఈయన నివాసము. ఈ పణ్కరాజుపల్లియను గ్రామము ప్రస్తుతము మిర్యాలగూడెం తాలూకాలోని అడవిదేవులపల్లి గ్రామమునకు సమీపమున గలదు. ఆ గుట్టపై నరసింహ

---

1. మరింగంటివారని వచ్చుటకు పై కారణము కవి కల్పితమేమో. "మరికల్లు" అను గ్రామము ననుసరించి మరింగంటి మరిగంటి అగు అవకాశము గలదు. మరికల్లు పేరుగల గ్రామములు దేవరకొండ, నల్లగొండ, మహబూబ్‌నగరం తాలూకాలలో గలవు.

2. ద. రా. నం. చ=దశరథరాజనందచరిత్ర. ని. సీ.క =(శుద్ధాంధ్ర) నిరోష్ఠ్య సీతా కల్యాణము.

స్వామి యాలయమున్నది. మరింగంటి చెన్నయ్యగారని-నేటికిని ఆ ప్రాంతపు ప్రజలు గుట్టపై దేవళమున గల పుట్టయందు పాలు పోయుట పరిపాటి. అంతే గాక ప్రత్యేకముగా పూజలును సల్పుదురు. ఈయన 'దశనవసంఖ్యా యగ్రజులు తద్దయు కూర్మి భజించుచుండగా' నుండెనట. ఈయన జన్మ కారణము ననుసరించియేమో, మరింగంటివారు నేటికిని సర్పమును పూజించుటయేగాక - ఎంత భక్తి ప్రపత్తులతోనో చూచుదురు.

2. అప్పలాచార్యులు :- రాజాస్థానములయందు మరింగంటి వారి పేరు ఈయననుండి వినిపించుచున్నది. ఈ అప్పలాచార్యులు ముగ్గురురాజులచేత మ్రొక్కులు గొన్నట్టి భగవత్సమానుఁడు (ద. రా. నం. చ.). మత్తేభ నర హయ మనుజేంద్ర మకుటాగ్రమిళితాంఘ్రి యుగళుఁడు' (ని.సీ.క.). ముగ్గురు రాజులనగా - నరపతులు - అశ్వపతులు - గజపతులు.

మొట్టమొదటి యచ్చ తెనుగుకావ్యముగా పరిగణింపబడుచున్న 'యయాతి చరిత్ర'ను పొన్నికంటి తెలగన్న మల్కిభరాంవద్ద మీర్ జుమ్లా (ఆర్థికమంత్రి) పదవిలోనున్న అమీనుఖానునకు అంకితమిచ్చినాడు. ఈ విషయమున తెలగన్నకు ప్రోత్సాహ మొసగినది అప్పలాచార్యులే యనుటకు యయాతి చరిత్రమందలి—

'ఎనకున్నిచ్చలు మ్రొక్కువారిని సిరుల్ దైవారఁగాఁ జల్లచూ
పున నెల్లప్పుడుఁ జూచి మనఁ గల పెంప్రోడన్ మఱింగంటి య
ప్పనగారిన్ మదిలోని మాట దెలియం బాటించుచుం గాంచినన్
గని యామేటితలం పెఱింగి పొసగంగా నమ్మ మన్నించుచున్'-

పిలిచి పొన్నికంటి తెలగన్న నీచేయు
నచ్చతెనుఁగుఁ గబ్బ మన్నియెడల
మించి వెలయఁగా నమీనుఖానున కిచ్చి
పుడమిలోన సిరులఁ బొగడు కనుము''(1-9, 10)

అను పద్యములవలన తెలియుచున్నది. తెలగన్న తెల్పిన ప్రచారముగా నాలోచించినచో-అప్పలాచార్యులు మల్కిభరాం ఆస్థానమున విశేష గౌరవాదరములతో నుండి, బహుదేశబుధులతో విద్యాపరీక్షల కాలము గడుపుచుండెడివాడని తోచుచున్నది. అంతేగాక—'ఉభయ వేదాంతార్థ విభవుఁడై ప్రభు

లచే అభినుతుల్ గాంచినవాడు' ( 'గోదా - ' తెలుపుచున్నది). ఇట్టి ప్రతిభావంతుడు గావుననే తెలగన్న గ్రంథమును తురుష్కాధికారికి అంకితమిప్పించు ప్రయత్నము విఫలము గాలేదు.

అప్పలాచార్యులను గూర్చి ఈ విషయములు తెలిసినవి. కాని రచన యొక్కటియు లభ్యము గాలేదు ఈయనకు సోదరులు సప్తసంఖ్యాగా గలరు. అందు అయిదవ వ్యక్తి-

*3. జగన్నాథాచార్యులు:-* ద. రా. నం. చ లో సింగరాచార్యు లీయనను జగన్నాథసూరిగా తెల్పినాడు. ఈయనకును అప్పలాచార్యుల వలెనే రచనలు లేని పరిచయము. జగన్నాథాచార్యులు - 'సరస శతపద్య లేఖనీ విరచనారక్తి' గలవాడు. 'వినుత శతఘంట బిరుదాంక విజయుడు' 'అవధాన చక్రవర్తి' ఇంతేగాక కనకాభిషేక మందినవా డనియు శతావధాని యనియు, బహుసంస్కృతాంధ్ర రచనాదక్షుడుగను నేబతికృష్ణ మంత్రి[1] తన రాజనీతి రత్నాకరములో నిట్లు స్తుతించినాడు -

''గురుమూర్ధన్య శతావధాన బిరుదాంకున్ ద్రావిడామ్నాయత
త్త్వరసజ్ఞున్, పటుసంస్కృతాంధ్ర రచనాదక్షున్ హయాధీశకం
ధరసంలబ్ధ సువర్ణవృష్టియుతు కర్ణాటక్షమాభృత్సభాం
తరపూజ్యున్ *మరుకంటి వేంగళజగన్నాథార్యు* గీర్తించెదన్ ''[1] (1-8)

అప్పలాచార్యులు నవాబుల ఆస్థానమున విశేషగౌరవాదరముతో నున్నాడు గదా! జగన్నాథాచార్యులును నిచ్చట గౌరవము పొందెనో లేదో గాని 'కర్ణాటక్షమాభృత్సభాంతరపూజ్యుడు' మాత్రమైనాడు. అప్పటికి - తళ్లికోటయుద్ధము (23-1-1565) జరుగక పూర్వమైనచో నళియరామరాయల వద్దనో, ఇంక కొద్దిముందుకు బోయినచో శ్రీరంగరాయల (1574-'85) ఆస్థానములోనో, జగన్నాథాచార్యులుపై మన్ననలు పొంది యుండవచ్చును. శ్రీరంగరాయలకన్న అళియరామరాయల ఆస్థానముననే ఈయనకు సన్మానము జరిగి యుండవచ్చును. కారణ మేమనగా-రామరాజభూషణుడు మొద

1. కుతుబ్షాహీ సుల్తానులు-ఆంధ్రసంస్కృతి అను గ్రంథము (1962)న సంపాదకులు డా॥ బి. రామరాజుగారు నేబతి కృష్ణయామాత్యుని గూర్చి వ్రాసిన వ్యాసములో నుదాహరించిన పద్యము (పుట 99).

లైన శతఘంటకవనధురీణులు గలరు గదా! 1550-'80 వరకు మల్కిభరాం పరిపాలనా కాలము. ఈ మధ్యకాలమున విజయనగర రాజుల యాస్థానములో జగన్నాథాచార్యులు కనకాభిషేకము బొందియుండవచ్చునని యూహించుట కవకాశము గలదు. ఈ జగన్నాథసూరి యనుజుడే మన **సింగరాచార్యులు** ఈయననుగూర్చి ముందు తెలుపుదును. సింగరాచార్యుల తరువాత గల కవులనుగూర్చి తెలిసికొందము.

**4.** *వెంకటనరసింహాచార్యులు*:- ఈకవి సింగరాచార్యులకు ఆరవ తరములో ఈ కోవలోనే సుమారు 1770 ప్రాంతమున నున్నవాడు. ఈ పేరుగలవారీ వంగడమున నింక కొందరు గలరు కావున ప్రథమ వెంకటనరసింహాచార్యులుగా నీతనిని పరిగణింపవచ్చును. మహాకవియైన యితడు రంగాంబా వెంకటార్యుల పుత్రుడు. ''షోడశమహా గ్రంథబంధురాలంకార నిర్మాణపారీణ ఘనయశోబంధురుడు'' (గోదా-). ఇతనివి కొన్నిరచనలు మాత్రము లభ్యమైనవి. కనగల్లు నందలి తాళపత్రగ్రంథనిలయములోనే తత్కవివంశీయులైన శ్రీరంగాచార్యులవారు వీనిని బదిలపరచి యుంచెడివారు. గోదావధూటీ పరిణయము దక్క తక్కినవన్నియు నముద్రితములు.

రచనలు :-

1. విదేహరాజకన్యకాభ్యుదయము.
2. శ్రీకృష్ణశతానందీయము.
3. చిలువపడిగఱేని పేరణము.
4. నృకంఠీరవాభ్యుదయము.
5. క్షత్రబంధోపాఖ్యానము.
6. జాంబవతీ కుమారశృంగార విలాసము.
7. రామానుజాభ్యుదయము.
8. శల్వాపిళ్లరాయచరిత్ర.
9. విష్వక్సేన ప్రభాకరము.
10. గోదావధూటీ పరిణయము.
11. పద్మినీకన్యకాభ్యుదయము
12. రతిమన్మథాభ్యుదయము.
13. మిత్రవిందోపాఖ్యానము.

వీనియందు గోదావధూటీ పరిణయము 1956 లో ఆ. మ. శ్రీరంగా చార్యుల వారి సంపాదకత్వమున నల్లగొండ (రామగిరి) మహిళాభక్త సమాజమువారు ప్రచురించినారు. ఇది మూ డాశ్వాసముల ప్రబంధము. గద్యపద్యములు సుమారు 300. కవిత్వమంత ప్రౌఢముగా లేకున్నను మంచి గానున్నది. గోదాదేవి-యనగా ఆండాళు, ఆమె చరిత్ర దీనిలో ముఖ్యము. పరిష్కర్తలైన సంపాదకుల యశ్రద్ధ వల్లనేమో, దోషములు హెచ్చుగా నున్నవి. దానికి తోడు ముద్రారాక్షసులు. దేవరకొండ తాలూకా యందలి 'శిరిసనగండ్ల' నరసింహస్వామి కీకృతి యంకితము. పూర్వులనుండి ఈ కవి వరకు గల మరింగంటివారినిగూర్చి కృత్యాదిలో తెలిపినాడు. సింగరా చార్యుల తర్వాత గల మరింగంటి వారినిగూర్చి తెలిసికొనుట కీగ్రంథ కృత్యాది మిక్కిలిగా నుపకరించును.

## శ్రీ కృష్ణశతానందీయము :

ఇది ఎన్ని యాశ్వాసములో తెలియదు. లక్ష్మణరాయ పరిశోధక మండ లిలో నున్నట్లు పరిశోధకులు తెల్పిన గ్రంథములలో నిది యొకటి. పింగళిసూరన కళాపూర్ణోదయమునందు మాయానలకూబరుని గల్పించినట్లు - ఈ కవియు మాయాబ్రహ్మను కల్పించి, కొంత హాస్యమును చిలికింపచేసినాడు. బ్రహ్మ శ్రీకృష్ణుని గోవు లపహరించగా శ్రీకృష్ణుడు బ్రహ్మవేషమున సరస్వతివద్దకు వెళ్లి మంతనము లాడుచుండును. ఆ సమయమున అసలుబ్రహ్మ వచ్చును. ఇరు వురు బ్రహ్మలజూచి సరస్వతియు ఇతరులను తబ్బిబ్బగుదురు. చాల చక్కని శైలిలో నున్న రచన. అముద్రితముగానున్న మంచి రచనలలో నిది యొకటి.

## చిలువపడిగజేని పేరము :

ఇది యచ్చ తెనుగు కావ్యము. చిలువపడిగజేడు=దుర్యోధనుడు (సర్ప ధ్వజుడు)-ఇతని వివాహకథ యిందభివర్ణితము. కొందరు భావించినట్లు కలువ పడగజేని పేరణము. సింగరాచార్యులరచన గాదు. శ్రీకృష్ణ శతానందీయమును ఈ గ్రంథమును గూర్చియు-పండిత ఆదిరాజు వీరభద్రరావుగారు సంక్షిప్తపరి చయము చేసినారు[1]. ఈ వేంకటనరసింహాచార్యుల తరువాత తెలియవచ్చు కవి-

---

1. ''మన తెలంగాణము''-పుటలు 24, 25(1963) మరియు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు-''ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము'' 193, 194 పుటలలో-పై రెండు గ్రంథముల గూర్చి వ్రాసినారు, (195).6

*5. వేంకటరాఘవాచార్యులు* :- రంగనాయకమ్మ భాసనాచార్యుల పుత్రుడు, ప్రౌఢకవి. 'కేశవస్వామిశతకము'(అంత్యప్రాస), 'క్షమావింశతి' యను రెండు రచనలు లభ్యమైనవి. శతకరచనాకాలము - శ.సం. 1778. (క్రీ. శ. 1853) దొరికిన యీ రెండురచనలును అత్యుత్తమముగా గలవు. పై రచనాకాలమునుబట్టి కవి - ఒక శతాబ్దముక్రింద యున్నట్లు తెలియుచున్నది. 'కేశవస్వామి భాస్వత్ఖగేశగామి' యను మకుటముగల ఈశతకము- కొంతకాలము క్రితము వరంగల్లునుండి వెలువడుచుండిన 'ఆంధ్రాభ్యుదయము' అను పత్రికలో 'క్షమావింశతి'తోగూడ ప్రచురింపబడినదట. ఇటీవల (1964లో) ఈ కవిప్రపౌత్రులైన - మరింగంటి వేంకటరామానుజాచార్యుల వారు (మొఖాసాకలునవపూడి) క్షమావింశతితో-శతకమునుముద్రించినారు.[1] మావద్దగల వ్రాతప్రతితోచూచిన ముద్రితప్రతిలో పాఠభేదములేగాక - పొరపాట్లు హెచ్చుగా నున్నట్లు తోచుచున్నది. ఈ వేంకటరాఘవాచార్యుల యనుజుడు -

*6. (ద్వితీయ) వెంకటనరసింహాచార్యులు* :- ఈయన 'తాలాంక నందనీ పరిణయ'మను ఆరాశ్వాసముల ప్రౌఢ ప్రబంధమును 'ఇందిరాల భాగవత'మను యక్షగానమును రచించినాడు. తాలాంకు డనగా బలరాముడు. ఆయన బిడ్డయైన శశిరేఖను అభిమన్యుడు వివాహమాడుట యిందలి కథ. మేనరికపు వివాహముల పద్ధతి యిందు చక్కగా గలదు. ఆ రాశ్వాసములతో గూడిన యీప్రబంధమును పై యక్షగానమును లక్ష్మణరాయ పరిశోధక మండలిలో నుండెడివని గో. క. సం, వలన తెలియుచున్నది. మావద్ద అట నట అసమగ్రముగా నున్న తా.నం. ప తాళపత్రప్రతి లిఖిత ప్రతులును గలవు. ఇందలి గద్య పద్య సంఖ్య (లభించినంతవరకు) 1736. ఆదిరాజు వారీ గ్రంథమును గూర్చిన విపులవ్యాసమును చాలకాలము క్రితము వ్రాసినారు[2]. ఆశ్వాసాంతములయందు 'ఆముక్తమాల్యద'వలె పద్యములు గలవు. ఆము

---

1. చూ. మరింగంటి రాఘవాచార్యులు - కేశవస్వామి శతకము (శ్రీ భారతి 1966 డిసెంబర్) ఈ వ్యాసము ప్రచురణమైన నాటికి-శతకము ముద్రణమైనట్లు నాకు తెలియదు. ఇటీవల నాకొక ప్రతి వీరు పంపించినారు.

2. "తెలంగాణ" పత్రిక (సం. 4. సంచికలు 44, 50. వ్యయ- వైశాఖ బ॥ దశమి. 2-7-1946).

ద్రితముగా నున్న మరింగంటి కవుల రచనలలో నిది యొకటి.[1] ఈ గ్రంథ రచనాసమాప్తి కాలము, (1764) క్రీ.శ 1839. అంగీరస సం॥ భాద్రపద శు: అష్టమి యని కవి తెల్పినాడు.

ఈ వెంకటనరసింహాచార్యులవి కొన్ని చాటుపద్యము లుండెనట. వానిలో రెండు మాత్రము మా తండ్రిగారి సంరక్షణలో నున్నవి. నల్లగొండ జిల్లా కవులు-చాటువులు' (భారతి 1969 జూన్) అను వ్యాసమున వానిని ససందర్భముగా నుదహరించినాను.

*7.* **చెన్నకృష్ణమాచార్యులు :-** వెంకటనరసింహాచార్యుల సమకాలీను డైన యీకవియు కనుగల్లు వాస్తవ్యుడే యైనను - కవినిగూర్చిన వివరములు తెలియుటలేదు. యాదగిరి నృసింహశతకము. మరికొన్ని రచనలు గలవట. అన్నియును అముద్రితములు. గో. క. సం. (३९९పు) యందును ఈ కవిని గూర్చిన విశేష వివరములు లేవు.

*8.* **వరదదేశికులు :-** గో. కం. సం. పేర్కొనబడని కవులలో నొక డైన యీ వరదదేశికులు - షుమారు 150 సం. క్రిందివాడు. సరసకవి. సూర్యాపేట తాలూకాయందలి నరసింహాపుర మీతని నివాసస్థలము. శ్రీరామ పాదుకాస్తవము,[2] గోదాస్తుతి యను రెండు సంస్కృత రచన లీతనివి లభ్య మైనవి. రచన చాలా విలక్షణమైనది.

*9.* **అప్పలదేశికులు :-** శ్రీరామపాదుకాస్తవకర్తగా పేరుగాంచిన వాడు. కాని యిది ఈయన రచనగాదు. కర్త పేరులేని అర్వపల్లీ నృసింహ స్తోత్ర మొకటి[3] గలదు. దానిరచయిత అప్పలదేశికులవారే యని కొన్ని దృష్టాంతములతో ఈమధ్య తెలిసినది.

---

1. తాలాంకనందనీ పరిణయము-ఒక పరిశీలన (శ్రీ) (భారతి 1967 డిసెంబర్).

2. శ్రీరామ పాదుకాస్తవము-మరింగంటి అప్పలదేశికులవారి పేర 1967 సెప్టెంబరు 'భారతి' యందు ప్రచురించినాను. కాని తరువాత లభించిన యాధారములవలన-తత్కర్త వరదదేశికులవారని తెలిపిన మిత్రులు మరింగంటి పురుషోత్తమాచార్యులవారు. 'గోదాస్తుతి' లోని కొన్ని శ్లోకములు వరంగల్లునందలి వైదిక కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమాన్ న. చ. రఘునాథాచార్యులవారి వద్ద గలవు.

3. ''అర్వపల్లినృసింహ స్తోత్రము'' ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక (ప్లవంగ. మార్గశీర్ష - పుష్య.) సంచిక (శ్రీ).

*10.* **లక్ష్మణదేశికులు** :- 19 శతాబ్దము ఉత్తరార్థమునం దుండిన యీకవి జనగాం తాలూకాలోని మల్లపల్లి వాస్తవ్యుడు. కారికావళి, సూక్తి రత్నమాల (ము) రామానుజ అష్టోత్తరశతము-మున్నగు నముద్రిత రచనలు కొన్ని గలవని డా॥ రామరాజుగారు ('విజ్ఞాన సర్వస్వము' 6నం. 755, 756 పుటలు తెలుపుచున్నారు.

*11.* *వేంకట నరసింహాచార్యులు(తృతీయ)*:- అనిరుద్ధవిలాస మను యక్షగానమును రచించినాడు(అము). సుమారు 80 సం. క్రిందటివాడు. సింగ రాచార్యుల వారి శాఖ. ఈ వెంకటనరసింహాచార్యుల పుత్రుడే కనగల్లు నందలి తాళపత్రగ్రంథనిలయ స్థాపకులైరి.

*12.* *శ్రీరంగాచార్యులు*:-సుమారు 5 సం. క్రితమీ రంగాచార్యులు పరమపదించినారు. కొన్నివందల తాళపత్ర గ్రంథములు సంపాదించి పదిల పరచినారు. వానిలో కొన్ని కృష్ణదేవరాయాంధ్రభాషానిలయమున కొసం గిరి. గోదావధూటీ పరిణయ మొక్కటి మాత్రము వీరి సంపాదకత్వమున ప్రచురింపబడినది. గోదాశతక మొకటి ఈయన రచన గలదు(అము.) శ్రీరంగా చార్యులు పరమపదించిన తర్వాత నిరాశ్రయమైన కుటుంబముతోపాటు తాళపత్ర గ్రంథములును చెదరిపోయినవి. వీరు జీవించి యున్నప్పుడు మా నాయనగారికి మైత్రీపూర్వకముగా కొన్ని తాళపత్ర-లిఖిత గ్రంథముల నొసంగిరి.

*13* *వెంకటరామానుజాచార్యులు* :- కేశవస్వామి-శతకకర్త యగు వేంకటరాఘవాచార్యులవారి పౌత్రులైన వేంకటరాఘవాచార్యుల పుత్రులు. జ్ఞానవయోవృద్ధులైన వీరు కృష్ణాజిల్లా మొఖాసాకలువపూడియం దున్నారు. కేశవస్వామి శతకమును ముద్రించినది వీరే. జనగాంతాలూకాలోని 'జీడికల్లు' శ్రీరామచంద్రుడు వీరి యభిమానదైవము. 'భల్లాతకక్షేత్ర (జీడికల్లు) మాహాత్మ్య'మను అయిదాశ్వాసముల ప్రబంధమును వ్రాసినారు (అము). సుమారు 400 పద్యములకుపైగా గలవు[1]. వారణాసి అచ్యుతరామకవి సురతాణీ పరిణయము-మొదలైన గ్రంథములు వీరివద్ద యుండెనట. ఇటీవల తుఫానులో నవి యన్నియు నష్టమైనవని తెల్పిరి.

---

1. భల్లాతకక్షేత్రమాహాత్మ్యమును ఇటీవల వీరు నాకు పంపినారు (వ్రాతపతి).

*14.* వెంకటనరసింహాచార్యులు (చతుర్థ) :— పై వెంకటరామానుజాచార్యులవారి సోదరుడు. సుమారు 8 సం. క్రితము సూర్యాపేటలో పరమపదించినారు. బహుగ్రంథకర్త. చాలాభాగము ముద్రణమైనవి. ముద్రిత రచనలు 30, అముద్రితరచనలు 10 గలవు. ముద్రిత రచనలలో మాలతీ వసంతము, నీలాసుందరీ పరిణయము అను ప్రబంధములును, సుచిత్రాభ్యుదయము, సుమాలినీ పరిణయము అను నాటకములును ప్రసిద్ధిగాంచినవి.

*15.* లక్ష్మణాచార్యులు :— సుప్రసిద్ధ హరికథాకథకులైన వీరును వెంకటరామానుజాచార్యులవారి సోదరులే. చక్కని కవిత చెప్పగలవారు. వీరు భీమపుర లక్ష్మీనరసింహప్రభుశతకము (1959) శబరిసపర్య (1968) హనుమన్నుతి (1968) మొదలైన రచనలు చేసినారు. విశాఖ మండల మందలి భీమునిపట్నములో నున్నారు.

*16.* పురుషోత్తమాచార్యులు :- 14 నెం వెంకట నరసింహాచార్యుల వారి పుత్రులు. ప్రస్తుతము వీరు సూర్యాపేటయందలి జిల్లాపరిషదున్నత పాఠశాలలో నధ్యాపకులుగా నున్నారు. పిత్ర్యమైన గ్రంథముల ప్రచురించి ప్రచార మొనర్చుటయే గాక - రసవత్కవితతో 'యాదగిరి లక్ష్మీనరసింహ ప్రభో' యను మకుటముగల శతకమును రచించినారు. ప్రస్తుత మిది ముద్రణ మగు చున్నది.

సింగరాచార్యులకు పూర్వోత్తరముల గల కవులగూర్చి తెలిసినంత వరకు-వారి వారి రచనలతో పరిచయ మొనరించినాను. అనుముల, యాదవాకిళ్ళ - ప్రాంతముల యందిక కొందరున్నారేమో ! గాని వారిని గూర్చిన వివరములు తెలియరాలేదు.

ఇక సింగరాచార్యులవారి చరిత్రలో ప్రవేశింతము.

## 4. సింగరాచార్యులు—వంశవృక్షము

దశరథరాజనందన చరిత్రయందును, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణమునందును వంశవృక్షము సమానముగా గలదు. అంతేగాక కొన్ని పద్యములు మినహాయించిన రెంటిలోను కృత్యాది సమానముగానే గలదు. ద. రా. సం. చ. ప్రకారముగా సింగరాచార్యుల వంశవృక్ష మిది.




*1* అప్పలగురుడు 2. వెంకటార్యుడు 3. నృసింహుడు 4. కోనేటి రాయశౌరి *5*, జగన్నాథసూరి *6*. సింగరాచార్యులు 7.రంగప్ప 8.సింగరప్ప. తెలిసినంత వరకు వీరిలో కొందరిని గూర్చి తెలుసుకున్నాము. సింగరాచార్యుల తరువాత గలవారి వంశానుక్రమణిక 'గోదావధూటీ పరిణయము' నందు గలదు.

ఇక సింగారాచార్యుల స్వస్థలము, కాలము, రచనలను గూర్చి తెలుసుకుందము,

నివాసము :

శతఘంటావధాన-శారదాప్రశ్నవివరణ — ఆశుకవి - ఇత్యాది అన్వర్థ బిరుదాభిరాముడగు సింగరాచార్యులు, వరదమాంబా తిరువేంగళా చార్యుల గర్భశుక్తిముక్తాఫలము. (శ్రీ)వైష్ణవులు, మౌద్గల్య గోత్రము. మరింగంటి వారికి పుట్టిల్లైన కనగల్లులో సింగరాచార్యుల పూర్వు లుండెడి వారట. కొంత కాలము తరువాత-నేటి మిర్యాలగూడెం తాలూకా యందలి వాడపల్లిలో నరసింహస్వామి యాలయమున వీరు స్థానాచార్యత్వము వహించి యున్నట్లు గోదావధూటీ పరిణయములో గలదు.

మ. "నరనాగాశ్వనృపాలశేఖరులు నానారత్నభూషావళుల్
తురగాందోళిక ఛత్రచామరతతుల్ తోరంబుగా నీయగన్,
సిరు లింపొందుచు వాడపల్లి నగరిన్ చెన్నొందుచున్నట్టి శ్రీ
నరకంఠీరవు కోవెలస్థలికి స్థానాచార్యులై యుండఁగాన్"

(1-37)

దీని తరువాతగల-

సీ. అమ్మహీమండలి కాధ్యులౌ పరివృఢుల్
హర్షణ తమనుబు నాశ్రయించు
వేళను **యాదవాకిళ్లను** గ్రామంబు
*నగ్రహారంబుగా* నటనొసంగ
నతివేడ్క-వారలు నాలయంబుగ నిల్చి
యధిక సంపన్నత నలరుచుండు.................(1-38)

ఇత్యాది పద్యములవలన-వాడపల్లి నుండి వీరు యాదవాకిళ్ళ యను (అగ్రహారము) గ్రామమునకు వెళ్ళినట్లు గలదు. ఈ గ్రామము హుజూర్ నగరం తాలూకాలో నున్నది. మరింగంటివా రిప్పటి కీ ప్రాంతముల యందున్నట్లు గత ప్రకరణమున తెలుసుకున్నాము.

కనగల్లు-నేడు దేవరకొండ తాలూకాలో గలదు. వాడపల్లియు నట్లే యుండెడిది-కాని జిల్లాల విభజన జరిగినపు డీ వాడపల్లి మిర్యాలగూడెం తాలూకాలో చేరినది. కనగల్లు-వాడపల్లి సమీపములుగా నుండును.

దశరథరాజనందన చరిత్రయు - నిరోష్ఠ్యసీతాకల్యాణమును-సింగరాచార్యులు కర్పూరాద్రి నరసింహస్వామి పేర నంకితమొనంగినాడు. దేవరకొండ తాలూకాలో-పణ్కా-రాజుపల్లి యను గ్రామము గలదు. అది అడవి దేవులపల్లి యను గ్రామమునకు సమీపముగా నుండును. పణ్కా-రాజుపల్లి వద్ద గుట్ట గలదు. అందు నరసింహస్వామి యాలయ మున్నది. ఆ పర్వతమునే సంస్కృతీకరించి కర్పూరాచలమని కవి చెప్పకొని యున్నాడు. అంతేగాక-'కర్పర'యను గ్రామమొకటియు-ఈ పల్లె వద్దగల యొకచిన్నపల్లె. దీని వలననైన కవి-కర్పూరాద్రి యనవచ్చును. '....దేవరకొండ సీమలో సన్నుత పణ్కా-రాజు పలిశైలమునన్ ....'(1-20) అని యీ గ్రంథములో చెప్పబడిన దీ కర్పూరాచలమే!

శు. ని. సీ. కల్యాణమందు-సింగరాచార్యులు - తమతండ్రియైన తిరువేంగళనాథుడు-గురు రాయపట్టణ స్థాపకుడై చెలంగిన హారితీర్థముల కొన్నిటిని పేర్కొన్నాడు-(1-50) (పద్యము-అనుబంధములో) ఆ గ్రామములు నే డే యే తాలూకాలలో గలవో తెల్పుదును-

1. అనంతగిరి- 1. దేవరకొండకు సమీపమున-అనగా-దేవరకొండ నుండి కల్వకుర్తికి వచ్చు మార్గమునందు గలదు.

   2. బిజినేపల్లి యను గ్రామము నాగరకర్నూలు తాలూకాయందు గలదు, దానికి పూర్వము అనంతగిరి యని పేరున్నట్లు తెలియుచున్నది.

2. ధర్మపురి- సుప్రసిద్ధమైన నరసింహ క్షేత్రము-కరీంనగర్ జిల్లాలో గలదు.

3. ఊరుగొండ -1. 'ఉర్లుగొండ' యని రామన్నపేట తాలూకాలో నొకటి గలదు.

   2. మహబూబ్‌నగరం జిల్లాలోని జడ్చర్ల-కల్వకుర్తిలో 'ఊరుగొండ పేట' గలదు.

   3. దేవరకొండ తాలూకాలో నొక యూరుగొండ గలదట.

4 గంగాపురి- సుప్రసిద్ధ చారిత్రక స్థలము, మహబూబ్‌నగర్ జిల్లా-జడ్చర్ల తాలూకాలో గల గ్రామం. జడ్చర్లకు సమీపములో గలదు. ఇచ్చట ప్రాచీన చెన్నకేశవాలయమున్నది.

5 బ్రహ్మరాయపురి-1. ఏదైన తెనుగు పేరునకు సంస్కృతీకరణమా?

2. నాగరకర్నూలు తాలూకాలో బొమ్మరాజుపల్లి గలదు.

6. కర్పర- 1. అడవిదేవులపల్లి వద్ద గలదు-'పణ్కరాజుపల్లి', ఈ 'కర్పర'-ప్రక్క ప్రక్క పల్లెలు.

2. 'కొప్పెర' యను పల్లె నాగరకర్నూలు తాలూకాలో గలదు.

7 రేబలె- నాగరకర్నూలు, షాద్‌నగర్ తాలూకాలలో గలవు.

8 ఎండబెట్ల- నాగరకర్నూలు తాలూకాలో గలదు. ఎండవల్లి-నల్లగొండ తాలూకాలోను గలదు.

9 బాదేపల్లి- నేటి జడ్చర్ల పూర్వము దీనికి 'బాదేపల్లి'యని పేరు. నేటికిని బాదేపల్లి యని కొన్ని కొన్ని వ్యవహారముల యందు నుండును.

ఈ పైగ్రామములన్నింటియందును విష్ణ్వాలయములు గలవు. తిరువేంగళాచార్యులవారు-ఆకాలములో వీని నన్నింటినితిరిగెనట! (నాకు తెలిసినంత వరకు - కొందరి ద్వారాను తెలిసికొని గ్రామాల గూర్చి తెలిపితిని-కానికొన్ని యనుమానముగా గలవు) సింగరాచార్యుల వరకు వారి పూర్వుల విషయమిది. తరువాత వారును యాదవాకిళ్ల యందున్నట్లు 'గోదా........' తెలుపుచున్నది.

## 5. కాలము:

ఒక కవియొక్క కాలమును తెలిసికొనుటకు-ఆ కవి తన గ్రంథకృత్యాదియందు - సమకాలీన కవులను - కృతిభర్తను గూర్చి చెప్పిన విషయ

మును, చారిత్రక విషయములున్నచో వాని ప్రకారముగ పరిశీలించిన కాల నిర్ణయము చేయుటకు వీలగును. లేదా-గ్రంథకర్తయే స్వయముగా గ్రంథ రచనాకాలమును దెల్పినచో - దాని ప్రకారముగా నూహించుటకును వీలగును.

సింగరాచార్యుల లభించిన రెండు కృతులయందును వాల్మీకి మరియు అన్నగారైన అప్పలాచార్యులను గూర్చి మాత్రము గలదు. రెండు గ్రంథములును దైవాంకితములు. సింగరాచార్యులు ఈ ద.రా.నం.చ. యందు తనను గూర్చి—

"వరవందారుజనావళీ హృదయ సద్వాంఛార్థ కృద్వేంకటే
శ్వర సంపూర్ణకృపాసుధామిళిత వీణామాధురీ మార్గవి
స్ఫురితైకైక దినప్రబంధరచనా స్ఫూర్జద్వచ శ్శీకుడన్
*నరనాగాశ్వ నృపాల సభ్య గణింతుడన్* సింగరాచార్యుడన్"

(1-32)

అని తెలుపుకొనినాడు. నరనాగాశ్వనృపాలురనగా-నరపతులు, గజపతులు, అశ్వపతులు-వీరందరిచే మన్ననలు బొందినట్లు కవి తెల్పినాడు. ఇతరుల రచనలు కొన్ని పైవిషయమును తెల్పుచున్నవి.

మల్కిభరామ మను నామాంతరముగల ఇబ్రహీం కుతుబ్షా కొంతకాల మళియ రామరాయలవద్ద నుండి-అన్నయైన జంషీద్ మరణా నంతరము గోలకొండ సామ్రాజ్యమునకు ప్రభువైనాడు. ఈతని పరిపాలనా కాలము క్రీ.శ. 1550-80. ఈ రాజు కొలువు కవిపండితులకు నిలయమైనది. సింగరాచార్యుల యగ్రజుడైన అప్పలాచార్యులు, పొన్నికంటి తెలగన్న, అద్దంకి గంగాధర కవి మొదలైన తెనుగు కవు లీతని యాస్థానములో నున్నవారు. అన్నగారి ప్రాపకముచే - సింగరాచార్యులును మధ్యమధ్య ఆస్థానమున ప్రవేశించుచు-సన్మానాదుల నంది యుండవచ్చును. జగన్నాథాచార్యులును మన్నన లందినాడని తెలిసికొన్నాము గదా! ఆ ప్రకారముగనే సింగరాచార్యులు గావచ్చును. లేనిచో నరనాగాశ్వనృపాల సభ్యగణితుడనని చెప్పుకొనక పోయెడివాడు. అప్పలాచార్యులకు-సింగరాచార్యులకు మధ్య నల్వురు సోదరులు గలరు. అప్పలాచార్యులను సుమారు 60 వత్సరముల ప్రాయముగావాని

తలంచినచో, సింగరాచార్యులను సుమారు 50-52 వత్సరముల ప్రాయము గలవానిగా నూహింపవచ్చును. కాని సింగరాచార్యులు-తా నే యే ప్రాయమున నే యే రచనలు చేసినది. శు.ని.సీ.క కృత్యాదియందు తెల్పినాడు. దాని ప్రకారముగా 20 సం. వయస్సునందు శు.ని.సీ. కల్యాణమును వ్రాసినాడు. 'దశరధరాజనందన చరిత్ర'యని చెప్పకపోయినను-నిరోష్ఠ్యకృతులు కొన్ని 19 సం. ప్రాయమున రచించినట్లు తెల్పినాడు. వానిలో దశరథరాజనందన చరిత్ర యొకటి గావచ్చును. అయినచో - దశరథరాజనందన చరిత్ర రచన వరకే - నరనాగాశ్వనృపాల సభ్యగణితుడనని చెప్పుకొనుట ఎట్లు? అంత వయస్సులోనే-అటు విజయనగర సంస్థానమునందు-జగన్నాథాచార్యులతో నీయనయు సమ్మానములు బొంది-మల్కిభరాం పరిపాలనారంభదశలో గౌరవభాజనుడు గావచ్చును, లేదా ద.రా.నం.చ ను వ్రాసి, కొంత కాలము తర్వాత కృత్యాది వ్రాసికొనవచ్చును. (దాదాపు గ్రంథరచన చేయువారలలో నధికసంఖ్యాకు లీ పద్ధతి నవలంబింతురు).సింగరాచార్యులును పై పద్ధతి నవలంబించెనేమో? కృతిసిద్ధమైన తర్వాత కృతిభర్తకొరకు-కృత్యాది - ఆశ్వాసాంతములు ఖాళీగా నుంచి - తగిన కృతిభర్త లభించగనే వానిని పూర్తిచేయుదురు. కాని సింగరాచార్యుల రచనలు నరాంకితములు గావు.

శు.వి.సీ.క కృత్యాదియందు సింగరాచార్యులు తెలుపుకొన్న గ్రంథ రచనాసమయమును, వయస్సును మన మతిశయోక్తిగా భావింప వీలులేదు-ఏమనగా-నట్టి ప్రతిభా వంతులుండుట మనకును-మన సాహిత్యమునకు తెలియని విషయముగాదు. యయాతి చరిత్ర రచనాకాలము 1574 కు తర్వాతను-'80కి లోపు జరిగియుండవచ్చునని తెలియుచున్నది.సింగరాచార్యులును 1574 వరకు-ప్రఖ్యాతుడై-ఉభయ నిరోష్ఠ్యరచనలుచేసి యుండవచ్చును. అప్పలాచార్యులు - సింగరాచార్యులు - తెలగన్న - సమకాలీనులు. కాని తెలగన్న - సింగరాచార్యులలో ఎవరు ముందు? అచ్చతెనుగునందు ఉభయులలో మొదటి రచన యెవరిది? అనునవి మాత్రము నిస్సంశయముగా తెలియ వలయును అంతవరకు సింగరాచార్యులను తెలగన్నతో సమానముగా అనగా 16 శతాబ్దపు ఉత్తరార్థమువానిగా భావింతము.

## *6. సింగరాచార్యులు - రచనలు :*

మన సారస్వతములో-తమ రచనలను గూర్చి పూర్తిగా తెల్పిన కవులు చాలా తక్కువ. మరికొందరు రచనలనే పేర్కొనలేదు. కాని - తమ రచనల జాబితాను ఎక్కువగా తెల్పిన ఇరువురు కవులు గలరు - వారు గణపవరపు వేంకటకవి. మన సింగరాచార్యులు. వీరిన్నికృతుల నొసంగినను-దురదృష్ట మున నన్ని మాయమై ఒకటి రెండు మాత్రమే లభ్యమగుచున్నవి.

సింగరాచార్యులువ.రా.నం.చ యందు కృతులను గూర్చి తెలుప లేదు. కాని ఆశ్వాసాంత గద్యయందు 'వింశతి నిరోష్ఠ్యాది ప్రబంధ ముల రచించినట్లు తెలిపినాడు.

శు.ని.సీ కల్యాణమునందు తన రచనల జాబితాగల పద్యముల నొసంగినాడు. వాని ప్రకారముగా రచనలను పేర్కొనుచున్నాను-

| రచన | అప్పటికి కవివయస్సు |
|---|---|
| 1. వరదరాజస్తుతి } | 9 సం. |
| 2. శ్రీరంగ శతకము } | |
| 3. [illegible] - | 10 ,, |
| 4. [illegible] | 11 ,, |
| 5. [illegible] ([illegible]) | 12 ,, |
| 6. [illegible] ([illegible]) | 13 ,, |
| 7. అష్టభాషా[illegible]కృతులు - (?) } | 14. 15 ,, |
| 8. నాటక [illegible] - } | |
| 9. [illegible] | ,, ,, |
| 10. [illegible] - | ,, ,, |
| 11. [illegible] (చతురర్థి) | 16 ,, |
| 12. [illegible] సంగ్రహము | 17 ,, |
| 13. [illegible] - | 18 ,, |

| రచన - | అప్పటికి కవి వయస్సు- |
| --- | --- |
| 14. ఆంధ్రభాషాభూషణము. | 19 సం. |
| వింశతి నిరోష్ఠ్య కృతులు. | |
| 15. వానిలో - దశరథరాజనందన చరిత్ర. | ,, ,, |
| 16. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము - | ,, ,, |
| 17. తారకబ్రహ్మ రామశతకము | ,, ,, |

వీనిని సింగరాచార్యులు తెల్పినాడు -

గోలకొండ కవుల సంచిక (415 పుట) సింగరాచార్యుల రచనలుగా పేర్కొన్న పదమూడు రచనలలో శ్రీకృష్ణశతానందీయము - కృష్ణతులాభారము - రతిమన్మథాభ్యుదయము - రామాభ్యుదయములును గలవు. వీనిని సింగరాచార్యుల రచనలుగా పొరపాటున వారు తెల్పినారు. శ్రీకృష్ణశతానందీయము, రతిమన్మథాభ్యుదయము - వెంకట నరసింహాచార్యుల రచనలు. కృష్ణతులాభారము - రామాభ్యుదయము - సింగరాచార్యుల రచనలు కావు. ఎవరివో తెలియదు. ఈ వెంకట నరసింహాచార్యుల రచనలలో రామానుజాభ్యుదయముగలదు. దానినే రామాభ్యుదయముగా పేర్కొనిరో?. డా॥ రామరాజుగారును - రామాభ్యుదయము - కృష్ణతులాభారము-సింగరాచార్యుల రచనలుగా తెల్పిరి (30.9.1960 ఆంధ్రభూమి). సమగ్ర ఆంధ్రసాహిత్యము (8 సం.) పై వ్రాతలను పురస్కరించుకొని- సింగరాచార్యుల రచనలుగా మరికొన్నిటిని చూపుచు-శ్రీకృష్ణశతానందీయమునకు ప్రశ్నార్థక చిహ్నముంచినది. ఇది కొంతవరకు నయమే. ఈ 8వ సంపుటమును సమీక్షించినవారు - పైరచనలేగాక - శల్వపిల్లరాయచరిత్ర- చిలువపడిగజేనికథ - నందనందన శతకము - అలంకార కృష్ణవిలాసము - మొదలగునవియును సింగరాచార్యుల రచనలని విపులముగా చర్చించిరి. కాని యివి యేవియు సింగరాచార్యుల రచనలుగావు. 'మరింగంటి కవులు

---

1. సమగ్ర ఆంధ్రసాహిత్యము-సమీక్ష (8సం. నవాబులయుగం) ఇడుదవోలు వారు. (భారతి. 1966 ఫిబ్రవరి)

సింగరాచార్యులు-రచనలు (భారతి 1968 నవంబర్) అను వ్యాసము లోను పొరపాట్లు కొన్ని జరిగినవి.

రచనలు'-అను పూర్వప్రకరణములో తెల్పబడిన షోడశ ప్రబంధ నిర్మాత యగు వెంకట నరసింహాచార్యులు వీనికర్త. నందనందన శతకముగాదు - నందనందన శతానందము (శ్రీకృష్ణశతానందీయము). చిలువపడిగ జేనికత- శ్రీకృష్ణశతానందీయము - వీనిలోని కృత్యాది-కృత్యంత పద్యములు స్పష్టముగా పైవిషయమును తెల్పుచున్నవి. స.ఆ.సా. సమీక్షకులు ఆ పద్యముల నొసంగినారు.

వంగూరివారి శతక కవుల చరిత్రలో (394.95 పు)సింగరాచార్యుల రచనగా సీతాపతి శతకమొకటి పేర్కొనబడినది. అందుండి వారు 5 పద్యములను తెల్పినారు. (దశరథరాజనందన చరిత్ర తాళపత్రప్రతి చివర ఆ పద్యములు గలవట).

యామునాచార్య చరిత్ర యొకటి సింగరాచార్యుల రచనగా నేను భారతి (1968 నవం.) యందు సూచించినాను. ఇటీవల దానిని పరిశీలించగా నది 'వాత్స్యరంగాచార్య పుత్ర సింగరాచార్య కవి' రచితము. ఆంధ్ర వాఙ్మయసూచిక ఈ గ్రంథము ముద్రణమైనట్లు తెల్పుచున్నది. వ్రాతప్రతి- మహబూబ్ నగరంలో శివయోగిగారి వద్ద గలదు. సింగరాచార్యులు తెల్పు కొన్న గ్రంథములలో నిరోష్ఠ్యసీతాకళ్యాణము, దశరథరాజనందన చరిత్రలు మాత్రమే లభ్యములుగా గలవు. అవియు చాలా కాలము క్రితము ముద్రణమగుటచే అంజనము వేసి చూడవలసినగతి పట్టినది. ప్రేమాభిరామ - ధనాభిరామ ద్విపదలును, రామకృష్ణ విజయము - నలయాదవ రాఘవ పాండవీయము-అను ద్వ్యర్థి-చతురర్థి రచనలును మాయమైనవి.

నిరోష్ఠ్య - శుద్ధాంధ్ర - శుద్ధాంధ్రనిరోష్ఠ్య రచనకును, త్ర్యర్థి కావ్య రచనకును-సింగరాచార్యులే ఆద్యుడుగా వచ్చును.

మనకు లభించిన ద.రా.నం.చ.,ని.సీ.క.ల గూర్చి మాత్రము తెలిసికుందము.

## 7. రామాయణ వాఙ్మయము :

దశరథరాజనందన చరిత్రనుగూర్చి తెలిసికొనుటకు ముందు-రామాయణ వాఙ్మయమును తెలిసికొనుట యవసరము.

కాంతాసమ్మితమైనది కావ్యము. లౌకిక జీవనముచేత కాలుష్యము చెందిన మనస్సు కావ్యపఠనచే రసానందము ననుభవించును. తరువాత మన మనస్సు ఉత్తమ సంస్కారవంత మగును. మానవత్వమునకు ముఖ్యముగా కావలసినది సాత్విక ప్రవృత్తి, భగవంతుడు రసస్వరూపుడు. అతని కభిముఖముగా నడచి దానిలో పర్యవసింపగోరుట భక్తి యనబడును. రామపరమైన భక్తికిని-రామాయణ కావ్యపఠనమునకును ఇట్టి భక్తియే కారణము. సమస్తమంత్ర రాజమైన - రామాయణము తెలుగునాట ప్రజలలో నధికముగా జీర్ణమైనది. దీనికి కారణమేమనగా సాహిత్యమనునది ఎన్ని ప్రయోజనముల సాధింపవలయునో - అట్టి ప్రయోజనముల నన్నింటికన్న హెచ్చుగా రామాయణము సాధించుటయే. మానవుని జీవితమందలి లోతుపాతులను త్రవ్వి చూపగల్గినది. వీని యన్నిటికి కారణము వాల్మీకి లేఖినీ ప్రభావము. సర్వరస నిలయమైన రామాయణము సకలాలంకార శోభిత మహాకావ్యము. రామకథయందలి వస్త్వైక్యము పఠిత కానసగల్గించుటయే గాక ఛందోపబృంహితము నందును - కావ్య పురాక్తిని బాది పద్ధతియందును కావ్యనిర్మాణ ప్రతిభులకు ప్రాణప్రదమైనది రామాయణము. ఇతర భాషలయందును రామాయణము గలదు కాని - తెనుగునాటను - (అందు ముఖ్యముగా తెలంగాణమునను) రామాయణ రచన విరివిగా సాగినది.[1] రాముని తెనుగువారు అభిమాన దైవముగా కొలుచుటయు-శ్రీరామ క్షేత్రములు తెనుగునాట అధికముగా నుండుటయు - ఇందుకు ప్రబల కారణములు. తెనుగు సాహిత్యముపై సంస్కృత రామాయణ ప్రభావ మెంతగల దనగా - ఇతరములైనవాని ప్రభావము వ్యాపింపనంతగా గలదు. సంస్కృతమునుండి తెనుగులోనికిని-సంస్కృతము లోనికిని పరివర్తన గావించిన కవులు మన తెలుగువారిలో శతాధికసంఖ్యగా గలరు[2].

---

1. రామాయణ వాఙ్మయము. (విజ్ఞాన సర్వస్వము 4 సం. తెలుగు సంస్కృతి. 2 పుటలు-1035-1042)

2. తెలుగువారి సంస్కృత శ్రీరామ సాహిత్యము డా॥ బి. రామరాజుగారు ('కాంగ్రెస్' పత్రిక వరంగల్. "భద్రాద్రి శ్రీరామనవమి ప్రత్యేక సంచిక" 1966. పుటలు-39-45)

మహాభారతము వైదిక పునరుద్ధరణకై తెనుగున వ్రాయబడినదని వాడుక. శైవమత ప్రచారమునకు వీరశైవ వాఙ్మయ ముప్పతిల్లినది. రాయలకాలమునందు ఆముక్తమాల్యద వంటి గ్రంథములు కొన్ని వైష్ణవ మత వ్యాప్తికై బయలుదేరినవి. కాని - ఏమత ప్రసక్తియులేక వైదిక శైవములకు అపవాద మోయన్న విధముగా రామాయణ కథారచన 9. 10 శతాబ్దములనుండి అవిచ్ఛిన్నముగా సాగుచు నేటివరకు తెనుగు సాహిత్యములో అన్నివిధములైన సాహిత్య ప్రక్రియలయం దభివృద్ధి గాంచినది. అచ్చ తెనుగు - ద్విపద - శ్లేష - నిరోష్ఠ్యమేగాక - చివరకు అవధు లతిక్రమించి తిట్టుకావ్యశాఖయందును చేరినది.

చిత్ర కవిత్వశాఖలో సంస్కృతాంధ్రములయందు రామాయణ రచన సాగినది. 'చతుశ్చిత్రగర్భ శ్రీరామాయణ సంగ్రహము' - మొదలగునవి బయలుదేరినవి.[3] తెనుగునందలి కవిత్రయమును రామాయణ రచన చేసిన వారే నన్నయ రాఘవాభ్యుదయము వ్రాసెనట దీనిపేరు రామకథనే సూచించుచున్నది. తిక్కన రామాయణము సుప్రసిద్ధమైనదే. ఎఱ్ఱన రామాయణము వ్రాసినాడు. కొన్ని పద్యములు మాత్రము లభించినవి. ఈ విధముగా కవులు జన్మసాఫల్యముకొరకు రామాయణ కథారచన చేసినారు.

## దశరథరాజనందన చరిత్ర

## ప్రతులు - పరిష్కరణ

శతఘంటావధాన - ఆసూరి మరింగంటి సింగరాచార్యుల కృతులు చాల గలవు. దొరికినవి మాత్రము - 1 దశరథరాజనందన చరిత్రయను నీ నిరోష్ఠ్యరామాయణము, 2 శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకళ్యాణము - అను రెండు కృతులు మాత్రమే!

దశరథరాజనందన చరిత్ర ప్రప్రథముగా 1917లో ముద్రణమైనది. ఈ విషయము తెలియకనేమో! "సారస్వత సర్వస్వము" వారు (తణుకు)

---

3. సంస్కృత వాఙ్మయమున గర్భకవిత్వము లేదా? ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులుగారు. (భారతి 1963 ఏప్రిల్. పుట 73-75.)

సం. 1 సం. 1, మరియు సం. 1 సం. 2 లందు 1917లో ప్రథమాశ్వాసమును మాత్రము ప్రచురించినారు. గ్రంథము ముద్రణమైనదని తెలిసి ప్రథమాశ్వాసముతోనే ఆపివేసినారు. 1917 లో ముద్రణమైన దశరథరాజనందన చరిత్ర ప్రతులు రెండు నాకు లభించినవి. వీనిలోనొకటి సూర్యాపేటనుండి మిత్రులు మరింగంటి పురుషోత్తమాచార్యులవారు పంపినది, వేరొకటి – మానాయన గారు – శ్రీమాన్ శ్రీపెరుంబూదూరు రాఘవాచార్యులవారు సంపాదించినది.

వీనితో నేను కాపీ సిద్ధముచేసినాను. రెండు ప్రతులను 'సిరివరించిన మేలు—' ఇత్యాది పద్యమునుండి ఐదాశ్వాసములు పూర్తిగాగలవు. కవరు పేజీలులేవు. ముద్రణ సంవత్సరము తెలియదు. ('ఆంధ్రవాఙ్మయ సూచిక' 1917 లో నీగ్రంథము ప్రచురణమైనట్లు సూచించుచున్నది.) గ్రంథాలయములలో కడుప్రాచీనమైన – రామమోహన గ్రంథాలయము (విజయవాడ) వారివద్ద ద.రా.సం.చ. ప్రతి గలదను నాశతో కార్యదర్శి గారికి లేఖ వ్రాసినాను. వారు 11–9–1969 నాటి లేఖయందు ద.రా.సం.చ ముఖపత్రము – కొన్ని వివరములు తెలియచేసినారు.[1] ద.రా.సం.చ ముఖ పత్ర మిట్లు గలదు—

ప్రథమ కుసుమము

శ్రీ

ఆంధ్రసారస్వత గ్రంథమాల
మేనేజరు

నేతి వెంకటనరసింహశాస్త్రి
జగ్గయ్యపేట.

---

1. నాకు ఈ విషయములు వ్రాసిపంపిన గ్రంథాలయ గౌరవ కార్యదర్శులైన శ్రీ వేల్పూరు రామకృష్ణరావుగారికి (M.Sc., LL.B.–వకీలు) కృతజ్ఞుడను.

దశరథరాజనందన చరిత్రయను

నిరోష్ఠ్యరామాయణము.

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు
బి. కే. స్వామిచే
ముద్రింపబడియె.
1917

ఇతరులకు 0-12-0 ,,

ఈ కవరుపేజి రెండవవైపున 'చందాదారుల పద్ధతులు' తెల్పబడినవి, క్రింద-

జగ్గయ్యపేట.

మరిగంటి శ్రీనివాసాచార్యులు
శ్రేయోభిలాషి.

అని గలదు,

మొదటి పేజీలో—'కేయూరాణి న భూషయన్తి.........' శ్లోకము-
తరువాత నీవిషయము గలదు -

"ఆంధ్రభాషాభిమానులారా !

మరిగంటి సింగరాచార్యుం డను పూర్వకవిచే రచింపఁబడిన యీ నిరోష్ఠ్యరామాయణము లోకములో నిదివరకుఁ బ్రసిద్ధమై యున్నది. కాని ముద్రితంబై యుండలేదు. ఈ గ్రంథము మహాదోషపూరితమై యున్నది,దాని సవరింప వీలు కన్పింపదయ్యె. రెండు మూడు ప్రతులఁదెప్పించి చూచినను నొకదానికన్న నొకటి దోషభూయిష్ఠమై యున్నది. కాని సరియగుప్రతి దొరకదయ్యె. ఇట్టిదాని సవరింప నారంభించితిమేని గాలికి పోవు కంపను మీద వేసుకొన్నట్లగునని యున్నది యున్నట్లుగా వ్రాసి ముద్రింప నయ్యెను. అయినను ద్వితీయ ముద్రణమునందు కొన్ని దోషములు సవరింపబడును. గావున నాంధ్రభారతీమతల్లి యందలి భక్తిచేతను గవితయందెల్లఁ గష్టమగు నిరోష్ఠ్య

నియమమందలి గౌరవంబుచేతను నీగ్రంథము నాదరించెదరుగాత. ఏతద్గ్రంథ కర్త చరితము తద్వంశవర్ణనంబునందును గద్యమునందును వ్రాసియున్నది గనుక దిరుగవ్రాయుట యనవసరము.''

జగ్గయ్యపేట.

ఇట్లు
శ్రీమత్తిరుమలైనల్లాన్ చక్రవర్తి
జగన్నాథ తిరువేంకటాచార్యార్
లేఖనకర్త.

ఈ పేజీ తరువాత 'భూమిక' గలదు.అందు గ్రంథమాలవారు వేయు రచనలను గూర్చిన నియమములున్నవి.

క్రింద —

జగ్గయ్యపేట— నున్నాసీతారామానుజాచార్యులు
సంపాదకుడు.

అని కలదు.

(1917 లో ప్రచురింపబడిన ప్రతి పద్ధతి యిది. ద్వితీయ ముద్రణము కాలేదు కావున వారికి ప్రతిని సవరింప వీలులేకపోయినది.

వారు వ్రాసినట్లు ముద్రిత ప్రతియందు దోషములు హెచ్చుగా కలవు. అచ్చుపొరపాట్లు కోకొల్లలు. అర్ధానుస్వారములు, శకరరేఫలు, స్వైర విహారము చేసినవి. సంధి, విసంధి—యనునవిగూడా లేవు. ప్రస్తుత పరిష్కరణ సందర్భమున నేను తాళపత్ర ప్రతులతో సరిచూచి దీనిని సాధ్యమగునంత వరకు మంచిగా సిద్ధముచేయ వలయుననుకొన్నాను.

1. హైదరాబాదునందలి లక్ష్మణరాయపరిశోధక మండలిలో నొక తాళపత్ర ప్రతియున్నట్లు ఆదిరాజువారు, శ్రీ రామరాజుగారు తెల్పినారు నేను దానికై ప్రయత్నించి — దుర్లభమగుటచే విరమించినాను.

2 కనగల్లులో — 'తాళపత్ర గ్రంథ నిలయము' జాబితాచూడగా ఒక ప్రతి గలదని తెలిసినది. కాని — ఈ గ్రంథమేగాక మరికొన్నియు పరహస్తగతములై చాలాకాలమైనదని — మిత్రులు వ్రాసినారు.

3 మదరాసు, కాకినాడ, తిరుపతులయందలి ప్రాచ్యపుస్తక భాండార ములలో నీప్రతి గలదని కేట్లాగులలో గలదు. ఆయా గ్రంథాలయాధి కారులకు కొన్ని ఉత్తరములు వ్రాసి, వ్రాయించి ప్రత్యుత్తరమైనా పొందలేకపోయినాను. మదరాసు ప్రతియే తిరుపతి చేరినదని తరు వాత తెలిసినది.

4. సూర్యాపేటనుంచి పురుషోత్తమాచార్యులవారు ఒక సమగ్ర లిఖిత ప్రతి పంపినారు.

5. మాయింటిలోనొక లిఖిత ప్రతియందు ఈ గ్రంథము, నిరోష్ఠ్య సీతా కల్యాణము వ్రాసియున్నవి. ద.రా.సం.చ.అటనట కొన్ని పద్యములు గలవు. ని.సీ.క. తృతీయాశ్వాసము చివర జీర్ణమైనది.

6 మహబూబ్‌నగరవాసులైన మిత్రులు 'సాహిత్య సంశోధకులు' శివశ్రీ హస్నాబాద నాగలింగశివయోగిగారు నాతోపాటు ఈ గ్రంథ ప్రతు లకై యన్వేషించి చివరకు ఒకతాళ పత్ర ప్రతి పంపినారు. ప్రథమా శ్వాసమున చాల పద్యములు లేవు. పంచమాశ్వాసమును అట్లే. మొత్త ముపై అసమగ్ర ప్రతియైనను కొన్ని కొన్ని చోట్ల మంచిపాఠముల నిచ్చినది.

7. వీరే 10 పత్రములుగల ప్రతి యొకటి (తా. ప్ర.) తరువాత పంపిరి. ఎచ్చటనోగాని ఇది యుపయోగించినది.

దొరికిన తాళపత్ర లిఖిత ప్రతులతో ఈ గ్రంథమును సవరించినాను. నా పరిష్కరణలో పాఠముల కుంచిన గుర్తులు :

'శి'–శివయోగిగారొసంగిన తాళపత్రప్రతి నెం. 140
'గ'–వీరొసంగినదే 10 పత్రముల ప్రతి..నెం. 475

(ఈ సంఖ్యలు వారివద్దగల తా.ప.ప్రతుల వరుస నెంబరులు).

'వ్రా'–వ్రాతప్రతుల పాఠము.

'ము'–ముద్రితప్రతి (ప్రథమముద్రణ) (1917) యందు సరసముగా తోచని పాఠములకు, సంశయములుగానున్న ప్రశ్నార్థకచిహ్న ముంచనైనది.

'సా'–సారస్వత సర్వస్వమునగల పద్యములు పాఠములు. ఈ సందర్భములో సరియైన పాఠములు లభించకపోవుటయు లభించినబాగులేకపోవుటయు పైగా నిరోష్ఠ్యనియమ మగుటయు మిక్కిలి బాధ కలిగినది. నేను స్వయముగా వరంగల్లుకు వెళ్లి కొద్ది దినములున్నాను. ఆచార్య రామరాజుగారు ఎంతో ఓపికతో పాఠముల సూచించి నా చిక్కును దూరము చేసినారు. వీరితో పాటు డా॥ సుప్రసన్నగారును, శ్రీలక్ష్మణమూర్తిగారును తోడుపడినారు. వీరి సాయములేనిచో ప్రతి యీమాత్రమైనను సిద్ధముగాక పోయెడిదేమో?

'ము'–ప్రతి 'సిరివరించినమేలు....' ఇత్యాదిగా గ్రంథ మారంభమగును. సారస్వత సర్వస్వము నందు, "శ్రీరామామణి . . ."అను పద్యముతో ప్రథమాశ్వాస మారంభమగుచున్నది-కావున 'సా'-లోని మొదటి పద్యమును చేర్చినాను.

'ము'-లో 'లేఖన కర్త' కొన్నికొన్ని చోట్ల పూరించినట్లు వ్రాయబడినది. ఆ ప్రథమాశ్వాసము (1-56) 'ఐనను సూనహీను....'అను పద్యము తరువాత నుండి కుండలీకరణ చిహ్నముంచి 75 నెం. వచనముతో పూర్తి చేసినాడు. ఈ మధ్యభాగము పూరింపబడినదట.

చతుర్థాశ్వాసము 48 సంఖ్య పద్యములోను కుండలీకరణ యుండెను. 'శి' ప్రతిలో పాఠము లభించినది. దానినొసంగి పూర్వపాఠము పుటయడుగున చూపినాను.

పంచమాశ్వాసము:- 'జయహృషీకేశ....' (188 పద్యము) అను దానికి. 'దితితనయాదితేయ . . .' పాఠాంతర మొసంగిరి.అట్లే యుంచనైనది.

పంచమాశ్వాసము చివర నాగబంధ ఖడ్గబంధములు గలవు. 'ము' ప్రతి ప్రకార మా పద్యములను బంధములో వేసి చూచిన కుదురలేదు. వానిని సవరించి సరియైన పాఠమును నిర్ధారించు కొనవలసివచ్చినది. ప్రస్తుత ముద్రణ యందలి బంధములలో నా సవరణపాఠముల నిచ్చినాను. పుటయడుగున పాతపాఠముల నిచ్చినాను.

ఎక్కడెట్లు సవరించినది యిచ్చట వ్రాసినచో విస్తృతియగుటయేగాక 'పాఠపరిశోధన' గ్రంథమగును! ఆయా స్థలములలో పాఠసూచన చేయనైనది.

'శి' ప్రతిలో కొన్ని పద్యములు, ఒక వచనము హెచ్చుగా లభించినవి వానినట చేర్చినాను.

ప్రస్తుతగ్రంథ ఆశ్వాసాంత్యగద్యకును. 'శి' ప్రతిగద్యకును తేడాగలదు. సమగ్ర ఆంధ్ర సాహిత్యము (8 సం.) 'సారస్వతసర్వస్వము' నందును గల గద్యలు ఒకదాని నొకటి భేదించుచున్నవి.

'శి' ప్రతి గద్య యిట్లున్నది.

ఇది శ్రీమల్లక్ష్మీ నృసింహావతార వేంకటేశ్వరవరప్రసాద లబ్ధ సకలైశ్వర్య ధురీణ, యంధ్రభాషా నిరోష్ఠ్యాది వింశతి ప్రబంధ నిర్మాణపారీణ, మౌద్గల్యగోత్ర పవిత్ర, తిరుమల దేశిక పౌత్ర, తిరువేంగళాచార్య పుత్ర, మరింగంటి సింగరాచార్య ప్రణీతంబైన దశరథరాజనందన చరిత్రంబను మహాకావ్యంబునందు....ఆశ్వాసము".

పూర్వముద్రణము గద్యమే యిందు గలదు. 'సారస్వతసర్వస్వము' లోని పద్యములకును ఇందలి పద్యములకును చాలా భేదముగలదు. వానిని 'అనుబంధము' లో నిచ్చినాను. శుద్ధాంధ్రనిరోష్ఠ్య సీతాకల్యాణ కృత్యాదియు, ద.రా.సం.చ.గద్య పద్యసూచికయు యనుబంధముగా నొసంగనైనవి.

## *దశరథరాజనందనచరిత్ర - కృతివైశిష్ట్యము:*

సింగరాచార్యులకు పూర్వము తెనుగు సారస్వతములో నచ్చటచ్చట నిరోష్ఠ్యపద్యములు మాత్రము కొన్నిగలవు. కాని గ్రంథమంతయును నిరోష్ఠ్య రచనా సంప్రదాయముతో నిర్వహించినవాడు లేరు. సింగరాచార్యులే యట్టి గ్రంధరచన కాద్యుడు; రామాయణకథను తెనుగులో నిరోష్ఠ్యముగ చెప్పుటకును నిరోష్ఠ్యగ్రంథమునకును శ్రీకారమును జుట్టిన దీకవియని తెలిసినది.

సింగరాచార్యులేగాక మరికొందరను తెల్పినారు[1].

---

1. శాకల్యమల్లన సంస్కృతములో నిరోష్ఠరచనలను గూర్చి ప్రచురణములలో గలదు.

దశరథరాజనందనచరిత్ర గద్య పద్య వివరములు:—

| | |
|---|---|
| ప్రథమాశ్వాసము | 119 |
| ద్వితీయా ,, | 163 |
| తృతీయా ,, | 157 |
| చతుర్థా ,, | 179 |
| పంచమా ,, | 311 |
| మొత్తము | 929 గద్యపద్యములు[1] |

దశరథరాజనందన చరిత్ర యను నీ నిరోష్ఠ్యరామాయణము తెనుగు ప్రభువులుగా కీర్తి గడించి తెనుగుసారస్వత నందనోద్యానమును దివ్యకావ్యకుసుములచే గుబాళింపచేసిన గోలకొండ సుల్తా నగు ఇబ్రాహీం కుతుబ్షా యను నామాంతరముగల మల్కిభరాం కాలమున వెలసినది. ఈ ప్రభువు కవి పండిత పోషకుడేగాక స్వయముగా కవి. ఉర్దూసారస్వతములో ఈతడు ప్రముఖ కవులలో నొకడు. మనకు తెనుగు రాజకవిగా పరిచితుడు. అన్నయైన జంషీద్‌కు భీతిల్లి అళియరామరాయలవద్ద కొంతకాలమున్న కారణమున ఆ సమయములో రామరాజభూషణునితో పరిచయమై తెను గభ్యసించి అనుభవశాలియై తెనుగుతేటను గ్రహించినాడని వాడుక. ఈ రాజు కొలువు కవిపండితులకు లోటు లేనిదని తెలిసిన విషయమేగదా! ఈ కాలపు కవులలో అదృష్టాధ్వనీను లుభయులు గలరు; వారు పొన్నికంటి తెలగన్న, మన యీ సింగరాచార్యులు. వీరిద్దరును నూతనత్వమును సాహిత్యములో నవలోడన మొనర్చి కీర్తిగాంచుటయే గాక ఆయా శాఖలకు ఆచార్యత్వము వహించినారు. తెలగన్న యయాతి చరిత్ర అచ్చతెనుగు కావ్యము. (ఇదే మొట్టమొదటి యచ్చ తెనుగుకృతి యని భావించుచున్నాము గదా!)

దశరథరాజనందన చరిత్ర మొట్టమొదటిమారుగా ఆంధ్రసాహిత్యమున వెలువడిన తత్సమ నిరోష్ఠ్యకావ్యము. సింగరాచార్యులు దీనినేగాక

1. సారస్వతసర్వస్వములోనివి. 'శ' ప్రతిలోనివి గద్యపద్యము లిందు చేర్పలేదు. ఏ యాశ్వాసమున నేయే వృత్తముల వాడినాడో ఆ పట్టిక అనుబంధములో గలదు.

శుద్ధాంధ్రమునందును నిరోష్ఠ్యకావ్య రచనచేసి తెలగన్న కన్న ఒకటి రెండు మెట్లు ముందు వెళ్ళినాడు.

మల్కిభరాం ఆస్థానములో అష్టదిగ్గజము లుండెడివారట. వారెవరో ఏమి వ్రాసిరో తెలియదు కాని తెలగన్న, అప్పలాచార్యులు, అద్దంకి గంగాధరుడు, గణేశుఁడను సంస్కృతకవి, సింగరాచార్యులు (?) వారియం దుండ వచ్చును. గోలకొండ సామ్రాజ్యము, విజయనగర సామ్రాజ్యము రాజకీయ ముగా నప్పటికే(1550 తరువాత)కొంత కొంత ఎడ మొగము పెడ మొగముగా మారుచున్నను సాహిత్య విషయమున మాత్రము కవులు పరస్పరము కలిసి కొనెడివారు గావచ్చును. ఏమనగా రాజులు రాజులు కలహించుకొని పోట్లాడు కొనుచున్నను రాజకీయము లవధి చూచుచున్నను విద్యాధికులు, కవులు, పండితులు, సామాన్యప్రజానీకము మాత్రము ఆ కాలమున కలసి మెలసి యుండెడి వారు. ప్రభువులైనను అధికారదాహమునకే ఖడ్గముల నునుపుచేసి కొన్నారు గాని వానిని కవితారంగమునకు వినియోగింపలేదు. ఈ విషయము నిజ మనుటకు నాటి సాహిత్యము, వానియందు పోటీపడి చేసిన రచనలు ఆధారములు. అప్పటికే విద్యానగరమైన విద్యానగరరాజవీథులలో శ్లేష ద్వ్యర్థి రచనలు ప్రకాశమానములుగా నున్నవి. రామరాజ భూషణుడు పింగళి సూరన ప్రఖ్యాతు లైనారు. ఈ విషయములు గ్రహించి గోలకొండ కవులును నూత్నమార్గానుగాము లగుటకై యత్నించినారు. సాహిత్యములో నూతనత్వ మనునది ఒక విధముగా చిత్రకవితా పథములకే చేరును. అందు వలననే సింగరాచార్యులు ఈ రచనను చేపట్టినాడు.

ఇతని సమకాలపు కవులలో రచనాస్పర్ధ హెచ్చుగా నుండెనేమో! అద్దంకి గంగాధరకవి, తెలగన్న మరికొందరు సింగరాచార్యుల పద్ధతికి పైకి మాత్రమే తలయూపి యుండవచ్చును.

ఈ కాలము నందలి కవులలో భారత రామాయణ కథలను గైకొని స్వకపోలకల్పనలు చేసినవారు హెచ్చుగా గలరు. తపతీసంవరణోపాఖ్యానము భారతాంతర్గతకథ. యయాతిచరిత్ర రామాయణకథను హెచ్చుగాచెప్పినది. అప్పటికే భాస్కరకవి ఉన్మత్తరాఘవ (సంస్కృతం) నాటకము ప్రసిద్ధము గావచ్చును.

సింగరాచార్యులు ఇట్టిస్థితిలో రామాయణ రచనను నిరోష్ఠ్యముగా చేసినాడు. ఇది మూడు నాల్గు విధములుగా విశిష్టమైన గ్రంథము.

1. తెనుగులో మొట్టమొదటి నిరోష్ఠ్య గ్రంథము.

2. నరాంకితము గాదు.

3. అనవసరమైన వర్ణనలులేక ప్రబంధము లేదా కావ్యమునకు బరువును తప్పించినది.

4. 'దశరథరాజనందన చరిత్ర' యని కృతినామమును నిరోష్ఠ్యమే (కర్తృనామము గూడా నిరోష్ఠ్యమే).

సింగరాచార్యుల సమకాలపు కవులలో కొందరు ముఖ్యముగా తెలగన్న గంగాధరులు తమ కావ్యకన్యలను మహమ్మదీయ ప్రభువులకు, అధికారులకు నంకిత మిచ్చినారు.

యయాతిచరిత్ర కృతిభర్త అమీనుఖాను; ఇబ్రహీం కుతుబ్షా వద్ద మీర్ జుమ్లా పదవిలో నున్నాడు.

తపతీసంవరణోపాఖ్యానము మల్కిభరాముని కంకితము. (మహమ్మదీయ ప్రభువులు తెనుగు కావ్యకన్యల కృతిభర్త లగుటకు ప్రారంభమిచ్చట నుండియే. ఈ ప్రభువులను హిందూదేవతలు రక్షింతురు గాత.... అని ఇంక నేమో వర్ణనలతో గ్రంథావతారికలేగాక చాటువులును నాడు ఘోషించినవి). సింగరాచార్యులు మాత్రము ఈ పద్ధతికి భిన్నుడు కావుననే రాజాశ్రయములేని రచన ప్రసిద్ధిలోనికి రాలేదు. వీనివల్ల సాహిత్యములో రాజకీయములు క్రొత్తవని మనము భావింప వీలులేదు.

పింగళి సూరనకు ముందు వేములవాడ భీమన రాఘవపాండవీయము వ్రాసినట్లు వినికిడి. కాని సూరనయే యాశాఖ కాద్యుడైనాడు. సింగరాచార్యులకు ముందు తెనుగున నచ్చటచ్చట నిరోష్ఠ్యపద్యము లున్నవి, సంస్కృతములో నిరోష్ఠ్యరచన[1] (రామాయణము) శాకల్యమల్లన చేసి

1. తెలంగాణమున సంస్కృతములో నిరోష్ఠ్యరచన రామాయణముగనేగాక-శాసనముల యందును గలదు. ఈ విషయము-'సంస్కృతములో నిరోష్ఠ్యరచన' యను ప్రకరణమున చూచునది.

నట్లు తెలియుచున్నది. సింగరాచార్యులు తెనుగులో నిరోష్ఠ్య కావ్యరచనకే గాక శుద్ధాంధ్రములోను, శుద్ధాంధ్రనిరోష్ఠ్య కావ్యరచనలోనూ ఆద్యుడై అగ్రతాంబూల మంది నిరోష్ఠ్యశాఖ కాచార్యత్వము వహించినాడు. ఇది సింగరాచార్యుల దశరథరాజనందన చరిత్ర విశిష్టత. ఇక నితని నిరోష్ఠ్య నియమమును తెలిసికొందము.

## *నిరోష్ఠ్యరచనా సంప్రదాయము :*

తెనుగుసాహిత్యమునందు గ్రంథమంతయు నిరోష్ఠ్యరచనా సంప్రదాయము ననుసరించి వ్రాసిన కావ్యములలో దశరథరాజనందనచరిత్ర ప్రథమమైనది గావున - ద.రా.నం చ. లోని నిరోష్ఠ్యనియమమును తెలిసికొనుటకు ముందు - ఓష్ఠ్యనిరోష్ఠ్యముల తెలిసికొందము.

***ఓష్ఠ్యములు :*** ఓష్ఠమనగా పెదవి. వర్ణసమామ్నాయమందు పెదవుల సాహాయ్యముతో ఉచ్చరింపబడు - ప ఫ బ భ మ - యను నీ యైదు 'ప' వర్గాక్షరములు ఓష్ఠ్యములు: వీని నుచ్చరించునపుడు రెండుపెదవు లొకదాని కొకటి తగులును.

పై యయి దక్షరములే గాక అంతస్థములైన - య. ర. ల. వ లలో గల వకారమును - ఉచ్చారణాసమయములో పూర్తిగా పెదవులకు తగులకున్నను - ఓష్ఠ్యవర్ణముగా పరిగణితమైనది.

అచ్చుల యందును ఓష్ఠ్యములు గలవు - ఉ. ఊ. ఒ. ఓ. ఔ-అను నీ అయిదును 'వ' వర్ణము వలెనే పెదవుల సహాయముతో నుచ్చరింపబడును.

వర్ణాక్షరములయందును 'ప' వర్ణమును మినహాయించి పైన చూపిన యచ్చులతో కూడిన హల్లులు - అనగా క. చ. ట. త వర్ణములకు సంబంధించిన యక్షరములును ఓష్ఠ్యము లగుచున్నవి:

***నిరోష్ఠ్యములు :*** అచ్చులలోని అ ఆ ఇ ఈ ఎ ఏ ఐ - అనునవి పెదవుల సాయము, సన్నిహితత్వము ఉచ్చారణా సమయములో నావశ్యకము లేనివి గావున నివియును - వీనితో గూడిన హల్లులును నిరోష్ఠ్యము లన బడును.

ర, రీ, ళ, ళీ లు గ్రాంథిక వ్యవహారమునందు నిరోష్ఠ్యములుగానే యున్నందువలన నివియును నిరోష్ఠ్యములుగా పరిగణితములు. పై విషయము ననుసరించి – ఉ, ఊ, ఒ, ఓ, ఔ లును, వీనితో గూడిన హల్లులును, ప,ఫ,బ, భ, మ లును అంతస్థమైన వకారమును ఓష్ఠ్యములనియు –

అ ఆ ఇ ఈ ఎ ఏ ఐ అనునవియు – వీనితో కూడిన హల్లులు – కవర్గాది పంచమాక్షరములు – అనగా ఙ ఞ మరియు అనుస్వారము, ఈ విధముగనే అచ్చులయందున్న ఋ ౠ ఌ ౡ అనునవియు ఓష్ఠ్యధ్వను లుగా పరిగణింప బడుచున్నవి.

(ఋ ౠ లకు, 'ఇ' కారధ్వని నియతముగా నిరోష్ఠ్యముగా పరి గణితమగుట వలననే ఋ – ఇ – ర – లకు యతి చెప్పబడిన దనవచ్చును). సింగరాచార్యులకు పూర్వము అచ్చటచ్చట మచ్చునకు నిరోష్ఠ్యరచన గ్రంథ ముల యందు చూపిన వారు కొందరు గలరు. వారిలో నాచనసోముడు ప్రథముడు. ఉత్తర హరివంశములో –

'చని చని కాంచె నంత ఋషి సంహతి సారసకేసరాంతరా
సన సరసాళి సంగదట చందనశాఖి చలత్తరంగ కాం
చన సరసీ జలార్ద్రయతి సంచిత సైకతలింగ గంగనం
జనగిరిగాఢ గంధగజ సంగతశృంగరథాంగ నత్తరిన్ (1 – 106).

ఇట్టి వానిని చూచియే పాటోలు – పిన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో నిరోష్ఠ్యలక్షణముల నిట్లు తెల్పినాడు.

లక్షణము :–

పంచమవర్గాక్షరములు
వంచించి హితోచిత్రార్థవంతంబులు గా
వించిన కబ్బము వీనుల
కంచితమై యది నిరోష్ఠ్యమన నొప్పారున్. (6 – 44)

లక్ష్యము :–

చాళుక్యక్షితినాథు నూర్జితయశస్సంక్రాంతిచే దూలు లో
కాలోకాద్రిఁ దనర్చు చీఁకటులు కైలాసోల్లసద్దీధితుల్

సాలంపెల్లని చాయలం దనరు నాశాదంతు లంతంతకున్
గాలాకారత నుజ్జగించు ననుచుం గాఢింతు రత్యుక్తులన్. (6 - 45)

పెద్దన దీనిని నిరోష్ఠ్యముగా నుదాహరించినను దండి [1] - సోముల పద్ధతి ప్రకారముగా నిరోష్ఠ్యమన వీలులేదు.

అప్పకవీయములో నిరోష్ఠ్యమునకు లక్ష్యలక్షణము లిట్లు గలవు.

లక్షణము :- పావన పాఫాబాభా
మావాయను నాలుగిపులు మఱి బద్యములో
భావింప దొరలకుండిన
భూవలయమున న్నిరోష్ఠ్యము పిసాళించున్ :

లక్ష్యము :- నరహర్యక్షు దయాకర
కరిరక్షణ చక్రహస్త కాంచనచేలా
గరుడతురంగ జనార్దన
ఖరదైత్యనికృంతన హరి కంజదళాక్షా. (4 - 552, 553)

అప్పకవి లక్షణమునందు అచ్చులగూర్చి లేదు. ఇతనికి ముందు లక్ష్యలక్షణములు గలవుగదా! వానిని చూచెనో? లేదో. రు, తు లను అప్పకవి నిరోష్ఠ్యములుగా వ్రాసెను. ఇవి ఓష్ఠ్యములుగదా! ఈ లక్షణమును సంశయాస్పదమే యనిపించుచున్నది.

## ద. రా. సం. చరిత్రయందలి నిరోష్ఠ్యనియమము :

తెనుగుసాహిత్యములో లభించినంతవరకు ప్రప్రథమ నిరోష్ఠ్య గ్రంథమైన దశరథరాజనందన చరిత్రయందు సింగరాచార్యుల నిరోష్ఠ్యనియమమును తెలిసికొని - అనంతర నిరోష్ఠ్యరచనలు, సింగరాచార్యుని ఆచార్యత్వము నరయుదము.

దశరథరాజనందనచరిత్ర - కృత్యాది - కృత్యంతముల యందు నిరోష్ఠ్యనియమము లేదు - కథాభాగమునందు మాత్రమే యిట్టి నియమమున్నది. ఓష్ఠ్యవర్ణములైన ప. ఫ. బ. భ. మ - యను నక్షరములను కవి కథాభాగములో నెచ్చట నుపయోగింపలేదు.

1. దండి పద్ధతిలో - ఉ. ఊ. ఒ. ఓ. ఔ లను ఓష్ఠ్యము లనవచ్చును.

'దండి' మతప్రకారముగా పవర్గ వ్యతిరిక్తములైన వర్ణాక్షరములకు ఉ. ఊ. ఒ. ఓ. ఔ. లతో కూడిన హల్లులు నిరోష్ఠ్యములయందు చేరవు. తెనుగున విన్నకోట పెద్దన మతప్రకారముగా నవి నిరోష్ఠ్యములు. సింగరాచార్యులు పెద్దన నియమానుసారముగా నావర్ణముల ధారాళముగా వాడి యున్నాడు [1] -

ఐనను సూనహీనుఁ డగునట్టిడు........ (1 - 56)

ఇత్యాది పద్యమునందు పైవర్ణములు హెచ్చుగా నున్నవి. కావున సింగరాచార్యుల పద్ధతి పెద్దన లక్షణముతో సరియగును. తనకు ముందు నిరోష్ఠ్య కావ్యరచనలేదు గావున సింగరాచార్యులు ప్రత్యేకముగా నీ సాహిత్య ప్రక్రియను నెలకొల్పుటకై యెంతయో శ్రమించె ననవచ్చును. ఇట్టిరచనలు సామాన్యులు చేయునవికావు. శబ్ద శాస్త్ర నిష్ణాతులైన కవులే దీనిని సాధింతురు.

నేడు మన పద్ధతి యెట్లున్న దనగా - ప్రాచీనకావ్యము లందును, వాని యందు ప్రదర్శితమైన కవితాకళయందును, విశిష్టమైన సాహిత్య సంప్రదాయములయందును అభినివేశములేదు. వ్యాసంగమూ తగ్గినది. ఇట్టి పద్ధతిలోనున్న మనము పై విధమగు రచనలను 'సర్కసుఫీట్లు' గా భావింతుము. దానికి మన మాశ్చర్యపడవలసిన యవసరము లేదు. ఐనను ఒక సమగ్రమైన వాఙ్మయచరిత్రకు - ఈ విధమైన సాహిత్య ప్రక్రియ మాత్ర మవసరమని గ్రహింప వలయును. కావున వీనియొక్క క్రమపరిణామములను - అనగా తెనుగునందును - సంస్కృతమునందును గల నిరోష్ఠ్య గ్రంథములను - రచనలనుగూర్చి తెలిసికొనుట ఆవశ్యకము.

## తెలుగు సాహిత్యములో నిరోష్ఠ్యరచన

తెనుగులాక్షణికులు - ఆశు - మధుర -చిత్ర - విస్తరములని తెలుగు కవితను నాలుగు భాగములుగా విభజించినారు. వీనినే చతుర్విధ కవిత లందురు[2]. వీనిలో చిత్రకవితయందు నిరోష్ఠ్యరచన శబ్దచిత్రకవితగా పేర్కొన

1. ఈవిధమైన పదముల పట్టిక "భాషావిశేషము" లను శీర్షికలో గలదు;
2. చతుర్విధ కవితల గూర్చి చూ. తెలుగు ఛందోవికాసము (1962) సంపత్కుమార (పుటలు 209-225)

బడినది. లక్షణదీపికయను గ్రంథములో పొత్తపి వెంకటరమణ కవి—యీ విధముగా వ్రాసినాడు -

"చిత్రకవిత్వం బన్నది పాదగోపనంబును, పాదభ్రమకంబును, నామగోపనంబును, అనులోమ విలోమ గతిపద్యంబులు, కందగీతిగర్భిత వృత్తములు............ఓష్ఠ్య, నిరోష్ఠ్య సంకర, జిహ్వా, అచలజిహ్వా వృత్తంబులును............కంకణబంధ సర్వతోభద్ర కవికల్పితకల్పవల్లి నివి యాదిగా గల్గు బహువిధ చమత్కారంబులు రచియించుటం జేసిన చిత్రకవిత్వంబు[1].

ఈ పై విభాగమును అప్పకవి యంత స్పష్టమగునట్లు చెప్పకున్నను - నిరోష్ఠ్య రచనలను చిత్రకవితగా చెప్పినాడు-

సీ॥ అనులోమమును విలోమమును, నిరోష్ఠ్యమును దల
కట్టు గుడులు శృంగములు నక్ష
ర విలోపమును............

తే॥ ఖ్యాతిని చిత్ర కవిత్వ ప్రసిద్ధనామ
ధేయములచేతఁ బెంపొంది తెలివిమీఱు.... (అప్ప. 4-549)

అటుతరువాత తెనుగు ప్రబంధ - కావ్యకర్తలు ఏదో ఒక సందర్భముగా నీ చిత్రకవితా ప్రస్తావన చేసినారు. వారిలో నన్నయ - భారతము, శ్రీనాథుడు - శృంగార నైషధము, తరువాత వెన్నెలకంటి అన్నయ్య - తాళ్ల పాక చిన్నన్న - పింగళి సూరన - గణపవరపు వేంకటకవి - శేషము వేంకటపతి - ముద్దుపళని - మొదలైనవారు.

కొందరు - ఆ పద్ధతిలో పద్యము లొక్కటియో రెండో వ్రాసిరి. మరికొందరు గ్రంథములే వ్రాసినారు.

తెనుగు సారస్వతములో ప్రప్రథమముగా నిరోష్ఠ్య రచనను మచ్చునకు చూపిన కవి నాచన సోముడని తెలిసికున్నాము. మన సారస్వతములో నే రచనయైనను తనకు ముందు కావ్యములయందు విశిష్టము - నూతనము

---

1. ఉదాహరణ వాఙ్మయచరిత్ర (1968 ముద్రణ) శ్రీ నిడుదవోలు వెంకటరావు పుట-15

నైన పద్ధతి ఏ ఒక్క పద్యముననున్నను దాని ననుసరించి ఒక కావ్యమే వ్రాయుట పరిపాటి యైనది. పొన్నికంటి తెలగన్న ఈ విధముగనే అచ్చతెనుగు కావ్యరచన చేసినాడు. 'అచ్చతెనుంగుఁ బద్య మొకటైనను......' అను పద్యము పై భావమును వ్యక్తపరచుచున్నది.

నిరోష్ఠ్య గ్రంథకర్తలును-కొన్ని నిరోష్ఠ్య భాగముల చూచియే గ్రంథరచన చేసినారు. నిరోష్ఠ్య భాగములుగల రచనలగూర్చి తెలిసికొందము.

***1. కొఱవి గోపరాజు*** : (1400 ప్రాం.) 'సింహాసన ద్వాత్రింశిక' [1]బొమ్మకథ-యందు ఒక నిరోష్ఠ్య దండకమును వ్రాసినాడు. అందునుండి కొంతభాగము—

'జయకృష్ణ! జయకృష్ణ! కృష్ణ! స్థిరాస్యందనస్థాన, నానాదిన ధ్యాన, నానాసితానేక సేనారజోనీకరథ్యాతి, రథ్యాళి సన్నాహసన్నద్ధ, రాజన్యగతానన్య, సాదృశ్యదృశ్యాంగ, హృష్యజ్జరాసంధ సంధానయంత్రాది యత్నక్షయాదాయ నీతిశ్రితాసారసారాంతర జ్ఞానదాసాహిత ధ్యాన....... గణ్యాకృతిచ్ఛాయ రాధానిరంతస్తనాద్రి స్థలక్రీడనాయత్త చిత్త, స్థిరాసక్తి లీలానటీరంగరంగస్థలీసాధనాహృష్ట........... ధారాళ ధారాధరాకాశ నీలాంజనేందిందిరానీల సచ్ఛీకరగ్రాహకాళింది హేలా.... ........ కాంతిచ్ఛటాకాంత సంధానితాలీల, లీలాలసచ్చారిణీ, గీతనీరేజ సచ్చారిణీ రాజరాజాగ్రణీ—

ఇది పెద్ద దండకము - కొంత ముక్తపదగ్రస్తముగా గలదు.

2. ఇతని తర్వాత నిరోష్ఠ్య దండకము వ్రాసినవారు - ***ముడుంబ లక్ష్మణాచార్యులు*** : బేతవోలు సంస్థానములో నుండెడివాడు. (120 సంవత్సరముల క్రింద) నందనందన విలాసమును - లక్షణా కల్యాణమునందు - (చతుర్థాశ్వాసమున 101) నిరోష్ఠ్యగణసమ దండకము వ్రాసినాడు[2] -

---

1. సింహాసనద్వాత్రింశిక 4-24 (పుటలు 139-140. 1960 ముద్రణ. ఆంధ్రసాహిత్య పరిషత్తు, కాకినాడ)

2. ముడుంబ లక్ష్మణాచార్యులు - నందనందనవిలాసము (భారతి జులై, 1967)'శ్రీ'

"జయజయ జలారాశి కన్యాస్తనాగ్రస్థ లీన్యస్త కస్తూరికాచిహ్నితోరస్థ్సలా, కుండలాలంకృతాదర్శగండస్థలా..........రాజితశ్రీ యశోదాయకా శత్రుసంసద్ధరత్నాయకారాధికానాయకా ధీరతా నిందితార్ణోధికాంచీధరా, కంజరాగాధరా, రక్షిత శ్రీధరా శ్రీధరచ్ఛ్రీ..........."

**3. గోవర్ధనం వేంకట నరసింహాచార్యులు:** ఈ కవి మిర్యాలగూడెం తాలూకా విఘరాముపేట వాస్తవ్యుడు (1856-1935.) సారంగశైల మాహాత్మ్యమను నైదాశ్వాసముల ప్రబంధము (అముద్రితము) నందు నిరోష్ఠ్య దండకము గలదు.[1] రచనలలో నిరోష్ఠ్య పద్యములను తెల్పిన కవులు—

**4. మూర్తికవి:** విన్నకోట పెద్దన తరువాత ఈ మూర్తికవి తన కావ్యాలంకార సంగ్రహము నందు ఓష్ఠ్య-నిరోష్ఠ్య వర్ణములు గల పద్యముల వ్రాసినాడు.

ఓష్ఠ్యము :— భూమిసుమనోమరద్రుమ
భామాప్రద్యుమ్న! భానువంశోద్భవ! పౌ
లోమీవిభుశుభవైభవ!
భీమోపమ! భీమ! భీమ! పృథుదోర్విభవా! (2-175)

ఓష్ఠ్య నిరోష్ఠ్యసంకరము :—
భూనాథోత్తమ! జంభభంజనహరీ భోగాభిరామశ్రియా
దానోజ్జృంభిత వారిపూర భరితోద్యద్వార్థివీచీ వ్రజా!
మానామేయ సుధాబ్ధి నిర్మలగుణా! మాద్యన్మహోయూథప
శ్రీ నూత్నప్రథమాన భాగ్యవర! వైరివ్రాతభేదవ్రతా! (4-89)

మొదటి పద్యములో మూర్తికవి ఉత్వవర్ణముల వాడినాడు. సంస్కృతమున దండిమత ప్రకార మవి ఓష్ఠ్యములు. మొదటి పాదములో 'మరద్రుమ' అని గలదు. 'ర' నిరోష్ఠ్యము. అది 'మరుద్ద్రుమ' గావచ్చునేమో!

---

1. గోవర్ధనం వేంకట నరసింహాచార్యులు-కృతులు (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సం. 57. సంచిక-1, 3. కీలక-చైత్ర. వైశాఖ: శ్రావణ, భాద్రపద).

రెండవ పద్యము ఓష్ఠ్యనిరోష్ఠ్య సంకరను-అనగా ఒక ఓష్ఠ్యవర్ణము-దాని వెంబడే ఒక నిరోష్ఠ్యవర్ణము రానలయును. కాని ఈ పద్యమునందు క్రమభంగమైనది-జంభభంజన-అనుటకు 'జంభజంభన' అనియు-'రామ క్రియా' యనుటకు 'రామక్రమా'-అనియు సవరించుకొనిన కవి చెప్పిన నియమము సరిపడునేమో ?[1]

*5. గణపవరపు వేంకటకవి:* ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయవిలాసము-అప్పకవికి దాదాపు సమకాలీనుడు. మహాలాక్షణికుడైన గణపవరపు వేంకటకవి తన యీ రచనలో నిరోష్ఠ్యరచన చూపినాడు. ఈ గ్రంథ మొక విధముగా చిత్రకవితా సర్వస్వ మన వచ్చును. ఏకాశ్వాసమే యైనను ఒక పద్యములో నెన్నియో పద్యము లిముడ్చబడినవి. వాటి పేరే ముద్రణయందు ఒక పుట యగును[2]. అందుండి యొకటి రెం డుదాహరింతును-

'..................గర్భిత నిరోష్ఠ్యాచలజ్జిహ్వ స్రగ్విణీవృత్తము.'

నారదారాధనా నారతాహ్లాదితా
నీరదాళీ లసన్నీలతేజః శ్రితా !
సారదైత్యచ్ఛిదా చండచక్రాంచితా
శ్రీరసాలంకృతా శేషశైలస్థితా. (221పుట పూం,డ్లవారి....)

''అచుంబితరచిత చతుర్దళయమ కాన్త్యనియమ భరణగరిష్ఠ నిరోష్ఠ్య విరాజిత రగడరాజము''-

''కలికి కలికితనాన నానది గట్టిగట్టిగ నంటినంటిని
కలికి కలికచ నిన్ననిన్ననగాక గాకడకంటిగంటిని
జాలిజాలిచె నంతనంతట జాలజాలక నీతినీతిగ
నేలనేలకి లతికలతిన నీకనీకడ జాతిజాతిగ
సారసారస రాజిరాజిల సరససరసత చల్లిచల్లఁగ

---

1. కావ్యాలంకార సంగ్రహము-సన్నిధానం వారి 'వివరణ' (ద్వి. ము. 1959) 275, 558 పుటలు (వివరణ యందు 'సవరణ' చూపిన బాగుగా నుండెడిది).
2. సమగ్ర ఆంధ్ర సాహిత్యము 11 సం. లో విపులముగా కొన్ని పద్యముల విడదీసి చూపినారు. (పుటలు 159-181)

కేరికేరిస దాడిదాడిల కింకకింకలకెల్ల నెల్లగ
నాడనాడఁగ నాఁగ నాగజయానయానన గట్టగట్టఁగ
నీటనీడగనేల నేలకి నెచ్చనెచ్చలి దిట్టదిట్టగ
దరినిదరినిల లేకలేకల దండదండననంగనంగన
సరసిసరసిని సన్నసన్నెసంగ సంగతి నంగనంగన
నిచ్చనిచ్చన నయ్యోనయ్యోడ నెన్ననెన్నడ రేకరేకగ
నచ్చినచ్చిన కానికానిగ యాళియాళిది సాకసాగగ
కన్నెకన్నెటి కానగానల గన్నెగన్నెర చాయచాయఁగ
నెన్నినెన్నిన దాసదాసన కింతకింతగ డాయడాయఁగ
గదలి గదలికనలరె నలరేయి గాయగాయక నీడనీడఁగ
నదరి నదరహి సరిగసరిగయి సందెసందెల జాడజాడగ
రాగరాఁగ తలంకెలంకెగ రాకరాకడ లెక్కలెక్కడ
తీఁగతీఁగడి నిననీనని దేటదేటకి నిక్కనిక్కడ
నీటనీటన ననియనని యెంతేని తేనియ తేరతేరకె
చాటచాటన కాదకాదయ సందిసందిడ చీరచీరకె
నాతినాతిల కాళికాళిది నాగనాగకి కానకాననె
నీతినీతల కానకాన జనించనించదె నాగనాగనె
లలనలలనల తతినితతినిల లాగిలాగి గడించడించఁగ
నలినినలినిడ నిగ్గనిగ్గడ నాటనాటల నంచనంచఁగ
ననలననలన గతిగగతిగన నాచెనాచెయి గట్టగట్టఁగ
ననిచెనినిచెన నంగనంగ జయంతయంతట జిట్టజిట్టఁగ
చక్కఁజక్కని దంటదంటతె సంగసంగతి దాఁటదాటది
అక్కయక్కడి లీలలీలత నంటనంటని చాటచాటది
నీలనీలిని నాడనాడస నీచెనీచెన దాయదాయగ
రాలరాలఁగ నేయనేయల రంగరంగర కాయకాయఁగ
ముంతిముంతియె యేనయేనల నిండనిండఁగ నేననేనన
కాంతకాంత తతాళితాళిచె గలకలసికలసిరి తానతానన—'

6. కంకంటి నరసింహకవి : విష్ణుమాయా విలాసము. 1

పద్యములయందే గాక - ద్విపదలయందును నిరోష్ఠ్యరచన బయలు దేరినది. వారిలో మొట్టమొదటివాడు నరసింహకవి - కంకంటి పాపరాజునకు సోదరపుత్రుడు. 1868 లో ఈ గ్రంథము ముద్రింపబడినది. శ.ర. లో దీనినుండి కొన్ని ప్రయోగములు గైకొనబడినవి. 1965 ముద్రణగల కం. పాపరాజు విష్ణుమాయా విలాసము పీఠికలో నితనిగూర్చి గలదు. దీనిలో నిరోష్ఠ్యపదగ్రస్త ద్విపద గలదు-

ఇందిరాతటి దలంకృత దేహకంద
కందకందదశాని రక్షక్రియానంద .........
కారణకార్యాది కారణకృష్ణ
కృష్ణ జయాశయాహితశాఖ కృష్ణ
కృష్ణారిహరణ.................[1]

1. చిత్రకవి సింగరార్యుని-'బిల్హణీయము' 2 ఆ. చివర 'తారాయనతటినీ శత.......' నిరోష్ఠ్యకందము.

2. కాణాదము పెద్దన (1790 ప్రాం.) ముకుంద విలాసము.

3. కంకంటి పాపరాజు - ఉత్తర రామాయణము - (5-233)

4. మరింగంటి వెంకట నరసింహాచార్యులు - తాలాంకనందనీ పరిణయము. (3 ఆ. చివర సోష్ఠ్యనిరోష్ఠ్య కందము).

5. మాడభూషి వెంకటాచార్యులు - భరతాభ్యుదయము.

ఇట్లే మరికొందరును - తమ గ్రంథములలో నిరోష్ఠ్యరచన చేసినారు. సింగరాచార్యుల నిరోష్ఠ్య రామాయణము బయలుదేరిన తర్వాత ప్రత్యేకముగా నట్టి గ్రంథములే బయలుదేరినవి.

### నిరోష్ఠ్య సీతాకల్యాణము :

సింగరాచార్యుల నిరోష్ఠ్య రచనలు రెండును రామకథా పరములైనవే! తరువాత వచ్చినవానిలోగూడా రామకథా పరములైనవి కొన్ని

---

1. 'ఆంధ్రి' అను పత్రికలో - 'విష్ణుమాయా విలాసము - విమర్శ' - (1940 ఆగస్టు) శ్రీ నిడుదవోలు వెంకటరావు; (ఈ పత్రిక మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి సంపాదకత్వమున 1940 లో పిఠాపురము నుండి వెలువడెడిది).

గలవు. వానిలో పిడుపర్తి బసువప్ప విరచితమైన యీ నిరోష్ఠ్య సీతాకల్యాణము - అరివీర గండాంకిత బసువన్నృపాల తనూజుడైన పంటచింతభూపతికి (1650 ప్రాం.) అంకితము చేయబడినది. నాల్గాశ్వాసములు సంపూర్ణముగా గలదు. అముద్రితము[1] - అందుండి యొక పద్యము-

"అన్నగరి రాజసదనాం
ఛన్నగజద్రత్నకాంతి శశిదీధితి వ
చ్ఛిన్నగతి నెనయ రాకల
నెన్నఁగ గాళింది గంగనెనసిన రీతిన్"

చతుర్థాశ్వాస గద్య యిట్లు గలదు-

"ఇది శ్రీదక్షిణామూర్తి ప్రసాద సమాసాదిత సరససాహిత్యానువర్తి పిడుపర్తి బసువణాచార్య సత్పుత్ర బసువప్పకవి ప్రణీతంబైన సీతాకల్యాణ చరిత్రంబను నిరోష్ఠ్యకథా ప్రబంధంబునందు చతుర్థాశ్వాసము"-

*నిరోష్ఠ్య జానకీ కల్యాణము -*

శివరామాభ్యుదయ మను ద్వ్యర్థి కావ్యము వ్రాసిన పోడూరు పెద రామకవి సోదరుడు రామకవి యీ గ్రంథమును వ్రాసినట్లుగా

సీ. 'నీ తమ్ముఁ డసముఁడంచె నిరోష్ఠ్య జానకీ
కల్యాణ కృత రామకవివరుండు-'

అని శివరామాభ్యుదయ కృతికర్త - కృతిభర్తతో యనినాడట. ఈ గ్రంథ మలభ్యము[2]. శేషము తిరుమలాచార్యు లొక నిరోష్ఠ్య ప్రబంధమును రచించి నట్లు అంబరీషోపాఖ్యానము ద్వారా తెలియుచున్నది.

---

1. తంజాపూరి పుస్తకశాల - గ్రం. సం. 169. (గ్రంథసూచిక పుటలు- 38 - 39 .

2. ఆంధ్రకవుల చరిత్ర - కం. వీ. (3 భా. 275 పు. 1949 ము.) లభిం పని నిరోష్ఠ్య రచనలలో (వెణుతురుపల్లి) దిట్టకవి విశ్వనాథకవి-హారిశ్చంద్ర చరిత్ర. కవితరంగిణి. 12 సం 156 పుట. 1958 ముద్రణ.

సీ. రూఢి దలిర్ప నిరోష్ఠ్య ప్రబంధంబు
నిచ్చినారలు వేంకటేశ్వరునికిని.........'

*నిరోష్ఠ్య నలచరిత్ర* :-ధరాత్మజాపరిణయ మను ద్వ్యర్థి కావ్యమును బృహన్నారదీయ మను పురాణకథాకావ్యమును రచించిన క్రొత్తలంక మృత్యుంజయకవి 5 ఆశ్వాసముల పరిమితిగల యీ నిరోష్ఠ్య నలచరిత్రను వ్రాసినాడు. గోదావరీ మండల మందలి కొమరగిరి కవినివాసము[1]. మచ్చున కిందలి పద్య మొకటి—

చంచలరీతిగా నధికచంచలతం గని నట్టి యిందిరా
చంచలనేత్ర నెల్లెడ నచంచలగా నెడఁదం దలంచి యా
చించిన యర్థిరాజి నిరసించిన నిర్గతకీర్తి కెంత చిం
తించిన నక్కటా ! తగిననిష్కృతి కల్గగ నేరదే గదా. (౩-౫)

ఈ విధముగా తత్సమ నిరోష్ఠ్య కావ్యరచన చేసినవారు గలరు[2] : ఈనియమమే అచ్చాంధ్రము - నిరోష్ఠ్యము నందును దానిలో మరికొన్ని నియమములతోడను బయలుదేరిన రచనలుగలవు. వానిని గూర్చియు తెలిసి కొందము.

**శుద్ధాంధ్ర నిరోష్ఠ్యరచనలు**:- మరింగంటి సింగరాచార్యులు:-దశరథ రాజనందన చరిత్రయేగాక శుద్ధాంధ్రములోను నిరోష్ఠ్య కావ్యరచనను సింగ రాచార్యులు చేసినాడని గతప్రకరణములలో తెలిసికొన్నాను. ఈ రెండు పద్ధతుల కతడే యాద్యుడు గదా !

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము మొత్తము మూడాశ్వాసములు. సుమారు 300 పద్యము లుండును. ప్రప్రథమముగా నీ కృతి-'ప్రబంధ కల్ప వల్లి 'యను పత్రికలో ప్రచురింపబడి యనంతరము 1910 సంవత్సరమున గుంటుపల్లి సోమయ్యగారిచే గుంటూరిలో గ్రంథముగా ముద్రింపబడినది.

1. ఆంధ్రకవుల చరిత్ర - (పుట 235. 1949 ము)
2. ఈవిధముగా చాలామంది కవులు కలరు. అందరినిగూర్చి తెలుప లేదు. వివరములకు - పూండ్లవారి పీఠికలు 1. ప్రబంధరాజ వేంక టేశ్వర విజయవిలాసము 2. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచనకుశ చరిత్ర.

మా నాయనగారివద్ద ముద్రిత లిఖిత ప్రతులుండెనట. వానిలో ముద్రితప్రతి పరహస్తగతమైనది. ఉన్నలిఖితప్రతి తృతీయాశ్వాసములో 75వ పద్యము తరువాత కొన్నిశిథిలమైనవి. ఆశ్వాసాంతమునకు ముందు కొన్ని పద్యములు గలవు. పై ప్రతితో నే నొకప్రతి సిద్ధము చేసికొన్నాను. ప్రథమాశ్వాసము కృత్యాదితో 109 గద్య పద్యములు, ద్వితీయాశ్వాసము 96 గద్య పద్యములు, తృతీయాశ్వాసము 75పద్యమువరకు పూర్తిగా నుండి తరువాత కొన్ని పద్యములు శిథిలమై 'ఎడనెడరాజతల్' ఇత్యాది పద్యమునుండి పూర్తిగా గలదు (75+15=90). ప్రథమాశ్వాసము చివర నొక కమలగుచ్ఛ బంధము గలదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నొక యసమగ్రప్రతి గలదట.

నిరోష్ఠ్యరచనయే శ్రమతోగూడిన పని. దానిలో అచ్చతెనుగు నిరోష్ఠ్యము గదా! పింగరాచార్యులు కవితా శిల్పములో క్రొత్త వన్నెల నుపచరించుటయందు నైపుణి గలవాడు గావున నిరోష్ఠ్యరచనతో తృప్తి జెందక అచ్చాంధ్రముతో నిరోష్ఠ్యముగా నీకృతి చేసినాడు. దీనిలో నిర్వచనమను నియమము పెట్టుకొనలేదు గాని యట్లూహించినచో నితని కంత శ్రమకా దనిపించుచున్నది. శుద్ధాంధ్రగ్రంథ రచన మిక్కిలి క్లేశదాయకమైనది. సంస్కృత శబ్దార్థముల బోధించు దేశ్యము లాంధ్రవాఙ్మయమున నత్యల్పముగా గలవు. శుద్ధాంధ్ర గ్రంథరచన చేయువారు కొన్ని శబ్దములకు వ్యుత్పత్తులను సృజించినారు. పేళ్లయందును మరికొన్నిటి యందును సంస్కృత శబ్దములనే విధిగా స్వీకరించినారు. మన యాంధ్ర సారస్వతము నందు నిరోష్ఠ్యములు తక్కువ.

సింగరాచార్యు లీ కృతి నిర్మాణమును గూర్చి :

1 తెనుగునఁ గొన్నికావ్యములు తెల్లముగా రచియింపవచ్చుఁ జే
రొక్కనఁగ నిరోష్ఠ్యకావ్యములు ........(1-27)

ఈ విధముగా 32 సంఖ్య పద్యము వరకు చెప్పినాడు-కవి.శు. ని. సీ. కల్యాణమున పాటించిన నియమము -

అరయ కగచజటడతదనాయలసహా
రద్వయమెగాని యొండక్షరనులు చొరవు

---

1. కృత్యాది పద్యము లనుబంధములో గలవు కావున పద్యాదులు మాత్ర మొసంగుచున్నాను.

మఱియు నౌత్వోత్వములు కొమ్ముమా మడియును
వలపదామీద పరభాష నిలుపరాదు. (1-34)

'వ ఫ బ భ మ వ' లె గాక గుడికొమ్ము ఔత్వము సైతము నిరోష్ఠ్యముగా పాటించినాడు. ఇష్టదేవతా ప్రార్థనమున, కృత్యాదికృత్యంతములయందును ఓష్ఠ్యమేగలదు. ఇన్ని నియమములు పెట్టుకొన్నను, సీతాకల్యాణమునందు ధారాలోపము మాత్రము లేదు. నామవాచకములయందు మాత్రము సంస్కృత నామములనే గైకొన్నట్లు కవి తెల్పినాడు (1-35).

పొన్నికంటి తెలగన్న యయాతిచరిత్ర మచ్చతెనుగు కావ్యము. సింగరాచార్యుల యీకృతియు నిరోష్ఠ్యమేగాక శుద్ధాంధ్రను. తెలగన్న - సింగరాచార్యులలో అచ్చతెనుగు కావ్యరచన కెవ్వరు ముందు? అనునది సంశయము.

యయాతి చరిత్రయందును - శు.ని.సీ.క యందును -

కం॥ మున్నెవ్వరు నొడువని..........

ఉ॥ 'అచ్చతెనుంగు బద్దె మొకటైనను........'

అను పద్యములు సమానముగా గలవు. యయాతిచరిత్రయం దా రెండు పద్యములు తెలగన్న వ్రాసినవి కావు. సింగరాచార్యుల యగ్రజుడైన యప్పలాచార్యులు తెలగన్నతో యన్నట్టివి. కావున ఆ పద్యములు అప్పలాచార్యుల రచనయే గావలయును. కాని 'ఆయన చెప్పినట్లు' - తెలగన్న వ్రాసికొన్నాడని కొందరు కవులను భావించినట్లు భావించుటకు వీలులేదు. అప్పలాచార్యులు గొప్ప పండితుడు, కవి; యీ విషయమును సింగరాచార్యులేగాక తెలగన్నయును తెలిపినారు.

సింగరాచార్యులు నిరోష్ఠ్య సీతాకల్యాణమును 20 పండ్ల ప్రాయముననే రచించినానని తెల్పినాడు. అప్పలాచార్యుల కీతని కృతివిషయము తెలిసియే యుండును. కాని రాజాస్థానములో నున్నవాడు - పైగా తెలగన్నతో సన్నిహితముగా నున్నవాడు గావున మూర్తుమూలపల్లె యందున్న తమ్ముని (సింగరాచార్యుల) కృతినిగూర్చి తెలగన్నకు తెల్పియుండును. అయినను యయాతిచరిత్రను అమీనుఖానుకు కృతియిప్పించి తెలగన్నతోపాటు అప్పలా

ఛార్యులు సత్కృతుడుగా నయినాడు, రాజాశ్రయమున్న రచన (అమీను ఖాను ఇబ్రహీం కుతుబ్షావద్ద మీర్ జుమ్లా) కావున యయాతి చరిత్ర వ్యాప్తి చెందినది. కాని మొట్టమొదలే అచ్చతెనుగులోను అందు నిరోష్ఠ్యముగను వ్రాయబడిన సింగరాచార్యుల కృతి రాజాశ్రయము లేకపోవుటచే వ్యాప్తికి రాలేదు.

ద.రా.సం.చ. యందు తనకు ముందు శాకల్యమల్లన నిరోష్ఠ్య రచన (సంస్కృతము) చేసినట్లును, రాఘవపాండవీయము ద్వ్యర్థిగా సూరన రచించినట్లును సింగరాచార్యులు కృతజ్ఞతా పూర్వకముగా తెల్పినాడుగదా! తెలగన్నయే ముందుగా అచ్చతెనుగులో రచనచేసినచో అతనిని గూర్చి తెల్ప కుండునా! ఏతావతా నిరోష్ఠ్య కావ్యరచనకు సింగరాచార్యు లెట్లాద్యుడో అట్లే అచ్చతెనుగు రచనకు గావచ్చునేమో ? యని నా యభిప్రాయము.

ఇది చాలామంది సాహిత్య పరిశోధకులకు జిజ్ఞాసువులకు ఆశ్చర్యము కలిగించునో లేదో ? కాని, బాధాకరముగా మాత్రముండును. తెలగన్న-సింగరాచార్యుల విషయమై ఇంక కొంత పరిశ్రమ యవసరము. అప్పుడు ఎవరు ముందు ? అనునది తేలును.

సింగరాచార్యులు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము మూడాశ్వాస ములుగనే రచించినను రామాయణ కథ పూర్తిగా సంక్షిప్తముగా తెల్పి నాడు. శైలి తెలియుటకై మచ్చున కొక పద్య ముదాహరింతును.

'జిగిచన్గట్లసియాడం దీఁటయిన లేచెక్కిళ్ళ చక్కిన్నిగ
న్నిగ లీనంగఁ గడారికంటి సిరిడాల్ నిండంగఁ గైచిన్నియల్
తెగలై నల్దెసలాని చక్కఁగఁ జికిల్ సేయన్ నెఁఱాసిగ్గెదన్
దగలన్ రానెలఁజేరి కాళ్ళకడచెంతన్ సాగిలెన్ నాతి దాన్.(2-63)

సింగరాచార్యుల శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము తరువాత మరికొన్ని నియమములతో నిట్టి రచన లచ్చాంధ్రమున బయలుదేరినవి. వీరి నియమములు.

1. నిర్వచనము. 2. ఓష్ఠ్యవర్గములతో నామవాచకములు. తత్సమ భాషా నిరోష్ఠ్య రచనలయందుకన్న అచ్చతెనుగునం దీ నియమములును విశేషమైనవి. ఈ పద్ధతి రచనలలో మొదటిది -

## 1. అచ్చాంధ్ర నిరోష్ఠ్య, నిర్వచన, హరిశ్చంద్ర నలోపాఖ్యానము.

ఈ గ్రంథకర్త తంగెడ గంగనామాత్యుడు, లక్ష్మయామాత్య పౌత్రుడు, చిటియెల్లనార్యుని పుత్రుడు. అచ్చతెనుగు కవితలో 'గండర గండ' డైన గంగన, తాను చేసికొన్న నియమములలో రెండర్థములు వచ్చునట్లు కూడా రచన చేసినాడు. 1898 కే మిక్కిలి శిథిలముగానున్న తాళపత్ర ప్రతి నుద్ధరించి మొదటిమారుగా శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు సాహిత్య లోకమున కీ కవిని పరిచయము చేసినారు.1 ఇతని కృతినుండి యొకపద్యము.

"చేరికనేరశే టసలు చేనెలరాగ మొనర్చి యన్నిటన్
నేరిచికట్టతీరిచిన నింగి నెసంగెడి యిండ్ల చెంగటన్
సారెఁగఅంగి జాటి తెలిజాలెద నంటినయట్టి నీటికే
కారిగడంగె నంత తెఱఁగంటిజతల్ నెలగాయ నచ్చటన్"

## శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచనకుశచరిత్ర. ('876 ము.)

పెద్ద నియమములతో బయలుదేరిన రచనలలో నిది రెండవది. కర్త మచ్చ వెంకటకవి(1856-1903). అ.గ్ర. చింతామణి యధిపతులగు పూండ్ల వారు ఈ గ్రంథమును తమ విపులపీఠికతో 1876 సం.లో ముద్రించినారు. ఈ కవి శ్రీకాకుళం జిల్లాలోని జలుమూరు వాస్తవ్యుడు. ఇతరకృతు లితనివి గలవు. పైకృతితోనేగాక ఈ కవి మనకింకను సుపరిచితుడు. పర్లాకిమిడి మహారాజావారికళాశాలలో నీత డుపాధ్యాయుడుగా నున్నప్పుడు గి. వేం. సీతాపతి, చిలుకూరి నారాయణరావు, తాపీ ధర్మారావుగారలు ఈయనకు శిష్యులు.

వెంకటకవి రచన ముద్రణము కాగానే నాటిపెద్దల ప్రశంసలను పొందినది. ఆకాలములో రచనచేసి పెద్దల మెప్పును బొందుట '....ఉభయ కవిమిత్రు మెప్పించుట' వంటిది.

### ప్రశంసలు :

శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రి (1833-1897)–

---

1. అముద్రిత గ్రంథ చింతామణి. పత్రిక నెల్లూరు (సం. 11. సం. 10. 1898 అక్టోబర్ పుట-62; దీనిలో కొంత గ్రంథము ముద్రణమైనది.

మచ్చరము లేదు, కయితలో మచ్చ లేదు
మచ్చయునలేదు నుతికి, సొమ్మచ్చ లేదు
మచ్చయన మెచ్చ(నగు పుట్టుమచ్చగాన
మచ్చ వెంకటకవినామ మచ్చ మయ్యె. (2-2-1894—బొబ్బిలి)

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ –

"దంటతనాన నక్కుకుశకతన్ గయి లెన్న(గ నే డొనర్చె నొ
డంటని యక్కరా ల్దనర నచ్చతెనుంగున గద్దెలేని తే
జంట(గ లా(తి కయిసరుల సాటియె సారె కెదం దలంచ నా
దంటకు( దొంట గంగకయి దక్క(గ నిట్టి కడిందిసత్తిచే"

గంగన్న గన్న జాడ( గ
నుంగొని లింగన్న జేసె నొగి సొరలరా
రంగను, గడునలుకతనై
నం గాదది దీని కీడు నాయెదలోనన్ * (1894 ఫిబ్రవరి)

పై పద్యమున పేర్కొనబడిన లింగన్నయే –

*కందుకూరి వీరేశలింగము* (1848-1919) ; గద్యతిక్కనగా ప్రసిద్ధి గాంచిన వీరేశలింగముగారు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమును (1883) వ్రాసినారు. శు. ని. ని. కుశచరిత్రకన్న యీ గ్రంథము ముందుగా ముద్రింపబడినది. చక్కనిశైలి.

బిల్వేశ్వరీయమునందు కొక్కొండవారు వీరేశలింగకవిని- గ్రంథమును గూర్చి-

'అచ్చతెను(గు గబ్బ మలవరించుట కూచి
మంచి తిమ్మనయును మంచితెలగ
నయును లింగనయును నయమున స్వీయ భా
షాభిమాన మాన్యులని నుతింతు – (ఆంధ్ర రచయితలు, పుట 87)

---

* ప్రశంసలును (దుర్భావారిని) అచ్చాంధ్ర నిరోష్ఠ్యములుగా గలవు. మచ్చ వెంకటకవిని గూర్చిన విశేషములకు-ఆంధ్ర రచయితలు 143 - 147 పుటలు (1950 ముద్రణ).

*అబ్బిరాజు హనుమంతరాయశర్మ పాకయాజి* :- ఈయన అచ్ఛాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన హరిశ్చంద్ర చరిత్ర (1915ము), అచ్ఛాంధ్ర నిర్గద్య నిరోష్ఠ్య దాశరథీ చరిత్ర (1927 ము) వ్రాసినాడు. ఈ రెండును ముద్రణ మైనవి.

*శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు* (1866-1960) : కవిసార్వభౌములు శతాధిక గ్రంథకర్తలైన శాస్త్రిగారు 'అచ్ఛాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన హరిశ్చంద్ర చరిత్ర' వ్రాసినారు. 1938 లో నిది ప్రచురింపబడి నాడు మద్రాసు రాష్ట్రమునకు తాత్కాలిక గవర్నరుగానుండిన కూర్మా వెంకటరెడ్డినాయుడు గారికి అంకిత మీయబడినది.

*తంయాల లక్ష్మీనరసింహాచార్యులు* (1884-1959) : వరంగల్లు వాస్తవ్యులైన శ్రీ ఆచార్యులుగారు బహువిధ గ్రంథనిర్మాణదక్షులు. 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య కేకయ రాజనందన చరిత్ర'ను వ్రాసిరి. ఇది యముద్రితము. ఇదియేగాక అచ్చతెనుగునందు 'కుబ్జా కృష్ణవిలాసము' (ము.), శుద్ధాంధ్ర రామాయణము(1928 అము.)లను రచించిరి. వీరిరచనలయందు చిత్రకవిత హెచ్చుగా నుండును.[1]

*దేవులపల్లి నరసింహశాస్త్రిగారు* : అచ్ఛాంధ్ర నిర్గద్య నిరోష్ఠ్య సారంగధర చరిత్ర (1898 ము.)

*క్రొత్తలంక మృత్యుంజయకవి* : నిరోష్ఠ్య నలచరిత్ర (అ. ము.?)

*వేదుల నారాయణకవి* : నిరోష్ఠ్య దశరథతనయ శతకము (1917ము.)

**పేరయ సూరిగారు** : నిర్దుష్ట నిరోష్ఠ్య దాశరథిశతకము.

ప్రత్యేకముగా నోష్ఠ్య, అచ్ఛాంధ్ర మొదలైన యీ పద్ధతులతో రచనలు చేసినవారిలో కొందరు వీరు. మరికొందరు తమ రచనలలో క్వాచిత్కముగా అచ్ఛాంధ్ర నిరోష్ఠ్య రచనచేసినారు.[2]

---

1. ఈ రచనలనుగూర్చి తెల్పిన మిత్రులు డా॥ కోవెల సుప్రసన్నాచార్యుల వారికి కృతజ్ఞుడను.
2. సుసర్ల అనంతరావుగారు నిరోష్ఠ్యముగా నాటకరచన చేసినారట.

కూచిమంచి తిమ్మకవి : అచ్చతెనుగు రామాయణములో (2 ఆశ్వా)

అయ్యంనకోట పార్థసారధి : సత్యావిజయము (1893 ము.) 5ఆశ్వాసములుగల నీయచ్చతెనుగుకృతిలో నొక నిరోష్ఠ్య సీసముగలదు.

తెనుగుసారస్వతమున తత్సమ, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య రచన, దాని క్రమపరిణామ వికాసములను (కొంత) తెలిసికొన్నాము.

సంస్కృత సంపర్కము తెనుగునకు వీడరానిది. తెనుగు సాహిత్య ప్రక్రియ చాలావరకు సంస్కృత సాహిత్యము ననుసరించినదే కావున సంస్కృతములోగల నిరోష్ఠ్య రచనలనుగూర్చియును తెలిసికొనుట యవసరము.[1]

## సంస్కృత సాహిత్యములో నిరోష్ఠ్య రచన

ఎల్ల భాషలకును తల్లియైన సంస్కృత సారస్వతమునందు చాలా కాలము నుండియే చిత్రకవిత్వము గలదు. భారవి, మాఘుడు మొదలైనవారు తమ రచనలలో నిట్టి పద్ధతి గనబరచినారు.

సంస్కృత సారస్వతములో నిరోష్ఠ్య కావ్యరచన చేసినవారును, కావ్యములలో మచ్చునకు నిరోష్ఠ్యమునకు చూపినవారును గలరు,

ఇదియేగాక యిట్టిపద్ధతి (నిరోష్ఠ్యము) శాసనములందు కన్పించుచున్నది. క్రీ. శ. 1216 ప్రాంతపు (1184శా. సం.) దైన బూదపుర శాసనము (మహబూబ్‌నగర్ జిల్లా) నందు నిరోష్ఠ్య శ్లోకముగలదు. 'తెలంగాణా శాసనము'లను గ్రంథములో నిది యసమగ్రముగ నున్నది. అందున్నంతవరకు ఆశ్లోకము :-

కేదారాతతశీలిశాలజనతా చేతస్సదానంద కృ
త్తారా గౌరనిరంతి నీరజరజస్సంచారచ ....లః
నైజాధికసలీల సాగరసదాహంకార శంకాకుల ....'[2]

---

1. సంస్కృత విషయమే మొదట తెల్పవలయునుగాని, తెనుగుగ్రంథము గావున మొదట తెనుగు నిరోష్ఠ్య విషయము తెల్పనైనది.
2. తెలంగాణ శాసనములు. I భాగము 1935 ము. శాసనసంఖ్య 21 పుట 58 లక్ష్మణరాయ పరిశోధకమండలి హైద్రాబాదు (పుటలు 55-61)

క్రీ. శ. 620 ప్రాంతమున విలసిల్లిన దండిమహాకవి ప్రసిద్ధమైన రచనలలో నొకటి దశకుమార చరిత్రము. దీనియందు సప్తమోచ్ఛ్వాసములో నిరోష్ఠ్యరచన గలదు. నియమము చక్కగా పాటింపబడినది. ఇట్టి నిరోష్ఠ్య రచనకు సందర్భము — మంత్రగుప్తుడను నతనికొక రాజకన్యా సంసర్గము వలన పెదవులు దంతక్షతములైనవి, కావున నొక పెదవితో మరియొక పెదవిని చేర్చలేని స్థితిలోనున్నాడు. అట్టి సమయమునందు రాజవాహనమహారాజుతో తనసంగతి తప్పనిసరిగా చెప్పవలసిన స్థితి యేర్పడినది. ఓష్ఠ్యవర్గములతో చెప్పుట కష్టము. కవి యీ సమయమునందు మంత్రగుప్తునితో నిరోష్ఠ్యముగా వృత్తాంతమును చెప్పించినాడు.[1] షష్ఠోచ్ఛ్వాసపు చివరలో 'స కిల కరకమలేన కించిత్సంవృతాననః లలితవల్లభారభసదత్తదన్తక్షతవ్యసన విహ్వలాధర మణి ర్నిరోష్ఠ్యవర్ణ మాత్మచరిత మాచచక్షే' (160 పుట) అని తరువాత సప్తమోచ్ఛ్వాసమును ప్రారంభించినాడు. అందలి గద్యలో కొంతభాగము—

'రాజాధిరాజనందన నగరంధ్రగతస్య తే గతిం జ్ఞాస్యన్నహం చ గతః - కదాచిత్కళింగాన్. కళిఙ్గనగరస్య నాత్యాసన్న సంస్థితజనగాహస్థాన సంసక్తస్య కస్యచి త్కాంతారధరణిరజ స్యాస్తీర్ణసరసకిసలయసంస్తరే తలే నిషజ్య నిద్రాలీఢదృష్టి రశయిషి . . . .(పు. 161)

అథ కదాచిదాయాసిత జాయారహితచేతసి లాలసాతిలంఘునగ్లాన ఘన కేసరే, రాజదరణ్యస్థలీలలాట లీలాయితతిలకే, లలితానంగ రాజాంగీకృత నిర్నిద్రకణికా కాంచనచ్ఛత్రే, దక్షిణదహనసారథి రయాహ్వాతసహాకార చంచలకలికే, కాలాండజకంఠరాగరక్తరక్తాధరా రతిరణాగ్ర సన్నాహ శాలినీ శాలినీకన్యకాంతఃకరణ సంక్రాంతరాగలింగితలజ్జే, దర్దరగిరితట చందనాశ్లేష శీతలానిలాచార్యదత్త నానాలతానృత్త లీలే కాలే కలింగ రాజ స్సహాంగనాజనేన.................(పు 164.)

క్షీరసాగర రశనాలంకృతాయా ! గంగానదీ సహస్రహారయష్టిరాజితాయాః ధరాంగనాయా ఏతదాసాదనాయ సాధనం..........(పు 167)

---

1. నిరనునాసికచంపువు-ఈపద్ధతిగానే గలదు. శూర్పణఖ నాసికాచ్ఛేదనమైన తర్వాత రావణునితో మొరపెట్టుకొనును-అనునాసికాక్షరములను పల్కలేదు గదా. కావున కవి నిరనునాసికరచన చేసినాడు.

తెలుగులో కేతన ఈ సందర్భమున నిరోష్ఠ్యరచన చేయలేదు.[1] ఎనుములపల్లి సంజీవరాయశాస్త్రిగారు, దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు. విద్వాన్ విశ్వంగారు ఎవ్వరైనను తమ యాంధ్రీకృతియందు నిరోష్ఠ్య రచనయే చేయలేదు. ఇటీవల (1967) సాహిత్య ఎకాడమీ వారి దశకుమార చరిత్రపై కొన్ని విమర్శలు వచ్చినవి. వానియం దీవిషయము లేదు.[2] దండి నిరోష్ఠ్య నియమము చూడగా పదలాలిత్యమేగాక దండి రచన దండి నియమము గలదని తెలియుచున్నది.

*శాకల్యమల్లన నిరోష్ఠ్య* **రామాయణము** :- తెనుగుదేశపు సంస్కృత కవులయందు ప్రసిద్ధుడైన మల్లన సంస్కృతమునందు నిరోష్ఠ్యరామాయణము వ్రాసినట్లు ఏకామ్రనాథ విరచిత ప్రతాపచరిత్రము మొదలైనవి తెల్పుచున్నవి. సింగరాచార్యులు దశరథరాజనందన చరిత్రయందు -

'ముసు రామాయణము న్నిరోష్ఠ్యముగ నింపుల్ మీర శాకల్లె మ
ల్లన దా సంస్కృత భాషఁ జేసెనన నాలాగున్ జెవుల్ నిండఁగా
వినుచేగాని ధరిత్రిలో నిజముగా వీక్షింపలే దిట్టి దేఁ
దెనుఁగుం జేసెద భూమిపైఁ గవిజనాఢ్యుల్ ప్రశంసింపఁగన్....'

అన్నాడు. సింగరాచార్యుల కాలమువరకే, అనగా 16 వ శతాబ్దములోనే లభ్యముగాని గ్రంథములలో నీ నిరోష్ఠ్య రామాయణ మొకటి[3] - శాకల్య మల్లన మన కింకొక విధముగా నాంధ్రసాహిత్యమున పరిచితుడు. భాస్కర రామాయణమున హుళక్కి భాస్కరుని తర్వాత యుద్ధకాండ భాగమును పూర్తిచేసిన అయ్యలార్యుడు గద్యలో యిట్లు తెల్పినాడు -

---

1. చూ. దశకుమార చరిత్ర - కేతన (11-3).
2. భారతి 1967 సెప్టెంబర్, దశకుమార చరిత్రము-నిడుదవోలు వారు; భారతి 1967 నవంబరు - ఇదే శీర్షికతో "భాస్కర్" (ముళ్లపూడి భాస్కరరావు) వీరిద్దరికి సమాధానము (?) 1967 డిసెంబర్ - మద్దులపల్లి వారు.
3. జటప్రోలు సంస్థానకవి. కవికంఠీరవ కృష్ణమాచార్యులుగారు 120 సం॥లకు ముందు సంస్కృతములో నిరోష్ఠ్య రామాయణము వ్రాసిరట. (విజ్ఞానసర్వస్వము 4 భా. తెలుగు సంస్కృతి, పుట 1179)

'ఇది శ్రీశాకల్యమల్లకవి వీరనరసింహావరజాప్పలార్య నందనోభయ భాషాకవితావిశారద, శారదాచరణకమల పరిచరణపరిలీఢమాన సాయ్యలార్య విరచితంబైన (శ్రీ)రామాయణ మహాకావ్యంబునందు యుద్ధకాండ సర్వంబు నేకాశ్వాసము' అని. దీని ననుసరించి –

శాకల్యమల్లన సోదరుడు నరసింహము. మరొక సోదరుడు అప్పలయ్య. శాకల్యమల్లన రెండవ సోదరుని పుత్రుడే అయ్యలార్యుడని తెలియుచున్నది. ఈ మల్లన ద్వితీయ ప్రతాపరుద్రుని యాస్థానమున నున్నట్లు ప్రతాపచరిత్ర తెల్పుచున్నది.

కాకతీయ సామ్రాజ్య విచ్ఛేదానంతరము హరిహరబుక్కరాయలు విజయనగర సామ్రాజ్యమును స్థాపించిరి. వీరి యాస్థానములో మల్లన యున్నట్లు గలదు–

''ఇతనికి కవిమల్లుఁడు మల్లయార్యుఁడని నామాంతరములు. ఇతని తండ్రి మాధవపండితుఁడు, ఈకవి సాహిత్యనిష్ణాతుఁడు, అద్వైత శాస్త్రమునం దెక్కువగా కృషిచేసెను. వేదాంతదేశికుని తనయుఁడైన నయనారాచార్యునితో నీతడు శాస్త్రవాద మొనర్చెననియు రాచకొండనేలుచున్న సింగభూపాలుని సభలో సత్కృతుఁడాయెననియు తెల్పుదురు.... ఇతడు శా. 1300 ప్రాంతమువా డనబడును'',అని 'సంస్కృతకవి జీవితము' నందు మల్లాదివారు (పు 157, 1950 ముద్రణ)

మల్లనకృతులు :– 1. నిరోష్ఠ్యరామాయణము (అలభ్యము). 2. ఉదారరాఘవము 3. అవ్యయసంగ్రహ నిఘంటువు.

విజయనగరమున నున్నప్పుడే మల్లనకవి ఉదారరాఘవమను 18 సర్గల కావ్యము రచించినాడు. అందు 9 సర్గలు మాత్రమే లభ్యమైనవట[1]. అనగా శూర్పణఖా నాసికాచ్ఛేద వృత్తాంతమువరకే లభించినది. డా॥ బిరుదురాజు రామరాజుగారివద్ద 5 సర్గలు (ము.) గలవు. అందుండి కొన్ని శ్లోకముల నొసంగుచున్నాను –

---

1. ఉదారరాఘవము – 'విశ్వబోధిని' టిప్పణి – గోపాలనారాయణ కంపెనీ బొంబాయి (1891 ము).

వాయవ్యాస్త్రేణ సోఽదిం రఘుపతి రధు నోదంబుధా వంబుదాభః
ప్రోద్యద్బాహుం సుబాహుం సహ రజనిచరై రక్షిణో ల్లక్ష్మణోఽపి
ఆకాశా త్పుష్పవృష్టిం ముముచు రనిమిషా స్తుష్టువుః కృష్టిసర్గాః
సమ్యూర్ణే స త్రతంతా నవిహతహవిషి ప్రాప హర్షం మహర్షిః (2–104)

ధనుర్విద్యాకౌశలమ్:-

తచ్చాప మాకర్షతి తాటాకారా
వాకర్ణ మాకర్ణి విశాలనేత్రా
సాసూయ మైక్షిష్ట విదేహజాఽసౌ
కన్యాం కిమన్యాం పరిణేష్యతీతి[1] (3–125)

ఈ శ్లోకము మురారి అనర్ఘరాఘవము (4–53) లోని శ్లోకమును బోలి యున్నది.

ప్రథమసర్గగద్య–

ఇతి శ్రీసుఖస్వప్నాకలిత రఘునాథద త్తవరప్రసాద, సహజసారస్వత
శ్రీశాకల్యమల్ల పదాంకిత మాధవసుధీతనయ కవిమల్లాచార్య
విరచితే ఉదారరాఘవే మహాకావ్యే ప్రథమ స్సర్గః–'

అవ్యయ సంగ్రహనిఘంటువు[2] :– ఈగ్రంథము ఏకాక్షర ద్వ్యక్షర త్ర్యక్షర చతురక్షర–యను నధ్యాయములు గలది. గ్రంథాదిని–

ప్రణమ్య శిరసా దేవం భద్రాద్రినిలయం హరిమ్
యథావ్యయాని కతిచి త్సంగృహ్యంతే యథాతథమ్'

---

1. ఈ శ్లోకముల నొసంగిన ఆచార్య రామరాజుగారికి కృతజ్ఞుడను.
2. ఈ గ్రంథము తంజాపుర సరస్వతీమహాలు గ్రంథాలయములో నున్నట్లు తెలియుచున్నది.

చూ: Catalogue of Sanskrit Manuscripts, T.M.S.S Library Kavyas, Vol XX No. 29 మరియు,
History of Reddi Kingdoms'. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు (1948 ము. పుటలు 490-91).

అను శ్లోకముగలదు. సంస్కృతములో భద్రాచలప్రశంస ఇందు గలదు. క్రీ. శ. 1686 ప్రాంతమున కంచెర్ల రామదాసు భద్రాచలము నందు రామాలయ నిర్మాణము చేయించెను. శాకల్యమల్లన 1330 ప్రాంతమువాఁడు. అప్పటికే భద్రాచలమున నొక విష్ణ్వాలయ మున్నట్లు పై శ్లోకము తెల్పుచున్నది.

ఇందలి గద్య—

'ఇతి చతుర్భాషాకవితాపితామహాంక శాకల్యమల్లుభట్ట
విరచితాన్వయ సంగ్రహనిఘంటు స్సమాప్తః—'

పైగద్యవలన మల్లనకు 'చతుర్భాషాకవితాపితామహ' బిరుద మున్నట్లు తెలియుచున్నది.

సుప్రసిద్ధ లాక్షణికుడైన యప్పకవి శాకల్యమల్లన లక్షణ గ్రంథమును రచించినట్లు —

సంస్కృతమునకు నాంధ్రభాషకును దొల్లి
లక్షణములు శాకల్లె మల్లన సుధీంద్ర
విన్నకోట పెద్దన సుకవిప్రముఖులు
కృతి నొనర్చిరి లోకోపకృతిగ పెక్కు. (అప్ప—1-4)

అని తెల్పినాడు. శాకల్యమల్లన గ్రంథము నిఘంటువు. దీనిని అప్పకవి లక్షణగ్రంథముగా పేర్కొనుటలోని అభిప్రాయమేమో!

శాకల్య మల్లన నిరోష్ఠ్యరామాయణము లభింపకపోవుట సంస్కృతాంధ్ర సారస్వతములకు మిక్కిలి లోటు.

వారణాసి ధర్మసూరి సాహిత్యరత్నాకరమున నిరోష్ఠ్యరచన చేసినాడు(1440 ప్రాం).

సంస్కృతాంధ్ర సారస్వత నిరోష్ఠ్యసాహిత్యమును గూర్చి పరిశీలన మొనర్చిన యింకను విశేషములు బయలుపడును.

సింగరాచార్యుల కవిత్వము :

'ఆంధ్రభాషా నిరోష్ఠ్యమహాప్రబంధ
రాజి రచనా ధురీణు కర్ణాటరాయ
లబ్ధకవిసార్వభౌమ కల్యాణ బిరుద
శాలి మరుకంటి సింగరాచార్య దలతు'

అని పంచతంత్ర కథలను వైష్ణవప్రబంధముగా దిద్దితీర్చిన నేబతి కృష్ణయామాత్యుడు (1580–1612) సింగరాచార్యులను స్తుతించినాడు. పై పద్యమువలన నిరోష్ఠ్యమహాప్రబంధరచనా విషయమేగాక సింగరాచార్యులకు కర్ణాటరాయలబ్ధ 'కవిసార్వభౌమ' బిరుదమున్నట్లు తెలియుచున్నది. "కృష్ణయామాత్యుడు మహమ్మద్ షా అని పిలువబడు కుతుబ్షాహీ సుల్తానులందైదవవాడగు మహమ్మదు ఖులీ కుతుబ్షా (1580-1612) దర్బారులో ప్రధానిగా హితుడుగా కవివరుడుగా నున్నాడు[1]" అని రామరాజుగారు వ్రాసినారు. సింగరాచార్యులను గూర్చి కృష్ణయామాత్యుడు వ్రాసిన విషయము సత్యమైనదే. ఎట్లనగా, మరింగంటి సోదరులు (జగన్నాథ,సింగరాచార్యులు) వయసులో పెద్దవారైయున్న సమయమే ఈ పద్యములు వ్రాసిన కాలముగావచ్చును. సింగరాచార్యులు తనకు 'శతఘంటావధాన', 'శారదాప్రశ్నవివరణ' అను బిరుదు లున్నట్లు తెల్పుకొన్నాడు. పైపద్యమువలన కవిసార్వభౌముడని తెలియుచున్నది. శతఘంటావధానుడనగా శతఘంటకపనము చెప్ప నేర్పుగలవా డని యర్థము. అప్పటికే ఈ బిరుదము జగన్నాథాచార్య, రామరాజభూషణాదులకు గలదు. అంతేగాక (సింగరాచార్యులవలె నిరోష్ఠ్యరచన లేకున్నను) రామరాజభూషణుడు ఓష్ఠ్యనిరోష్ఠ్యజ్ఞుడ నని ఓష్ఠ్యనిరోష్ఠ్య సంకరజ్ఞుడ నని తెల్పుకొన్నాడు. చరిగొండ ధర్మన మొదలైనవారు 'శతలేఖిన్యవధాన పద్యరచనా సంధాసురత్రాణు'లు. మల్లినాథసూరి శతఘంటావధానుడు. ఆధునికులలో తిరుపతివేంకటకవులు, మాడభూషి వేంకటాచార్యులు, వేలూరి శివరామశాస్త్రిగారు ఈ అన్వర్థబిరుదాభిరాము లైనారు[2].

---

1. కుతుబ్షాహీ సుల్తానులు – ఆంధ్ర సంస్కృతి 97 పుట (పైపద్య మిందలిదే–పుట 99)
2. బిరుదనామధేయులు (వ్యాసం) శ్రీ విక్రాల శేషాచార్యులు (భారతి 1959 ఆగస్టు)

'శారదా ప్రశ్నవివరణు'డ ననిగదా సింగరాచార్యు లనినది ! ఇది బిరుదమో ! లేక గ్రంథనామమో ! యని యనుమానము. అప్పకవి 'పూర్వ గ్రంథనామ సంగ్రహము'లో (1-5) 'శారదాదీపికయును, శారదామకుటం బును, శారదా తిలకంబును' పేర్కొనినాడు. వీనివలెనే 'శారదా ప్రశ్న వివరణము' - గ్రంథమేమో ! వాడుక యేమనగా. సింగరాచార్యులకు బాల్యములో సరస్వతీదేవి స్వప్నమున సాక్షాత్కరించి కొన్ని ప్రశ్నలు వేసెనట; వానికి సరియైన సమాధానమును చెప్పుటవలన సింగరా చార్యులకు పై బిరుద మొసంగినది సరస్వతియే యనియు, ఇదియే గాక ఆమె కొన్ని తరములు మరింగంటివారికి దాస్యము చేయుదునని తన మాటను నిలుపుకొనిన దనియు. అందుకు ఆధారముగా ఈ క్రింది పద్యము మనకు కొంత తోడ్పడుచున్నది :

'ముదము(న)నస్మదీయకుల ముఖ్యకరుండగు సింగరార్యులన్
సదయతగాంచి భారతియు చక్కగవేయు సమస్యాభావమున్
కొదుకకదెల్ప మెచ్చి యటు కూర్మి(ని) యిచ్చినమాట దప్పకన్
విదితముగా నహర్నిశము వేడ్కతొ మద్గృహసీమ నుండుతన్''.
(గోదావధూటి పరిణయము 1-4)

ద. రా. నం. చరిత్ర గద్యనల్ల పై రెండు విషయములతోబాటు- సింగరాచార్యులు అష్టభాషాపరిచయమున్నవాడుగను తెలియుచున్నాడు. నన్నయ, నారాయణభట్టు, నాచనసోముడు మరికొందరు అష్టభాషా కవిత్వశ్రీ గల వారుగా మనకింతకు పూర్వమే పరిచయము.

'వినయధునీ తరంగ విజృంభణాజృంభిత సలలితమృదుమధురవాగ్వై ఖరీఝురీధురు'డైన సింగరాచార్యుల రచనలు రెండు మాత్రమే లభ్యమైనవి[1]. అవియును నిరోష్ఠ్య నియమమునకు లొంగి కవి ప్రతిభను తెల్పుచున్నవే గాని కవితాకళను వ్యక్తపరచునట్లుగా లేవు.

---

1. యయాతిచరిత్ర కృతిభర్తయైన - అమీనుఖాను పుత్రులలో నొకరైన అబ్దుల్ కరీము. అరబీ, ఫారసీ మొదలైన భాషలు నేర్చినవాడు. సింగరా చార్యులు ఇతని కచేరీ వర్ణనను ఉత్పలమాలా రూపముగా చెప్పెనని ఆది రాజువారు వ్రాసినట్లు మిత్రులు శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావు తెల్పినారు (కుతుబ్షాహీ సుల్తానులు, ఆంధ్ర సంస్కృతి 132-133 పుటలు).

దశరథరాజనందన చరిత్రలో కవి తన కవిత్వపద్ధతి 'యిది' అని తెల్పుకొనలేదు. కాని 'విస్ఫురితైకైకదిన ప్రబంధ రచనాస్ఫూర్జద్వచ శ్శ్రీకుడన్' అనినాడు. మనకు లభ్యమైన రెండు కృతులలో శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణ రచన బాగుగానున్నది. అట్లనినచో ద.రా.నం.చ. రచన బాగులేదని కాదు; కవిత్వమంత ప్రౌఢముగా లేకున్నను సులభగ్రా హ్యముగను లేదు. మధ్యమణిన్యాయము వహించినది. చిన్నవిషయము (చిన్న పదము) నిరోష్ఠ్య వాసనవలన పెంచవలసివచ్చినది. అయినను సమాస రచన, పద్యగమనము రమణీయములుగా నున్నవి.

'ఆరాలేనెల లంతకంత కతిరాజాకార లేఖా కళా
సారాచార శరాసనాస్త్రకలనా సారస్యలాక్షణ్య శ్శృం
గారజ్ఞాన దయాంచితస్థితి తితిక్షాసత్యధైర్య క్రియా
శ్రీ రంజిల్ల చరించసాగిరి జయశ్రీ హెచ్చ నానాటికిన్' (4-86)

'చనియగ్రస్థలిఁ గాంచె నంత..........' (2-55)

ఈ విధమైన పద్యములు చాలా గలవు. వీనిలోని సమాసరచన నిరోష్ఠ్య మేనా యని పాఠకుల కాశ్చర్యము కలిగించును.

సీ॥ సరసాలినీజాత ఝుంకారసంకాశ
సంగీతసాహిత్య సరణిచేత..........(2-120).

ఇత్యాది పద్యగమనమును చూచినచో ప్రాచీన కవుల పద్ధతి కొట్టవచ్చిన ట్లుండును.

'కరకాచ్ఛిన్న దిగంతశాఖి యయి.........(3-103) 'వర్షావర్ణన.'
'ఆది దిక్కాంత గలసినయట్టి సంతసాన......... 5-293) 'సంధ్యావర్ణన'
'ఘనతరకరినాంధకారదిక్కరిరక్త
శరధినీరాడిన హరి యనంగ'.........(5-297) 'సూర్యవర్ణన'

ఇంతమంచిగా వర్ణనలు చేయబడినవి.

సింగరాచార్యుల కవిత్వమును గూర్చి కవి వ్రాసికొన్న పద్యముగా డా॥ రామరాజుగా రుదాహరించిన (30-9-1960 ఆంధ్రభూమి)-

'అరువతెచన్నులం బలె బయల్పడనీయక ఘూర్జరాంగనా
గురుకుచయుగ్మము ల్వలె నిగాఢముగాక తెనుంగుదేశపుం
గరితచనుంగవంబలె నొకానొక యుంచుక గానుపించగా
సరసులు మెచ్చ చెప్పెదను సత్కవిశబ్ద పటుత్వవైఖరిన్'

అను ఈ పద్యము ఎందున్నదో వారు తెల్పలేదు. లభించినంతవరకు సింగరాచార్యులరచనలలోను లేదు. ఇది అయ్యలరాజు రామభద్రుని 'సకలకథాసార సంగ్రహ'మను (అము.) గ్రంథములో గలదు. (ప్రా.లి.పు.భాం.-D850).

బైచరాజు వెంకటనాథకవి, మొల్ల - ఈ విధమైన పద్యమునే చెప్పినారు. అందరికీ -

'నో ఘూర్జరీస్తన ఇవాతితరాం నిగూఢః
న ద్రావడీస్తన ఇవాతితరాం ప్రకాశః
అర్థో గిరా మపిహితః పిహితశ్చ కశ్చిత్
సౌరభ్యమేతి మహారాష్ట్రవధూకుచాభః'

అను శ్లోకము ఆధారము.

వర్ణనలే గల ప్రబంధములు చదువుట కలవాటు పడినవారి కీ ద.రా.నం.చ. శీఘ్రముగా రుచింపక పోవచ్చును కారణ మేమనగా - శయ్యలు, విరహములు, చంద్ర, మన్మథ దూషణలు, శిశిరోపచారములు మొదలైనవి లేవు. నిరోష్ఠ్య కవిత్వముపై యభిమానమున్న వ్యక్తిని మాత్రము ఈ గ్రంథము పూర్తిగా చదివించును.

ప్రతిభాశాలురైనట్టి కవులు కాలముద్రను తిరస్కరించి మహాగ్రంథముల రచనకు ఎత్తుగడవేయుట సహజము. ఏవిధముగనైనను అవి జీవించి యుండును. దశరథరాజనందన చరిత్రయు నట్టి పద్ధతిలో చేరిన దనవచ్చును.

'జీవించియున్నంతకాలము మరణించి మరణించిన తరువాత జీవించువాడు కవి' యని ఒక సుప్రసిద్ధ ఆంగ్లేయ రచయితవ్రాత - అక్షరాలా నిజము.

మనకు-అనగా పాఠకులకు, రచయితలకు ఇది యీ 'కవితా లక్షణము' అనుట సామాన్యమైనది. కాని ఏది కవిత్వము ? అను ప్రశ్నకే సమాధానము

చెప్పుట కష్టము. ఈ విషయమై సాహిత్య ప్రపంచములో ఏకాభిప్రాయ మనునదియు లేదు. ఉండుట అసాధ్యము. ఏతావతా –

'ఏరకమైన 'సులోచనములు' ధరింపకుండ సాహిత్య ప్రపంచమున నడుగుపెట్టినవారికిగాని సత్యము సాక్షాత్కరింపదు. మానవుని యనుభవమే యితర ప్రమాణములకంటె మిన్నయగు ప్రమాణము[1]' అన్న విమర్శకుని వాక్యము గ్రహింపదగినది. మనసాహిత్యములో ఏదేని దోషములేని రచన లేదు. "సాక్షాన్మహాకావ్య కృత్ప్రవరుల్ చెప్పిన కావ్యమందునె ప్రమాదంబుల్ శతంబుండు" గదా! దశరథరాజనందన చరిత్రయు ఈ పద్ధతి రచనలలో నొకటైనను తెలుగు సారస్వతమున నిరోష్ఠ్యకావ్య శాఖకు శ్రీకారమును చుట్టినదను కీర్తివలన కొన్ని దోషములు 'ఇందోః కిరణే ష్వివాంకః' గావచ్చును.

తెలుగు కవులు, అందు ముఖ్యముగా తెలంగాణలోని కవులు సంస్కృత రామాయణమును, సంస్కృతాంధ్రములయందు అనేక విధములుగా రచించినారు.[2] సింగరాచార్యులనాడు కవితాస్పర్ధ బాగుగా నుండెను. రామాయణ రచనచేసినవారు అప్పుడు, అనగా సింగరాచార్యుల సమకాలములో లేరు. ఏటికి ఎదురీదినట్లుగా నున్నను 'భూమిపై కవిజనాధ్యతు ల్ప్రశంసించునట్లు 'మోదముతో' నీ రచనను సింగరాచార్యులు చేసినాడు.

---

1. ఆంధ్రపత్రిక సౌమ్య సంవత్సరాది సంచిక (పుట 98) 'నవ్యాంధ్ర కవిత్వము మానవతా దృక్పథము'–అను వ్యాసము–నాగళ్ళ గురు ప్రసాదరావుగారు.

2. **'Sanskrit works' with Ramayana theme written by Andhras' (Jayapura Oriental Journal, Baroda– Vol. 16, No. 2, December 1966) Author; Dr. B. Rama Raju,**

# దశరథరాజనందన చరిత్ర — అనువాదము

సంస్కృత రామాయణమును తెనుగున పరివర్తన గావించిన వారిలో నొకరిద్దరు దప్ప నందరును విపులముగనో, కొంత సంక్షిప్తముగనో, మరి కొన్ని చిన్నచిన్న యుపాఖ్యానములను చేర్చియో రచన సాగించినవారే!

సింగరాచార్యులు నిరోష్ఠ్యనియమము వలననేమో ఈరచనను మిక్కిలి సంక్షిప్తము చేసినాడు. మూలములోగల రసవంతమైన కొన్ని కథలను వదలిపెట్టినాడు. ఎంత సంక్షిప్తమనగా సుమారు 68 సర్గలుగల సుందరకాండను 10 పద్యములలో చెప్పినాడు. శ్రీమద్రామాయణమునకు ప్రాణము వంటిదేగాక మంత్రాక్షరయుక్తమైనదిగా సుందరకాండకు ప్రసిద్ధి. ద.రా.నం. చరిత్రయందు మిగతా కాండలకన్న యిది మిక్కిలి సంక్షిప్తము చేయబడుట యొక లోపముగా నున్నది.

సింగరాచార్యుల యనువాదపద్ధతి తెలియుటకు సంస్కృత రామాయణము ద.రా.నం. చరిత్రల భాగముల నిచ్చుచున్నాను.

| ద.రా.నం. చరిత్ర | శ్రీమద్రామాయణములో ఎంతవరకు |
|---|---|
| ప్రథమాశ్వాసము: | బాలకాండ 29 సర్గతో ఆశ్వాసము ముగియును. |
| ద్వితీయాశ్వాసము : | బాల 32 సర్గనుండి యారంభమై 119 పద్యము వరకు, 120 పద్యము నుండి 158 పద్యముతో అయోధ్యకాండ పూర్తియగును. |
| తృతీయాశ్వాసము : | అరణ్యకాండతో ప్రారంభము, 68వెం. పద్యముతో ఈకాండపూర్తి. 69 నుండి 'కిష్కింధ' 133—144 సుందర. 145 నుండి 'యుద్ధ'. 154 పద్యముతో ద.రా.నం.చరి ఆ. పూర్తియగును. |
| చతుర్థాశ్వాసము : | యుద్ధకాండ కథలోనే నడచును. |
| పంచమాశ్వాసము : | రామపట్టాభిషేకముతో పూర్తి, |

మూలరామాయణమును కవియెంత సంక్షిప్తము చేసెనో పైవాని వలన తెలియుచున్నది.

కొందర నువాదకులు మూలములో లేని విషయములను కొన్నింటిని తెల్పినారు. ఇట్టి మూలరహితములైన కథలు జనుల వాడుకలో బాగుగా నిల్చినవి. ఆయా యనువాదకులనాటి సంఘమున నిట్టి కథ లుండుటవలననే వారును తెల్పినారేమో ! మచ్చునకు -

1. అహల్యను శిలగా గమ్మని శపించినట్లు మూలములో లేదు. కాని తెనుగువా రందరును శిలావృత్తాంతము తెల్పినారు. బహుశః ఇది అధ్యాత్మ రామాయణ ప్రసాదము గావచ్చును.

మూలములో (బాల 48 సర్గ) :

తథాశప్త్వా స వై శక్ర మహల్యామపి శప్తవాన్
ఇహ వర్షసహస్రాణి బహూని త్వం నివత్స్యసి॥ 32
వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ
అదృశ్యా సర్వభూతానా మాశ్రమేఽస్మిన్ నివత్స్యసి॥ 33.
యథా చైత ద్వనం ఘోరం రామో దశరథాత్మజః
ఆగమిష్యతి దుర్ధర్ష స్తదా పూతా భవిష్యసి॥ 34

33వెం. శ్లోకము అహల్యను శపించుట. అందు 'శిల' యే లేదు. మనవారు కొందరు ఈవిషయములో ఆశ్వాసములు, ఖండములే వ్రాసినారు.

2. రామరావణ యుద్ధమునందు రావణుడు మరణింపకయుండుటకు కారణము అతని యుదరములో అమృతభాండ మున్నందున యని భాస్కర రంగనాథాదులు వ్రాసినారు. సింగరాచార్యులు (5-175)ను వారి మార్గ మనుసరించినాడు. మూలములో నీవిషయము లేదు. ఆధునికులలో విశ్వనాథ సత్యనారాయణగారు దీనిని వదలిన ట్లున్నారు.

సింగరాచార్యులు పై విషయములను తెల్పినను మరికొన్నిటిని వదలినాడు. దశరథునకుగల మునిశాపమును, మరణానంతరము దశరథుని తైలభాండములో నుంచుటయును లేవు. మూలములో నీవిషయములు విపులముగా నున్నవి.

కైకేయి వరములు కోరుటకు ముఖ్యముగా బోధకురాలు 'మంథర'. ఇందులో ఈ కథ సంక్షేపముగనే గాక మంథర పేరే లేదు. కవి మరచెనో? లేక నిరోష్ఠ్యనియమ ప్రభావమో!

మొత్తముపై సింగరాచార్యులు తన యనువాదమును సంక్షిప్తము చేసినను, నిరోష్ఠ్యనియమమును మాత్రము నియమముగా పాటించినా ఢన వచ్చును.

*అనుకరణలు:*

సింగరాచార్యులు తననాటికే మిక్కిలి ప్రసిద్ధిగాంచిన కొన్ని రచనలను అనుకరించినట్లుగా తెలియుచున్నది.

వసు చరిత్రములో (3-174).

కొండటవిల్లు వేదలలి కుండలి రాజటనారి యమ్మనంతుండట. . . .

ఇత్యాదిపద్యము చాలామంది కవులకు భిక్ష పెట్టినది. దీని ననుసరించి నట్లుగనే —

ద. రా. నం. చరిత్ర (2-88) లో-

అరయ కాంచనాద్రియె శరాసనయష్టిగ శేషచక్రియే
నారిగ నంచ తేజిగల. . . .

అను పద్యము గలదు.

నాచనసోముడు ఏమని నిరోష్ఠ్యపద్యము (1-106)ను వ్రాసినాడో కాని నిరోష్ఠ్యరచనలే బయలుదేరినవి.

చని చని కాంచె చెంగట నిశాచరహంత సతీసహాయతన్
ఘనతర కేతకీ కదళికా . . .

ఇత్యాది ద. రా. నం. చరిత్ర(2-132) యందు భరద్వాజాశ్రమము వర్ణింపబడిన పద్యము అచ్చముగా సోముని యీ పద్యానికి అనుకరణవలెనే యున్నది.

చని చని కాంచె నంత ఋషిసంహతి సారసకేసరాంత . . . .
(ఉత్తరహరివంశము 1-106)

ద. రా. నం. చరిత్రలోని (4-16):

సీతగాదిది దైత్యశేఖర . . . . . . . అను పద్యము భాస్కర రామాయణమున సుప్రసిద్ధపద్యములలో నొకటైన

నీ కంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
కౌకస్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి . . . .

రెండు గ్రంథములయందును సందర్భ మొకటే. పద్యభావమును ఒకటే. ఇట్లే భాస్కరీయానుకరణలు మరికొన్ని కన్పించును.

## కొన్ని ముఖ్యపదములు - అర్థములు

కవి నిరోష్ఠ్యనియమమువలన కొన్నికొన్ని పదములను వింతగా ప్రయోగించినాడు. ప్రథమావిభక్తి 'ము' వర్ణ మనునది యుండరాదు. గావున "ము"వర్ణము రావలసినస్థలములలో తద్విరహితముగా చెప్పినాడు.

*1. నిరోష్ఠ్యములుగా మార్పబడినవి-*

| | |
|---|---|
| 1. రామ, రాముడుఅనుటకు | చిల్కలఁ జేఱెడి చేరిక రెండక్కరాలు (1-81) ధరణీకన్యానాయకుఁడు. |
| 2. లక్ష్మణుడు | అహిరాడంశజస్థరాజాగ్రణి. |
| 3. భరతుడు | చక్రకళా జనిరాజహేళి. |
| 4. భరద్వాజుడు | అండజాఖ్యజటి (2-133). |
| 5. గౌతముడు | అక్షచరణజటి (2-41), అరికాలికంటి జడదారి (2-35). |
| 6. పరశురాముడు | క్షత్రియహంత. |
| 7. విభీషణుడు | కైకసీకనిష్ఠతనయఖగారాతి (4-3). |
| 8. కుంభకర్ణుడు | ఘటకర్ణుడు (5-16), కలశకర్ణఖచరారి (4-153). |
| 9. కాలనేమి | తాటకేయతనయనిశాటకర్త (5.88). |

10.గుహుడు (నిరోష్ఠ్యమేయైనను) కందరాఖ్యచే కానగనైన దాస జనకర్త (2-132).

ఈ విధముగా మరికొన్ని గలవు.

## 2. లోకవ్యవహారములో రూఢియైన పదముల మార్పు -

| | | |
|---|---|---|
| 1. | అమృతము | చారణాహారరసము (5 - 174), ఆదితేయాన్నరస (5-175) |
| 2. | ఇరువదిచేతులు | సెలగకేలు (4-38). |
| 3. | పదునాలుగేండ్లు | రెట్టియేడేండ్లు 2 × 7=14 (2-127). |
| 4. | పర్ణశాల | దళశాల (2-136, 3-4). |
| 5. | విసనకఱ్ఱలు | గాలికఱ్ఱలు (5-298) |
| 6. | వింజామరలు | ,, ,, |
| 7. | పంపాసరస్సు | అధరసంఘట్టననైన రెండక్కరాల్ గల సరస్థ్సలి (3-67) |
| 8. | వాలి | దినరాణ్ణందనకీశకర్త, ఘనశైలారాతిజాతహరి (4-70) |
| 9. | దుందుభి | ఆనకాఖ్యకలిగినట్టి ఖగారాతి (3-85) |
| 10. | స్వయంప్రభ గుహ | రత్నసాలహిరణ్యరాజిగేహాంగణరంజితరాజధాని (3-12) |
| 11. | సంపాతి | దినకరసారథినందననీడజనేత (3-129) |
| 12. | జటాయువు | హరిసారథి సంతతిగ్రద్ద (3-61). |

'ము' వర్ణరహితముగా ప్రయోగింపబడిన రూపములు ('ము' ఓష్ఠ్యము కావున) :

1. అంతరాన (1-74), జలజాల (1-65). అరణ్యాన (2-45), కనిక రాన (1-101), నెయ్యాన(2-125), కయ్యాన (2-92), ఏకతాన(5-107) సంతసాన (5-298), కళంక (4-12), నాళ (కంఠనాళము అనుటకు)

ఈ విధముగానే మరికొన్ని విధములు -

2. వ్యాకరణరీత్యా 'వ' కారము రావలసిన చోటులయందు 'ర' వాడబడినది (వ-ఓష్ఠ్యము),

వినరె, కటాక్షింపరే, జనరయ్య

3. చెఱువులు అనుటకు చల్లికడన్ అని (3-106).

4. సంహారించిన - అనురూపము నిరోష్ఠ్య మన వీలులేదు కాని యీ గ్రంథమున ప్రయోగింపబడినది (5-17).

4. దాసకరి (4-69) - దాసుడను అర్థములో వాడబడినది. దీని నుండియే 'దాసరి' యైనదేమో !

చాఱల్ జెల్లల్ (4-88) - చాఱ మత్స్యవిశేషము; జెల్లలు-చేపలలో చిన్నరకపువాటిని జెల్ల లందురు.

నిరోష్ఠ్యనియమమువలన కవి మార్పుచేసిన శబ్దములు రూపములు చాలా గలవు. విస్తరభీతికి కొన్నిటినే తెల్పినాను.

## ము గిం పు.

కవితపుట్టిల్లు మరిగంటివారి యిల్లు. సంస్కృతాంధ్రభాషారమణి గళాభరణములుగా నెన్నికృతులనో సంస్కృతాంధ్రములయందు వీరు వెలయించినారు. వానియందు అసూర్యంపశ్యల సంఖ్యయే యధికము.

ఈ గ్రంథపు పీఠికయందు మరింగంటి కవులను వారి రచనలనుగూర్చి కొంత పరిచయము చేసినాను. అముద్రిత గ్రంథములే హెచ్చుగా నుండుట వలనను అవియైనను అందుబాటులో లేకపోవుటవలనను ఉదాహృతుల నొసంగలేకపోయితిని.

వారణాసి అచ్యుతరామకవి 'సురతాణీ పరిణయము' కృత్యాదిలో మరింగంటి కవులవిషయమై వ్రాసినాడట. చాలాకాలముక్రింద ముద్రణమైన యీగ్రంథము లభింపలేదు. దీనిలో ఏమైన విశేషములు తెలిసెడివేమో! **పీఠికయందు నేనుతెల్పిన విషయములలో లోపాఽలోపము లుండవచ్చును.**

అభిప్రాయభేదము లుండవచ్చును, కాని, నాయభిప్రాయములను గ్రంథాధారములతో తెల్పినాను.

ఈ కృతియం దేమైన దోసగులున్న వానిని సింగరాచార్యుల కంట గట్టకుందురని యాశించుచున్నాను.

మరింగంటి కవులపైవచ్చిన వివిధ రచనలను లభించినంతవరకు పరిశీలించి యవసరమగు స్థలములందు వానిని పేర్కొని ఆకరము లొసంగినాను. ఆ యా రచయిత లందరకు అభివాదములు, నల్లగొండకవులనుగూర్చిన నా వ్యాసములు కొన్ని యీ సందర్భమున అవసరమైనవి. వాటికి పుట యడుగున 'శ్రీ'యని గుర్తుంచినాను. పరిష్కరణసమయమున అనుమానములుగా నుండి సవరించుటకు వీలుగాని కొన్ని పద్యములను ఆవిధముగానే ఉంచి ప్రశ్నార్థక చిహ్న ముంచనైనది.

నా యీ పరిశీలనమందు అజ్ఞత వల్ల పొరపాట్లు కలుగవచ్చును. సాహిత్య ప్రియంభావుకులు వానిని అప్రియములుగా భావింపరని విశ్వసించుచున్నాను.

తెనుగు సారస్వతమున-అందు తెలంగాణలోని కవులయందున మరింగంటివారిదొక విశిష్టశాఖ, ప్రత్యేక పద్ధతి, వీరి ముద్రితాముద్రిత సంస్కృతాంధ్ర రచనలగూర్చి పరిశ్రమించుట మిక్కిలి యవసరమని విన్నవించుచున్నాడను.

"అంతయొ యింతయో తెలిసినట్టి విమర్శకులైన కావ్యసి
ద్ధాంతుల యొత్తిడింబడి మహాకవి నాఁగటిచాలుదీర్పు఼ గా
లాంతరకీర్తి వృష్టిగతమై చను లాభమునెంచుచున్ లలా
టంతపరూక్షచింతన నటన్మధుభారతి సస్యధారణిన్"— విశ్వనాథ.

శ్రీరంగాచార్య.

30-12-1969,

పాలెము.

శ్రీమతే రామానుజాయ నమః

# దశరథరాజనందన చరిత్ర

## ( ప్రథమాశ్వాసము—కృత్యాది. )

సీ॥ *[1]సిరివరించినమేలు గిరిధరించినకేలు
దనరువాఁడు శుభోక్తి[2] నొనరువాఁడు,
చిలువరాయనిపాన్పు నలువపాయనికాన్పు
[3]గలుఁగువాఁ డసురుల కలుఁగువాఁడు,
పులుఁగు తత్తడిపోక - జిలుఁగు పుత్తడికోక
గట్టువాఁ డమరుల పట్టువాఁడు,
తెలిదిన్నెపై అచ్చ మెలిగొన్న యెదమచ్చ
[4]మెఱయువాఁడు - కృపాబ్ధి నెఱయువాఁడు,

గీ॥ హాటకనిశాటవక్షఃకవాట వాట
[5]పాటనోద్భట శతకోటి పటలచటుల
శితనఖంబులవాఁడు లక్ష్మీనృసింహుఁ
డెలమి మాయిలవేలుపై నిలుచుఁగాక. 1

గీ॥ శ్రీసుకర్పరధాముఁడౌ శ్రీనృసింహు
సిరుల వక్షస్థ్సలంబున శ్రీయనంగ
వెలయు శ్రీరాజ్యలక్ష్మి సేవించి - దినము
మదిని భావించి నుతియింతు మమత నెలమి. 2

---

* శ్రీరామామణి యాననాంబుజముపై శృంగారము ల్గుల్కఁ గ
స్తూరీబిందు మరంద వాసనలకున్ సొంపారు భృంగమ్ములో
నా రంజిల్లెడు చూడ్కులం దన ప్రియానందాబ్ధి నోలాడు - మా
వీర శ్రీ నరసింహుఁడెల్లపుడు నుర్విన్ మమ్ము రక్షించుతన్.
(సారస్వత సర్వస్వమున ప్రథమాశ్వాసము ఈ పద్యముతో ప్రారంభము)

1. సిరిధరించిన (సా) 2. దనరువాఁడు (సా) 3. గలుగువాఁడును సిరుల్
గలుగువాఁడు (సా) 4. నెరయు (సా) 5. పాటవోద్యమ(ము).

చ॥ [1]తనయనురాగవృద్ధి విదితంబుగ వెన్నుఁడుచూపు పోల్కిఁ జ
క్కని యురమందు భాసిలెడు కౌస్తుభరత్నము[2] చేతఁ జూడఁగాఁ
జనువు పసిండిబొమ్మ క్రియ సంతసమొప్ప వసించునట్టి యా
ననవిలుకాని తల్లియగు[3] నాతుక మాగృహసీమ[1] నుండుతన్. 3

చ॥ హారికిఁ బయోధి పుత్రికి నుదంచిత తల్పకమై, సహస్ర భో
గరుచిర రత్నదీపకళికాప్రకర ప్రభవత్ప్రికాశ వి
స్ఫురణల లోక నిర్మలతబూనఁగఁ జేయుచు సర్వదాస్య వై
ఖరి రచియించు శేషఫణికాంతుఁడు మాకు శుభోక్తు లీవుతన్. 4

సీ॥ [5]ఊతచే నెగయంగ నూర్ధ్వదేశంబుల
బ్రహ్మాండభాండ కర్పరము నంట,
వాలంబు పురివిప్ప జాల దిక్పాలుర
పట్టణంబులు పరవంజి కప్పఁ,
బక్షముల్ విసరెడి పవనవేగంబున
గిరులు గృధ్రంబుల కరణినాడ,
నుంకించి త్రొక్కఁగ నుర్వీతలం బెల్ల
నహిలోక పర్యంత మడఁగిపోవ,

దనరి విశ్వప్రపంచమంతయును దానె
యగు విరాడ్రూపసంపత్తి నచ్యుతునకు
వాహనంబై నిశాటుల వడి జయించు
గరుడుని భజింతు క్షేమంబు గ్రందుకొనఁగ. 5

మ॥ వనజాతప్రభవాండ దుష్టదనుజవ్రాతంబు శిక్షింప సం
జనితంబైన ప్రతాపరేఖ యనఁగా సౌవర్ణవేత్రంబుఁ గై
కొని లక్ష్మీపతిచెంతఁ జేరి భయభక్తుల్ మీర వర్తించు శో
భన సంశీలి, సువర్చలాసుతు మదిన్ భావింతు నశ్రాంతమున్. 6

ఉ॥ శ్రీకరరామ భారతవిశేషకథా జలరాశిఁ దేలి య
స్తోక పదార్థరత్నములఁ దోరముగా బుధకోటి కిచ్చి సు

1. తనయనుకాశ(సా) 2. చెంత(పా) 3. నాడుత (వ్రా) 4. నెప్పుడున్ (వ్రా) 5 ఊకచే (శి)

శ్లోకరుచుల్ దిగంతముల లోకములన్ బ్రసరింపఁజేయు వా
ల్మీకి బరాశరాత్మజు నమేయ కవీంద్రుల బ్రస్తుతించెదన్. 7

గీ॥ రాజపూజితు వేదశాస్త్రప్రవీణు.
సరససాహిత్యలక్షణ చక్రవర్తి,
నుభయభాషాకవిత్వ ధుర్యుని మదగ్ర
జన్ము మఱిఁగంటి యప్పలాచార్యు నెంతు. 8

సీ॥ జలజాక్షు పరికరాంశప్రభూతాత్ముల
బన్నిద్ద రాళ్వార్ల బ్రణుతి సేసి,
పంచనంబుల శాస్త్రపారీణుల భజించి
యామునాచార్యుల నభినుతించి,
రామమిశ్రుల నతిప్రేమచే గీర్తించి
ఘనుల శ్రీమన్నాథమునుల బొగడి,
పెరియజీయరు శిష్యసురకల్పకము నెన్ని
సూరిదూప్పిల్ సిళ్లగారి దలఁచి

వాసి డెబ్బదినాల్గు సింహాసనముల
గురువుల సమగ్రవైభవాకరులఁ గొలిచి
[1]సిరుల మాతలిదండ్రుల వరదమాంబ
వేంగళార్యుల హృద్వీథి వేడ్క నిలిపి.

ఉ॥ ఆరయ శబ్దహీన మగునట్టి పదస్థితి గల్గి పై నలం
కారము[2]తెల్వి చేకుఱక క్రమ్మిన శయ్యల సంధి[3] దేలుచున్,
గౌరవవృత్తి నర్థముల గానని [4]యా కవిచోరకోటి ని
స్సారము సేయఁగావలె వెసన్ ద్విజరాజకళాసమృద్ధిచేన్. 10

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును, బూర్వాచార్య సంకీర్తనంబును, గుకవి
దూషణంబును గావించి మదీయవంశావతారం బభివర్ణించెద - 11

---

1. సరళి(సా) 2. దెల్పిచేకొనక(సా) 3. దెల్పుచున్(సా) 4. కాకవిజారకోటి
(సా) 5. అదెసన్(ము)

## కవి వంశావతార వర్ణనము

సీ. తనతపస్సామర్థ్యమున జరకత్వంబు
విడి వయశ్శాలిమై విస్తరిల్లె
దనవంశజు లనేక ధనపుత్రరూపవి
ద్యాశీలురై మీర నతిశయిల్లెఁ
దనధర్మపత్ని యుత్తమ సాధువర్తన
కనసూయ కెన యన వినుతి గాంచెఁ
దనసత్యనిష్ఠ మాధవ శంకరసరోరు
హాసనుల్ తలలూఁచ నత్తమిల్లెఁ

దనదు సాహాయ్యమునకు గౌతమవశిష్ఠ
కౌశికాత్రి భరద్వాజ కణ్వజామ
[1]దగ్న్యపాత్రముఖార్యులు దలఁప నలరె
దానసౌశీల్యధాని మౌద్గల్యమౌని.

కం. ధర నిట్టి మునివరాన్వయ
శరధికి గౌస్తుభముపోలె సద్గుణశౌర్యా
భరణ స్ఫురణంబులతో
బరఁగిన యాసూరి సాధుభట్టరుఁ డలరెన్. 13

తే. అనఘుఁ డా సాధుభట్టారకాహ్వయుండుఁ
గూరనాయక దేశిక కుంజరంబు,
ముదిలియాండాను, డీఘనుల్ ముగురుఁ గొల్వ
నవని విలసిల్లె లక్ష్మణయతి వరుండు 14

సీ. శ్రీఁగొప్ప బంద్రెండు వేలత్రిదండి స
న్న్యాసులు సప్తసహస్ర సంఖ్య
లేకాంతి జనపరమైకాంతివరులు డె
బ్బదినాల్గు పేరులఁ బరగినట్టి

1. దగ్నిహోత్ర? (సా)

గురుచంద్రు లోకలక్ష తిరునామధారులు
[1]నలమదిగ్విజయార్థమై గమించి
యనుకూలుర గ్రహించి యన్యుల బోధించి
చెనఁటుల శిక్షించి శ్రీమతంబుఁ
బూని శేషాంశ సంభవులైన లక్ష్మ
ణార్యు లష్టదిశల్ గలయంగ నిలిపి
తిరిగి శ్రీరంగధాముని ధృతి భజించి
చేరవచ్చిన, నాస్వామిఁ జెంగలించి. 15

కం. కంటిన్ లక్ష్మణమునివరుఁ
గంటిన్ గూరేశ దేశికస్వామి మరిం
గంటి నదెవ్వరన, మరిం
గంటి [2]మహాన్వయము దనరె గణ్యం బగుచున్. 16

గీ. సలలితాసూరికుడిచే బ్రశస్తిఁ గన్న
సాధుభట్టారకుఁడు రంగశాయి వలన
నిల మరింగంటి వారన్న యింటిపేరు
గురుశిఖామణు లెన్నఁగా బరిఢవిల్లె. 17

సీ. ఆసాధుభట్టార కాత్మజుఁడై దయా
కలితశీలుఁడు పిళ్లగారు పుట్టె,
నతనికిఁ బెరియ పిళ్లాఖ్యుఁ డాఘనునకు
శ్రీరంగనాథ దేశికుఁడు వొడమె,
నతనికి దీర్ఘదారయ్యా యాసూరికిఁ
జీయగారలు జనించిరి ప్రసిద్ధి
నతనికి యామునుఁ డా భవ్యమూర్తికి
మాధవగురుఁడు సమ్మతిగఁ గల్గె
నతనికి ఫలించె సకల రాజాధిరాజ
రాజమకుటాగ్రఘటిత చిరత్న రత్న

1. నలరి (సా) 2. మహాన్వయునగణ్యుఁ గౌతుకి నగుచున్ (సా).

బహుళ నీరాజనాతి విభ్రాజితాంఘ్రి
సరసిజుఁడు చెన్నయాచార్య చక్రవర్తి. 18

కం. తనజననీ గర్భంబున
జనియించెడి వేళ నొక భుజంగమకవఁడై
కనుపట్టి యనంతాళ్వా
రనుపేరన్ బరఁగి చెన్నయార్యుం డలరెన్. 19

చ. చెలిమి గజేంద్రవల్లభునిచేత సపర్యలుఁ గొంటఁ గాన బె
బ్బులిరదనంబు లూడ్చివడిఁ బోనిడుటల్, తళిహప్రసాదమున్
వెలుచగు బ్రహ్మదైత్యునకుఁ బెట్టుటలున్, బెనుబాముముక్తి కిం
పలరఁగఁ బంపుటల్ గలమహాత్ముఁడు చెన్నగురుండు భాసిలెన్. 20

ఉ. చెన్నగ బ్రహ్మరాజపురి చెన్నుఁడు తానిలవేల్పుగాఁగ నా
చెన్నుని [1]పేరుబూవి సిరి[2]బెందుచు దేవరకొండసీమలో
సన్నుత పణ్కరాజు పలి శైలమునన్ మరిఁగంటి చెన్నుఁడై
[3]యెన్నికమించె భూజనము లింటను దొడ్డను మందపేరిడన్. 21

సీ. వేదశాస్త్రపురాణ విద్యల [4]నలరారు
చక్రవర్తుల[5] గెల్చి విక్రమించె
నవని బందొమ్మంద్ర యన్నలతోఁ బుట్టి
హరులీల ఫాలాక్షుఁ డగుచు నలరె
శ్రీమతంబుఁ బ్రసిద్ధి జేసెడి మణవాళ
యతికి[6] సమానుఁడై యతిశయిల్లె
సూరి నలంతిగళ్ నారాయణస్వామి
భాగినేయత గీర్తి బరిఢవిల్లెఁ
బాచి పైకంబు ముడుచు లుబ్ధకులకెల్ల
నింట[7]భోజుగ విలసిల్లె, నిట్టి చెన్న

1. పేరఁబూని (వ్రా) 2. బెందెడు (వ్రా) 3. యెన్నికకెక్క భూజనము లెన్నఁగ నింటను దొడ్డిపేరిడన్ (వ్రా) 4. నటనచే (సా) 5. కొల్వులా క్రమించె (సా) 6. సహాయుఁడై (సా) 7. బొట్టుగ(సా).

దేశికునకు దనూజులై తిరుమలయ్య
భట్టరుఁడు సింగరప్పఁడు ప్రబలిరందు. 22

చ. విరివిగ భట్టరార్యునకు వేంగళనాధుఁడు పుట్టె వానికిన్
బరమత భేది తిర్మలయ భట్టరుఁడున్ బ్రభవించె నందులన్
దిరుమలసూరికిన్ గలిఁగెఁ దేజున మించిన వేంగళప్పడుఁన్
సరసగురుం డనంతుఁడు ఘనప్రతిభాఢ్యుఁడు సింగరప్పఁడున్. 23

వ. అం దగ్రజన్ముండు

చ. కలిమికి రాజరాజు, బలుకాంతులఁ జుక్కల రాజు, రూపురే
ఖల వలరాజు, వైభవ వికాసమునన్ సురరాజు, సత్యపుం
బలుకుల ధర్మరాజు, ఘనభాగ్యమునన్ వసురాజు నా దగెన్
బలియుఁడు వెంగళార్యగురు పట్టపురాజు జగత్ప్రసిద్ధుడై. 25

క. సరసుఁడు వేంగళగురుమణి
వరదాంబన్ బెండ్లియాఁడె-వనజాతుం డా
శరనిధికన్యారత్నము
వరియించిన పోల్కి నధిక వైభవ మెసఁగన్ 26

వ. అట్టి వరదాంబ యెట్టి దంటేని- 27

చ. విడిముడిగల్గి బంధువులు వేడ్కగృహంబున నిండియుండ నె
ప్పుడు ధనధాన్యముల్, మణులు, బుట్టములున్, బశువుల్, తురంగముల్
తొడవులుఁ, జేత లక్ష్మి తులఁదూగుచుఁ బట్టినదెల్లఁ బైడియై
పుడమి ప్రసిద్ధి కెక్కె హరిపూర్ణకృపన్ వరదాంబ యెంతయున్. 28

తే. గీ. అట్టి మరిఁగంటి తిరువేంగళార్యువలనఁ
వరదయాగుణ నికురుంబ వరదమాంబ
[1]శీల సౌందర్య విద్యా విశేషకళల
బలియులైనట్టి యష్టపుత్త్రిలను గనియె. 29

1. సిరుల సౌందర్య (ప్రా), లలిత సౌందర్య విద్యావిలాసములను (సా)

సీ. ముగురు రాజులచేత మ్రొక్కులు గొన్నట్టి
 భగవత్సమానుఁ డప్పలగురుండు
వేద వేదాంగాది వివిధార్థ సంపత్తి
 నతిశయిల్లిన వేంకటార్యమౌళి
కలిత సౌందర్య రేఖా విలాసంబులఁ
 జెంగలించెడి శ్రీ నృసింహఘనుఁడు
కుపితమాయావాది గురుశాస్త్రహరణపా
 రగుఁడైన కోనేటిరాయశౌరి

సరస శతపద్యలేఖినీ విరచనోక్తి
గలజగన్నాథసూరి యగ్రజులుగాఁగ
నలర రంగప్ప, నరసింగరప్ప తమ్ము
[1]లై వెలయువాఁడ భువి సింగరాహ్వయుండ. 30

మ. సముదీర్ణస్థితి వేంకటేశ్వరుఁడు నాస్వప్నంబునన్ షోడశా
బ్దములన్ [2]మాణవకాకృతి న్నిలిచి 'వత్సా యాంధ్రభాషానిరో
ష్ఠ్యమహాకావ్యమొనర్పుమీ' యనిన నత్యారూఢి మేల్కాంచి మో
దమునన్ జెప్పితి భూమిపైఁ గవిజనాధ్యక్షుల్ ప్రశంసింపఁగన్. 31

మ. మును రామాయణము న్నిరోష్ఠ్యముగ నింపుల్ మీర శాకల్లి మ
ల్లన, తా సంస్కృతభాషఁ జేసెనన నాలాగున్ జెవుల్ నిండఁగా
వినుటేగాని ధరిత్రిలో నిజముగా వీక్షింపలేదట్టి దేఁ
దెనుఁగున్ జేసెదనెల్లెడన్ గవులకున్ దృష్టాంతమై యేర్పడన్. 32

మ. వరవందారు జనావళీహృదయ సద్వాంఛార్థకృ ద్వేంకటే
శ్వరసంపూర్ణ [3]కృపసుధామిళిత వీక్షామాధురీ మార్గవి
స్ఫురితైకైక దినప్రబంధరచనా స్ఫూర్జద్వచ క్ష్మడన్
నరనాగాశ్వనృపాల సభ్యగణితుండన్ సింగరాచార్యుఁడన్. 33

1. లై మెఱయువాఁడము.

2. మానవునాకృతి (సా) 3. కటాక్షమిళితక్ష్మామాధురీ (సా)

## షష్ఠ్యంతములు

క. ఏతాదృశగుణశాలికి,
ధాతృముఖాదిత్యగణితధానాతిశయ
ఖ్యాతికళా భూతికళా
నీతికళాన్వితునకున్ మునిప్రీతునకున్. 34

కం. సురసేవిత చరణావిత
హరజీవితునకు నిలింపయతి వినుతునకున్
సురరక్షాఽసురశిక్షా
వరదీక్షాదక్షునకుఁ, గృపావీక్షునకున్. 35

కం. బలతారాచలతారా
కులమారాహితవళక్షగురుయశున, కిలా
బలధీరాచలవారా
నలఘోరాకారునకు గుణస్ఫారునకున్. 36

కం. వనవిధి కన్యాకుచనత
ఘననఖరత్రుటిత దితిజకఠినోదర సం
జనితాస్సృగ్జనదూరిత
కనదాగ్రహదహనునకు జగద్వహనునకున్. 37

కం. హీరఘటీతారపుటీ
హీరపటీరారి మకుటహరిసామజ[1]కం
జారి పుటీభూరినటీ
హారిసుహృద్భక్తునకు దయాసక్తునకున్. 38

కం. చక్రాహత వక్రాహిత
నక్రాధిపమస్తకునకు నగకన్యారా
ట్చక్రద్రుహిణ క్రౌంచజి
దక్రూర ప్రణితఘృణికి నరిగజసృణికిన్. 39

---

1. కుంజార (ము)

కం. కరలసదరికిన్ బదభవ
ఝరికిన్ ధృతగిరికి నవితజల గతకరికిన్
జిరతర కర్వరపురనర
హరికిన్ నుతహరికి రుచిరహరికిన్ హరికిన్. 40

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన దశరథరాజనందన చరిత్రయను
నిరోష్ఠ్యప్రబంధమునకుం కథాక్రమం బెట్టిదనిన- 41

## కథా ప్రారంభము

కం. శ్రీకి గృహస్థలియై ధా
త్రీకన్యాచరణజలజదీధితిరత్నా
నీకాంచిత కటకాకృతి
సాకేతాఖ్యాకనగరి చాలరహిల్లున్. 42

సీ. జలధరాధిక సితచ్ఛాయలఁ దనరిన
గంధగంధిల గంధిఘటలచేత,
ననిలచిత్తాతీత ఘనరయక్రియలచేఁ
జాలరంజిలిన తేజీలచేత,
రణధాత్రి నంగజారాతి నాధిక్యాన
గేలిఁజేసెడి యక్కటీలచేతఁ
గనకాద్రిశృంగరేఖల నీసడించిన
దండినిండిన యరదాలచేతఁ

గణనకెక్కి ధరాఖగక్షత్రియార్య
చరణజాఖిల ధనధాన్యసాలఖేయ
చందనాగ తటాకరాజ గృజకంజ
రాగ సంస్థాని సాకేత రాజధాని. 42

కం. శతధృతినగరికి, నచలా
హితనగరికి ధనదనగరి కెనయనఁగా నా
యతధనధాన్యశ్రీ సం
తతిచే సాకేతనగరి ధర రంజిల్లున్ 44

కం. ఆ రాజధాని కేలిక
స్థై రాజిలె దశరథాఖ్య నలరిన ధరణీ
దారకళానిధి హరిచర
ణారాధన జనిత శక్తతాऽనుచరగతిన్. 45

ఉ. నించె ధరిత్రి నిండ నతినిష్ఠ ఘటిల్లఁగ గీర్తిచంద్రికల్
గాంచె దిగంతరాజతతి కాన్క లిడన్ సకలార్థసిద్ధి ని
ర్జించె రణాంగణస్థలి నశేషఖలాహితనేతలన్ దితి
క్షాంచిత దాంతి సాహసదయాజయ సత్యకళాతిశాయియై. 46

కం. అతఁడచలానాయక సం
హతిచే నాస్థానిఁ గాంచనాసన ధరదా
నతిశయిలెఁ దారకాంత
స్థిత రాకాసితకరాకృతిన్ గళ లెసఁగన్ 47

వ. ఇట్లా దిగంతరాజసంతతి యాచ్ఛాదించ సింహాసనస్థాయియై
రంజిల్లె నంత. 48

మ. సకల శ్రీనిధియైన యా దశరథక్ష్మాకర్త తానర్థి ని
ష్టకథాసంగతి ధాతృనందనజటిన్ షట్ఛాస్త్ర సంశీలి న
త్యకలంకాహిశయాన కంజచరణ ధ్యానైకహృచ్ఛాలి దే
శికహేళిన్ గని స్రష్టలెల్ల గణనల్ సేయంగ నాడెం దగన్. 49

గీ. తరణి సంతతి రాజసంతతికి నెల్లఁ
జింతఁ దొలఁగించ నిష్టార్థ సిద్ధిఁ జేయ
ధాతగతిఁ దల్లి తండ్రి నా త్రాతరీతి
నింతగా గడతేర్చినా రింక నెట్లు. 50

ఉ. కేల ధరించితిన్ ధరణిఁ గిట్యగశేషగజాళి కాశగాఁ
గేలఁ జయించితిన్ దిశలఁ గీర్తన సేయ నరాధినేతలన్
జాల గ్రహించితిన్ సకలశాస్త్రకథల్ ధృతినైన నాయెదన్
జాల దనర్చె దీని నడఁచంగల శక్తి ఘటిల్లఁ జేయరే. 51

క౦. సంతతి లేదని చాలా
చింతించెడి దానికతన క్షితి సకలశ్రీ
లెంతొ తృణాకృతి జేసితి
సంతింతనరాని యార్తి నగలితి సనఘా. 52

చ. కరిఘట లేల, జిత్రగణికాచ్ఛట లేల, హిరణ్యశాటికా
హరిధనధాన్యరత్న ఘటితాచ్ఛదలంక్రియ లేల నర్థిశల్
స్థిరగతి నేలఁగాఁ దగిన తే జది యేల, ననేకచర్యలున్
సిరిగలయట్టి సంతతిని జెందిన యాయెడ లెస్స లన్నియున్. 53

క౦. అన నాలకించి యాయజ
తనయాగ్రణి కాంతు దెలిసి దరహాసదృఢా
ననుఁడై [1]తానెరతేనెల్
చినుకఁగఁ జటినేతయాడె సిరి సంధిల్లన్. 54

సీ. ఆలించితి నిశాచరారికథాశ్రేణిఁ
గర్ణరంధ్రానందకారిగాఁగ
దేలించితి ధరాదితేయాగ్రణిచ్ఛట
లిష్టార్థ సంసిద్ధి హెచ్చరించ
నేలించితి ఖచర స్త్రీల శాతాసిచే
రణధాత్రి నరిరాజరాజిచేత
గాలించితి దిగంత ఖలజన సంతతి
దిశియించనీక క్రిందికి దిగంగ

శరశరచ్చరదానంత చంద్ర చంద్ర
హార నీహారతారకా తారహార
సితయశ [2]స్థగితా చక్రశిఖరిదేశ!
తతదయాసాంద్ర! దశరథక్షితితలేంద్ర. 55

[ఉ.*ఐనను సూనహీనుఁడగునట్టిడు ధారుణిలోన "సూనుఁడా
సూనుఁడ" యంచుఁ జింతఁ గనుచున్ జరియించును నించుకేనియున్

---

1. తే నెరతేనెల్ ము) 2. స్థదితా (ము). *55నెం. పద్యమునుండి 75 పద్యమువరకు 'ము'లో కుండలీకరణ ముంచి యథస్సూచిక నిట్లు వ్రాసిరి- "[ ] ఈగుఱుతుల మధ్యనున్న పద్యము లక్కడికథ శిథిలమై పోవుటచే దిరుగ వ్రాయబడియె. నిందలి తప్పు లొప్పులు పరిగ్రహింప వేడెద-ఇట్లు లేఖనకర్త"

నూనఁడు తుష్టినెంతయును నుండిన శ్రీలను జూచికొంచు బా
గాన సుతుండె శ్రీల కిలఁ గర్తయు సంశ్రయుఁడైన యాతఁడున్. 56

శా. కానన్ నేనిడు నాజ్ఞ నింకను దలన్ గైకొంచు సంతుష్టి నో
జ్యానాథా ! తగు[1] నిష్టిజేయ నెదలో సంధించి నూతీచ్ఛ, నా
గానా ఛేఁదది యాలకించి యటులం గానిండు ధన్యుండ నే
నైనాఁడన్, యతిచంద్ర! యంచు ననఁగా నారాజులతో సూతుఁడున్.

సీ. అనునిట్లు నరనాథ ! యంగ దేశుండు
తన ధారుణికి జలధరునిరాక
లేక సస్యాళులుఁ గాకుండ జనులకు
దారిద్ర్యదశయును దనర జూచి
ధాత్రీసురేంద్రులఁ దా గాంచి యయ్యలా
రా ! యిట్టు లయ్యెనే నరయ నెద్ది
సేయంగఁ జెల్లునో జెచ్చెర నానతిం
డని యడుగంగ నా యార్యులెల్లఁ

దగిన సరణిని నెదలఁ జింత యొనరించి
యనిరి "కానను ఋష్యశృంగాఖ్యయోగి
నిష్ఠనూనెను నొకకొండినెగడు నుదుట
నతని, కాతని గొనిదేరనగు నిచటకు." 58

మ. అతనిన్ దోడ్కొనితెచ్చి యిచ్చటకు రాజా ! నీ సుతన్ శాంతఁ ద
త్పతిగాఁ జేసిన లోలుఁడై చెలఁగు నాతం డాతనిం దేరగా
క్షితిలో నేరికిఁ జేతఁగాదు గణికాస్త్రీల్ దేగలా రన్న నా
నతిగైకొంచు నరేంద్రుఁ డా సతులఁ దా నంచెన్ జటిన్ దేరగాన్. 59

శా. ఆ యోగీంద్రుని దోడితెచ్చి నరనాథాగ్రేసరుం డంత నా
శ్రీయుక్తుం గడు నర్చఁజేసి, తనయన్ జేకూర్చి సంతుష్టిఁ ద
జ్జాయంగా నిజధాత్రి నార్తి క్షతిఁజెందన్ రాజిలెన్ గాన ధా
త్రీయోషేశ ! యతండు రాఁగఁ దగు నర్థిం జేయు నీయిష్టికిన్. 60

1. నిష్ట (ము)

మ. అనఁగా నట్ల యటంచు నంగధరకీజ్యా నాయకుం డేఁగి త
జ్జననాథున్ గని యాజ్ఞ గొంచుఁ జటిఁ దజ్జాయన్ నిజక్షోణికిన్
గొని యేతెంచి నిజార్యునాజ్ఞను దలన్ గొంచున్ ధరానిర్జరుల్
చనుదెంచంగను జేసె నిష్టిని సురల్ సంతుష్టితో నుండఁగన్. 61

వ. ఇట్లు సేయుచుండ. 62

మ. సరసీజాసను చెంత కేఁగి సకలాశానాయకాదుల్ సురల్
ధర లంకానగరీశుఁడైన దనుజోద్దండుండుఁ దాఁ గ్రూరుఁడై
ధరియించంగను నేరనట్టి ఘనచింతల్ గూర్చుచున్నాఁడు నీ
కరుణంజేసి యటంచు దుఃఖితులుగాఁగాఁ జూచి యా ధాతయున్. 63

చం. సురలను దోడుకొంచు సరిసూదనుఁడై దనరారు నిందిరా
ధరుఁడుఁ జెలంగు నీరనిధితట్టున కేఁగి నుతించుచుండఁగా
నెటఁగి సరోజలోచనుఁడు నీ సురలుండిన చెంత కేఁగుదెం
చి రహిని నిల్చినన్ నతిని జేసిరి నిర్జరు లెల్ల నంతటన్. 64

సీ. క్షీరనీరధియందు శేషాహిరాజు నం
దుననుండి నిదురించు ఘనగుణాఢ్య
నిత్యసూరులు నుతి న్సేయుచుండఁగ 'హాయి
హాయం'చు నిదురించు ననఘచరిత
యాదితేయుల కెల్ల నరుదెంచు నార్తుల
నడఁచుచు నిదురించు నఖిలనాథ
జటినాయకుల చిత్తజలజాల నలరుచు
నందందు నిదురించు నార్యశరణ

సరసిజాసనసందత్తశక్తి, కఠిన
దశగళాసురరాడ్రచితార్తి దుఃఖి
తాఖిలాదితేయులు నిన్ను నర్థితోడఁ
గొలుఁచుచున్నారు రక్షించు కలితదయను. 65

మ. సరసీజాయతనేత్ర! యా దశగళాశానాయకారాతి, ని
ష్ఠ రజోనేతను నర్చఁజేయ నతఁడున్ సంతుష్టి నేతెంచి యా

దురితాచారుఁడు కోరు కోరికల నెంతో శ్రీఘృతం దీర్చిఁ ద
త్కరుణ న్నిర్జరులార్తిఁ జెందునటులన్ దా జేసెనో[1] యీశితా. 66

వ. కాన 67

చం. ధరణిగుణాఢ్యుఁడౌ దశరథ క్షితినాథునకున్ దనూజుఁడై
హరిహయకంటకుండగు దశాస్యునిఁ ద్రుంచకయున్న నింక నే
కరణిని సుందరీ సురులు గ్రక్కునఁ జచ్చెదరంచునన్న, నా
సరసిజలోచనుండు సురసంతతిఁగన్గొని యిట్లనెన్ దయన్. 68

శా. ఆశానాయకులార చింతఁ గననేలా యిట్టు లాలించుఁడీ
నే శ్రీఘాన ధరిత్రిలోఁ గలిఁగి యా నీచున్ దశాస్యాఖ్యదై
త్యేశున్ సంగరధాత్రిఁ గూల్చెదను, నాకేశాదులన్ గాఁచెదన్
ఆశల్ దీర్చెద యోగినేతలకటం చంతర్హితుండై చనెన్. 69

మ. చనఁగా నంతట నిర్జరుల్ కడుఁ గడున్ సంతుష్టులం జెందుచున్
జనుచుండంగ, సరోరుహోదరుఁడు నాశానాథులారా! ధరి
త్రిని శ్రీకాంతుఁడు దైత్యుఁ గూల్చ దృఢశక్తిన్ సేనలై యీరలుం
డనగు న్నాగనుశైలచారు లయిరా నాకాధినాథుల్ దగన్. 70

కం. ఈలీల నిర్జరుల యం
శాలన్ ధరలో జనించి చక్కఁ దనరు నా
శైలచరతనూజులు శౌ
ర్యాలంకృతు లగుచు నలరి రతిసంతుష్టిన్ 71

ఆ.వె. అందు నింద్రసుతుఁడు నర్కతనూజుండు
ననిలజుండు, ననిలతనయుఁ డధిక
లైరి, సరసిజోదరాంశాన జనియించె
తొల్లి ఋక్షరాజతులయశుండు. 72

ఆ.వె. ఇట్టి కీశులెల రిందిరానాథుని
యఖిక కరుణచేత నలరి రంత

1. 'యీశ్వరా' (ము) 'శ్వ' ఓష్ఠ్యము. (ఈశిత = ప్రభువు- శ. ర.)

శుద్ధతిథులయందు సూర్యసఖుండు తాఁ
దరుఁగకున్నయట్టి సరణి దోఁచ. 73

వ. అంత నిక్కడ దశరథక్షితినాథుండు హయేష్టినించి ఋశ్యశృంగాజ్ఞచే
సుతేచ్ఛేష్టి జేయుచుండ నారాయణుం డయ్యగ్న్యంతరాన నుండి. 74

కం. కేలన్ క్షీరాన్నఘన
స్థాలిన్, ధరియించి తెచ్చి దరినిల్చిన ధా
త్రీలలన పేళికిచ్చిన
నాళీకేక్షణలఁ జేరి నయగతి దేరెన్. 75

ఆ.వె. అగ్రసతికిఁ గైక కది సరిగా నిచ్చి
దాని నింతనింతఁ దనరఁ దిగిచి,
కడ నెలంత కేల నిడ నారగించిన
జఠరచిహ్న లధికసరణి గనిరి. 76

వ. అంత నానాఁట నెలలు నిండిన 77

కం. శ్రీనెరయ గ్రహాళి జయ
స్థానస్థితి నలర ఖచరసంతతి చెలఁగం
గా నెలఁతల్ గాంచిరి తే
రా నెలఁతలతెగలు తెగల రహి నిండంగన్. 78

వ. ఇట్లు గేహినీత్రయి రాచిన్నెలం గన్న నాజినరనేత యగ్రజశ్రేణి హిరణ్య
కన్యాదాన క్రియల నలరించి దశదినసాన్నిధ్యసరణి నంత. 79

ఉ. ధీవిధమైన యాజ్జగతీతలరక్షిత యగ్రదారకా
శా నరనాథకీర్తనల సందడి నిండఁగఁ గంధికన్యకా
జాని కళల్- సితజ్ఞశశిచారణ దేశికరాజి- యంచిత
స్థానగతిన్ దిశించఘనతార జనించినయట్టి దానిచేన్. 80

కం. ఆరాచిన్నం జటి తా
నారసి దశరథనృనేత యానతిచే విం

డారం జిల్కులఁ జేఱెడి
చేరిక రెండక్కరాల జేరఁగ నయ్యెన్. 81

గీ. చిన్నకన్నియ లిద్దఱఁ గన్నయట్టి
నందనత్రయి కా శతానందజాత
యతి, నరేంద్రాజ్ఞ దశరథజ్యాధినేత
యందఱల్ సంతసిల్ల నర్హాఖ్య లిడియె. 82

వ. అంత 83

కం. [1]కందింతలేని లేనెల
చందానన్, నాఁట నాఁట జక్కదనాలన్
జెంది కళాయిత చర్యల
సందడి రా చిన్న లెదుఁగసాగిరి ధరణిన్. 84

శా. ఆ రాలేనెల లంతకంత కతిరాజాకార లేఖాకళా
సారాచార శరాసనాస్త్రకలనా సారస్యలాతుణ్యా శ్రం
గారజ్ఞాన దయాంచితస్థితి తితిక్షా సత్యధైర్యక్రియా
శ్రీరంజిల్లఁ జరించసాగిరి జయశ్రీహెచ్చ నానాఁటికిన్. 85

వ. ఇట్లు దేరినట్టి యెడ 86

సీ. రంజితగాంగేయకంజ [2]కింజల్కాళి
దండిగా జడల నీరెండ గాయ
నన్యచింతాహరణాది నారాయణ
కీర్తన లంతంత నర్తిలంగ
సకల తరంగిణీ సలిల సంగ్రహాయా, క
రాంచిత కరశాఖ యర్ధిఁ దనర
నంగయష్టి నలందినట్టి నీటెల్లడ
నకలంక చంద్రచంద్రికల నీన

అష్టదిగదీశ కిన్నర యక్షసిద్ధ
దితిజఖచర స్థిర స్థలాయత కిరీట

1. కందందనియాలేనెల (వ్రా) 2. కింజల్కాది (ము)

కాంతి [1]సంరాజితాంఘ్రియై గాధినంద
నర్షి యేతెంచె సంతతానందసక్తి. 87

కం. తనకడ కేతెంచిన జటిఁ
గని దశరథ ధరణినేత కాళ్ల కెఱఁగి చ
క్కని కాంచనాసనస్థలి
దనర నధిష్ఠించఁజేసి దాక్షిణ్యగతిన్. 88

ఉ. శ్రీకర సత్యశీల యతిశేఖర సారదయానిధాన నీ
రాకడచేత నెల్ల నఘరాశి యడంగె ననేకసత్క్రియా
నీక రతిన్ దనర్చితి ననిందితకీర్తి ఘటిల్లె సంతత
శ్రీ కిల డెంకి నైతి జయసిద్ధి గ్రహించితినయ్య చక్కఁగాన్. 89

క. హరిగంధ గజస్యందన
హరిహయధనధాన్యరత్న హాటకశాటీ
హరి చందనాదికాంతల్
సిరినిచ్చెద నడుగరాదె శ్రేయస్సిద్ధిన్. 90

ఆ. వె. అనిన సంతసిల్లి యాజటిలాగ్రణి
దశరథక్షితీశ తరణిఁ గాంచి
సరస దంతకాంతి దరహాస చంద్రికల్
జెల్ల గణనజేసి చెల్లనాడె. 91

క. లేరా ధరిత్రిరానెల
లీరా! సకలార్థకాంక్ష లెన్నకఁ జిహ్వల్
దేరా! యన్నిఁట జాణల్
గారా! నీసరణి నడకఁ గనరై రనఘా. 92

చ. సలలిత కీర్తినిండ నినసంతతిగల్గిన రాజరాజి తా
నలయిక చేతనైన గడ హాస్యరసస్థితినైన నిద్రలన్
గలఁగనినైన నాడినది కల్లన నేరనియట్టి సత్య ని
ష్ఠలఁ దనరాఁరె గాదె త్రిజగజ్జనకీర్తన లర్థి హెచ్చఁగాన్. 93

1. సద్రాజి (వ్రా)

వ. అని గణించి. 94

కం. అనఘా ! తాటక యనఁగా
ఘనరజనీచర లతాంగికల, దద్దానిన్
గని దిగధినేతలై నను
జనఁగా లేరచటికైన జడయికచేతన్. 95

కం. చెన్నటి నడఁకలఁ దాటక
గన్నట్టి నిశాచరాధి కర్తలు గలరే
నెన్నిక చేసిన యిష్టిన్
సన్నక సన్నజని చేరసాగిరి యల్కన్. 96

వ. అదిగాన నీ తనయాగ్రణిని నతనిదాయిని నాకిచ్చిన దాటకేయ నిశాట
కర్తల జయించజేసి యాగదీక్షఁ గడఁదేరించెద నాచెంత ననంత కళ్యాణ
సిద్ధి కాఁగల దనిన. 97

కం. తన హృత్స్థలి యదురఁగ దృ
గ్జనిత సలిలధార లెదిగి జారఁగ నజనం
దనరాజ హేళి యాజటిఁ
గని దైన్య రసాతిశయత గ్రాలఁగ నాడెన్. 98

ఉ. కానక కన్నచిన్న, లదిగాక దృఢక్రియఁ దంౘ్రిరాక యే
కానలకేఁగ నేరిచిరె, కానలకేఁగిన దండి నిల్చి యా
శానరనాథచిత్త శితశల్య నిశాచర నేతలన్ రణ
స్థాని[2] నెదిర్చగాఁ గలఁరె శంకిలకే తెగియాడనేలయా. 99

సీ. రణధాత్రి నంగజారాతి యేతెంచిన
[3]గేలిజేసెడి యక్కటీలచేత
నాకాశకషణ దీర్ఘాకార చర్యల
గట్లు గేరెడి కరిఘటలచేత
త్రిదశ ధరాధరశృంగతేజి క్రియల్
తేగటించెడి దండి తేర్లచేత

---

1. గనుక (ము) 2. నెదుర్చ (ము) 3. గేళి (ము)

ధృతిసదాగతినైన ధిక్కరించెడి శీఘ్ర
తర శక్తిగన్న తత్తళ్ళచేత

శరశరాసన నిస్త్రింశ శక్తి ఖేట
కాది ఘనసాధనస్థితి యతిశయిలఁగ
నేనె చనియెద నే జాడనైనగాని
యకట! నాచిన్నరాజిత ననచలేను. 100

కం. ఏ నీ కెదిర్చి యాడం
గా నెంతటి దండి చక్రిగానే గిరిజా
జానిం గానే స్రష్టం
గానే నన్గనికరాన గడజేర్చఁగదే. 101

కం. అని చింతించఁగ దశరథ
జననాయక హేళిఁగాంచి జటిలాగ్రణి తా
ఘనజలధరగర్జా త
ర్జనకృన్నయ సరణినాడె సరసస్థితిచేన్. 102

చం. ఇలఖిలరాజ శిక్ష రచియించఁగ నాశ్రిత రాజసంతతిన్
గలితదయారస క్రియలగాఁచిన రాఁ గడతేర్చ నన్నిఁటన్
గలిగిన శేషశాయి క్షితికాంత నరాకృతిగాఁగ గట్టెదన్
దలఁచఁగ నేటికీస్థితి యథాస్థితిగా నరయంగరాదశే. 103

కం. తెలియక నీరాచనెలల్
కలన నరిచ్ఛటల నెల్లఁ గండ్రించిన యా
తల నధికతరజయశ్రీ
లలరఁగఁ దిరిగిచనఁ గలరయా! యజతనయా. 104

ఆ.వె. అనిన నెట్టకేల కంగీకరించి తా
దాశరథిని నతని దాయి నీయఁ
గలిసి రాజధాని గాధేయ ఋషియును
గదలె నాఁటనాఁట గానఁ జేరి. 105

చ. హరికిరి గంధనాగశలలాండ సృగాల హరీశఖడ్గ కా
సర హరిణీరటద్గహన సంహతిఁ గాంచి యగాధనీర ని
స్తరతటినీతతిం గడఁచి చండధరాధర రాజి దాటి దా
శరధి చనంగసాగె జటిచంద్ర సహాయతచేత నయ్యెడన్. 106

కం. ఈరీతి గాధిజర్షిని
నారా[1]నెలసర్ల గాంచి యాగ్రహశిఖ కీ
లారటితగాత్రి తాటక
దారుణలేచి హితదైత్యతతి గలసి ధృతిన్. 107

చం. ఘనచరణాగ్రఘట్టనల గ్రచ్ఛుటకంధికలంగ నీరద
స్తనిత హృదట్టహాస నినదక్రియ నష్టదిశల్ చలించ దృ
గ్జనిత దృఢాగ్రహానల శిఖాకణ సంహతిరాల నానరా
శనసతి తానెదిర్చి ధృతి సంధిల ఖేటక ఖడ్గహస్తయై. 108

ఆ. వె. అంత గాధితనయు డతిరయక్రియ దేర
దాశరథిని నతని దాయి నరసి
దండ జేరనేఁగి తాటక యనిసేయ
గదిసె నాలసించఁగా నదేల ? 109

కం. స్త్రీయని దాని తిరస్కృతి
జేయంగాఁ దగదు నడఁగఁజేసిన ధరణీ
నాయక ! సకలజనాళికి
రాయిడి గనకే హరించరాదే యనినన్. 110

చం. హరిహయహస్తకీలిత దృఢాశనిదారిత శైలశృంగ సం
సరణి, తదాజి దాశరథి చండశరాసన శస్త్రధారచే
ధరచలియించ నేసెఁ దెగఁ దాటక జాలకృతైక నాటకన్
హరిదిన దత్తహాటక నిరంతరఖేటక నిస్సహాటకన్. 111

వ. ఇట్లు తాటక త్రెళ్లిన 112

1. నెలసరుల (వ్రా)

కం. రణసన్నద్ధత క్రియచే
గణియించక గదియఁ దాటకాతనయ ఖలా
గ్రణి యనిల సాయకాహతిఁ
దృణలీలం గడలిసేసెఁ దేలి చనంగన్. 113

సీ. అతనిదాయి యెదిర్చిన నస్త్రకలన
జెక్కలైనేల ద్రెళ్ళంగఁ జేయఁ గాంచి
కాకఁ గదిసిన రాక్షసఘటలనెల్ల
నర్కనందన నగరికి ననిచె నంత. 114

కం. ఇక్కరణి కార్యసిద్ధిగ
నక్కఱ గాధేయజటి నయక్రియ నతనిన్
జక్కఁగఁ గౌఁగిటఁ జేర్చెన్
జక్కఁగఁ ద్రిదశగణ గణన సంధిల్లంగన్. 115

వ. ఇట్లు రణ్యాని నిష్కంటకాకృతిగాఁ జేసి తన యజ్ఞదీక్షఁ గడతేర్చినదానికి గాధిజర్షి సంతసిల్లి దాశరథి కైంద్రాగ్నేయాది సకల శస్త్రాస్త్ర జ్ఞాన సిద్ధిగా నానతిచ్చి తగిననాళ్ళక్కడ నధిష్ఠించి రయ్యెడ. 116

## ఆశ్వాసాంతము

కం. అతుల ప్రతాప తపన
ప్రతిభా ! ధావద్విపక్షబల ! కౌశిక సం
శ్రిత వలయ ! వసుమతీ ధర !
సతతకృపాభ్యంతరాశ సాంద్రధ్వాంతా. 117

మ. అతులాంభోనిధిధామ ! ధామజిత కోట్యాదిత్య ! దిత్యంగనా
పతి హృద్వారిజ వాస! వాసవనుత ప్రాబల్య ! బల్యాగ్రహా
[1]ప్రతతిచ్ఛేదనసత్త్వ ! సత్త్వయుత శోభాకాంత ! కాంతామణీ
రతిరాజ ప్రతిమాన ! మాననయధైర్య స్థైర్య శౌర్యోన్నతా. 118

1. ప్రతిత (ము)

తరల. కరధృతగోత్రా - క్రమచరిత్రా
పరమపవిత్రా - పంకజనేత్రా
గరధరమిత్రా - ఘనశుభగాత్రా
ధరణికళత్రా - దాసజనత్రా. 119

— గద్య —

ఇది శ్రీమత్కర్పూరాచల లక్ష్మీనృసింహ వేంకటేశ్వర వరప్రసాదలబ్ధ సకలై
శ్వర్య ధురీణ శారదాప్రశ్నవివరణ శతఘంటావధాన వినయధునీ
తరంగ విజృంభణాజృంభిత సలలిత మృదుమధుర వాగ్వైఖరీ
ఝురీధురీణ-స్థాపితాశేషవిశేషప్రసిద్ధ సాహిత్య [1]సారస్వతాశు
కవితాష్టభాషావిశేష సంస్కృతాంధ్ర నిరోష్ఠ్యోష్ఠ్యాది వింశతి
ప్రబంధనిర్మాణ ధురీణ మౌద్గల్య [2]మహర్షి గోత్రపవిత్ర
తిరుమలదేశికేంద్ర పౌత్ర తిరువేంగళాచార్య పుత్ర
మఱింగంటి సింగరాచార్య కవిరాజప్రణీతంబయిన
దశరథరాజనందన చరిత్రయను నిరోష్ఠ్య
మహా ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

1. సారశ్శృత (ము) 2. మహాఋషి (ము)



# దశరథరాజనందన చరిత్ర

## ద్వితీయాశ్వాసము

కం. శ్రీలలనా పీన స్తన
పాళిజఘునభర[1]చికుర బంధాగ్రసదా
[2]లోలకర నఖర శిఖర ద
యాలక్షణ సీమ కర్పూరాద్రి నృసింహా. 1

వ. ఆతఁడు గథాసరణి యెట్లంటేని. 2

చం. జనకధరాధినేత సరసస్థితి యజ్ఞకరేచ్ఛఁ దా ధరా
జనతతి రా దిశల్ గలయఁజాటఁగఁ జేసిన [3]నాలకించి కాం
చన రథగంధనాగహయ సైనిక [4]సంతతిచే హళాహళిన్
దన నగరాంతరస్థలి హితక్రియ నిండఁగ సాగి రయ్యెడన్. 3

ఉ. ఈ గతి యజ్ఞదీక్షఁ గన నెల్ల ధరాతల [5]నేతలేగరా
నాగతి గాధిజాత జటిలాగ్రణి యారసి, రాక్షసారికిన్
శ్రీగల యట్టి యర్థ జయసిద్ధి గదాయని నిశ్చయించి తా
రాగ రసస్థితిన్ గదతె రాచనెలల్ తని చెంత నంటఁగన్. 4

వ. [6]ఇట్లు నానాటికి యాత్రాసరణి గాధేయజటిం గాంచి దాశరథి
యిట్లనియె. 5

కం. ఇదియే జటిరాజస్థలి
యది గంగాతటిని [7]దాని యాగతియంతా
చెదరఁగ దెలియఁగ జేయఁగ
గదె యన రాక్షసారిఁ గని నయ సరణిన్. 6

---

1. చికుల (ము) 2. లాల (ము) 3. నాలకించు (ము) 4. సంగతి (శి)
5. నేతలేగగా (శి) 6. అట్లనానాటికి (శి) 7. దీని (శి).

ి యిట్లనియె 7

న ది దీనిక్రియన్
శేషాహికైన శతధృతికైనన్
జహారికి నైనన్
ద గాదే గణించ నాశ్చర్యగతిన్. 8

గంగా[1]జనన సరణి యెట్లంటేని 9

యు సహస్ర హస్తఖచరాహితతాత[2] కృతార్థిఁగన్న యా
ధరాధి నేత యతి దీనత నారసి తల్లిగాన నా
సహించలేక జలజాసన నందన శాసనక్రియన్
క కానకేఁగి హరిచింతన జేయఁగ సాగె నిష్ఠచేన్. 10

ఁచిన నగ్రధాత్రి నుచితక్రియ నిల్చిన శేషశాయి నా
దశాయతాక్షిఁ గని సాగిలి[3]తా నతిఁ జేసి లేచి[4]కే
తటిన్ ఘటించి యతి హర్షరసస్థితిచే ననేకచ
గణియించి యాడెఁ దనయండ జటిచ్చటలెల్ల నారయన్. 11

యెడ హరి యిట్లనియె. 12

కాంగీ దశశతహ
ాచరనేత తండ్రి సాహసగతి నీ
రాగ్రణి[5]గలచఁగ నిటు
తెలంగయ్యె నింత జడియఁగ నేలా. 13

లలితు నీతగాని జయశక్తి జయించఁగ రానిదానిచే
త చలించి నేటికెద నీ జఠరస్థలి నేజనించెదన్
ఖచరారి నేత సిరి గాఢతర క్రియ సంగ్రహించి ది
నరకర్త లెన్నఁగ హితస్థితిచే నచలారి కిచ్చెదన్. 14

---

. జలసరణి (శ) 2. కృతార్థి (శ) 3. యానతి (శ) 4. కేల
ను (శ) 12వ నెం. వచనము శ. లో లేదు. 5. గలచెంగట (శ) 6. సల
తిగాని (శ) 7. ఖరఖచరారి (శ.గ)

కం. అని యనిచిన నచలాహిత
జననియు నిజకార్య [1]సరణి జటి కది యెఱింగిం
చిన సంతసిల్లి సతిఁ గల
సినయెడ నానాఁటఁ జీర చిక్కెం దెలియన్. 15

మ. దినచర్య న్నెలలెల్ల నిండిన ధరిత్రీజాని యంశస్థితిన్
గవియెన్ నందననేత నాజటిల రాట్కంజాతి యాదిత్యకీ
ర్తన లర్థిం దనరంగ నచ్చరల నృత్యక్రీడ లెచ్చంగఁ గాం
చన నిస్సాణ ధణంధణల్ చెలఁగ నాశల్ తేజరిల్లం దగన్. 16

కం. ఈలీల నిఖల [2]లక్షణ
శాలిహరి యతీంద్రసతికి జనియించి జయ
శ్రీలెసఁగ నాటినాటికిఁ
జాలా యీడేరసాగెఁ జక్కఁగ నంతన్. 17

చం. దశశతహస్తదైత్యకరి తంత్రి యహంక్రియ సంధిలంగ న
ర్దిశల నృనేతలన్ గెలిచి తెచ్చిన కాంచనశక్తి నిష్ఠదా
నిశిత గతిన్ రచించ ధరణీ ఖగ సంహతిరాగ హర్షక్ర
ద్ద శనచలారి దాయి సహితస్థితి చే జనియెన్ కశారతిన్. 18

వ. ఇట్లు చని సకల దిగంతాయాత హితజనాగ్రజసంతతి తేజరిల్ల సహస్ర హస్తలేఖారాతి తంత్రి యజ్ఞశాలం జేరి యందఱల సందడి నిలిచె నంత.

కం. తారాంతస్థ్సలి లేనెల
దారిన్ లాక్షణ్యకళల దనరారిన శై
లారాతి దాయిఁగని ఖచ
రారి కదియనేగి నిలిచి యానందగతిన్. 20

ఆ.వె. అతని రాజధాని నాఖ్యఁ దల్లిని తంత్రి
నడిగి కాంచనాసనాగ్ర్య ధాత్రి
[3]నర్థి తోడఁజేర్చి యఖిలార్చనల చేత
సంతసిలఁగ జేసి చక్కనిలిచి. 21

---

1. ధరణి (శి.గ) 2. రక్షణ (ము) 3. ఆర్థి చేర్చి (శి.గ.)

చం. అనఘచరిత్ర ! నిన్గని జయక్రియఁ జెందితి గానదాచకే
కనక కిరీట హారకరకంకణ చిత్రక రత్నచేల చం
దన నటచేటికా రజిత దంతి శతాంగ హయాదికాంతు లె
ల్ల నడిగి నంతనే తనయ లాలన నిచ్చెదఁ గీర్తి హెచ్చెరన్. 22

వ. అనిన సంతసిల్లి 23

కం. అన్నరఖాదాగ్రణి గని
చిన్నన్ నాకిట్టి కాంక్షసేయఁగ నేలా
నిన్నడిగిన నీరాదే
తిన్నఁగ జరణ త్రయతతిన్ హర్షగతిన్. 24

వ. [1]అని యడిగి. 25

ఉ. ఎన్న నిశాటకర్త ధృతి నిచ్చితి నీ హృదయాచ్ఛకాంక్ష నేఁ
డన్న ధరాంతరిక్ష [2]నిఖిలాశ నిశాచరశైలరాణ్ణదీ
కన్నిధికానన త్రిదశ [3]కంధిజ నీడజ కీల తారలం
దన్నిట దానయై నళినజాండఘటస్థలి నిండె నయ్యెడన్. 26

ఆ.వె. జగతినిండ యంఘ్రి సత్యజగత్ స్థలి
[4]కంటజూచినంత హర్షగతిని
యరసి చక్రయంఘ్రియని ధాత యేతెంచి
కదిసి దాని కెఱఁగి గణనఁజేసి. 27

మ. కరకాంతర్గత నీరధారల దృఢాకాంక్షన్ జగత్కర్త శ్రీ
చరణాగ్రస్థలిఁ గేలనంటి కడుఁగన్ జాలైధరన్ జారఁగా
శరజాస్త్రారి [5]రయక్రియం జని శిరస్థానినిన్ ధరించె న్నదా
హరిదీశ త్రిదశాహియక్ష ఖగసాధ్యశ్రేణి కీర్తించఁగన్. 28

తే. అంధకారాతి దాల్చిన యట్టిగంగ
యర్క సంతాన నరనాథ యత్నసరణి

---

1. అనిన యాలించి (శి) 2. హరిదక్క (శి.గ) 3. కంధరనీరజ
4. యంఘ్రినతని నెత్తి నంఘ్రినిడిన (శి. గ) 5. దయం జనించి (శి. గ)

ధరణిజారిన యదిగాన దశరథేశ
నందనాగ్రణి ! లెస్స గానంగరాదె. 29

కం. ఆ గంగాప్రహిదిని తా
సాగర సంగతి 1నొనర్చె జనసంచయ చం
డాగస్త్విశ్రుతి నడగించఁగ
శ్రీగతి సద్గతి ఘటిల్లఁజేయఁగ ధరణిన్. 30

కం. అని గాధిజాతజటి చ
క్కన గంగాతటిని జననగతి దెలియఁగ జే
సిన నాలకించి దశరథ
తనయాగ్రణి సంతసిల్లి దారిఁ జనంగన్. 31

చం. ఇలహారధాత్రలైన గణియించఁగరాని నిశాచరారి స
జ్జలజ ఘటాండజాత సృణిసారస చక్రదృఢాంఘ్రిఁ దాకినన్
శిల నళినాయతాక్షియయి 2చిత్రకథాతిశయాచ్ఛలీలలన్
నిలిచెఁ దదగ్రధాత్రి జటినేత లటం గని సంశయించగన్. 32

సీ. అచలారి నిరసించినట్టి రాక్షసనేత
నచలక్రిందికి దన్నినట్టి యంఘ్రి
సత్యజగత్స్థలి చక్కకై సాచిన
నలశతధృతి కడ్గినట్టి యంఘ్రి
సకల ఋషిశ్రేణి సంతతాసక్తి చే
సరసి హృత్స్థలి దాల్చినట్టి యంఘ్రి
కలశనీరధి కన్యకా స్తనఘట్టన
నతిశయిల్లఁగ జేసినట్టి యంఘ్రి
3యనఁగ సనకసనందనాద్యఖిల ఖచర
యతితతికినైన గనరాని యట్టియంఘ్రి

1. దనర్చె 2. చిత్రకళాతి (శి) 33 వ పద్యములో 2, 3 చరణములు (శి.లో)చక్కగా నింగికిఁజాచి నాధతచేత నారాధనల్ గాంచినట్టి యంఘ్రి; ...ఘనఘనాశ్రేణి చెండాడగా గంగనక్కఅచేగన్నయట్టి యంఘ్రి.3.అనఘ(శి)

తాకినంత [1]ధరాధినేతలు గణించ
శిల నళిననేత్రయై నిల్చె జిత్రకళల. 33

చం. నిలిచిన యా యహల్య, ధరణీతనయేశితకాళ్ళచెంత సా
గిలి, నతిఁజేసి, లేచి తనకేల్ నిటలస్థలినంటఁ జేర్చఁగా
దెలియక గాధిజాతజటి దిక్కటుగాంచినఁ జేరనేగి తా
గలిగిన గాధ దృష్టగతిగా నెఱిఁగించఁగసాగ నయ్యెడన్. 34

కం. ఇక్కాననాంతరస్థలి
జక్కన నరికాలికంటిజడదారికి దీ
రెక్కిన గేహిని యయి ధర
నక్కఱ గననయ్యె దా నహల్యాఖ్య తగన్. 35

ఉ. చక్కఁదనాల కెంకి, నెరజాణ నహల్యఁ గళానయక్రియన్
జిక్కఁగ నందఱల్ గణనసేయ నెఱింగి ధరాధరారి తా
నక్కఱదేర నంగజ కరాగ్ర లతాంత శరాగ్రకీలలన్
జిక్కి తదాశ్రయస్థలికిఁ జేరఁగ నేగి రహస్య చర్యచేన్. 36

ఆ.వె. అత్రుచరణజటి[2]గ, నాకృతిఁ దాల్చి య
హల్యఁ గదియ జనిన నానగారి
చిహ్న లరసి సంతసిల్లి యంగీకార
సరణి దిరిగి సదన జగతి నిలిచె. 37

వ. అంత.

చం. తనలతికాగృహస్థలి హితస్థితి నిల్చిన నీరజాననన్
గని యచలాచలారి నెఱకాకలఁ దాళఁగలేక చేరఁగాఁ
జని జిగిఁ గౌఁగిలించి, రతిసారతర క్రియదాల్చె స్రక్చర
స్తనజలధార లేర్లగతి జారఁగ హర్షితచేత దేలఁగాన్. 39

వ. ఇట్లహల్యా నంగజకేళి సంతసిల్ల జేసి చన నంత. 40

1. నిశాధి (శి) 2. ఘనాకృతి (ము)

కం. దారిన నేతెంచిన శై
లారిం గని యతుచరణయతి దృగ్జాతాం
గారకతతిరాలఁ దృతా
కారక్రియఁ దెరల జలదగర్జల చేతన్. 41

ఉ. ఏ నిఁటలేనిచెంగట నహీనతరక్రియచేత నేఁగి నా
చాన నహల్య జేరి యతిసాహసశక్తి ననంగకేళికన్
గాన నడంచినట్టి కతనం గడ నీ కిక లింగహానియై
గ్లానియు నింక రాదె యన గ్రచ్చుఱ జారె దిశల్ చలించగన్. 42

వ. అంత నతుచరణజటి యతనిం గాంచి. 43

చం. అలజడి చెందనేలఁ ద్రిదశాలయనాయక ! నా హృదంతర
స్థలి దయ సంఘటిల్లె దినచర్యల నీకిక గార్యసిద్ధి కాఁ
గలదని యాడి దాటి చని గ్రచ్చుఱఁ జెంగట నిల్చినట్టి యా
జలజదళాయతాక్షిఁ గని చండతరాగ్రహదృష్టి దేరఁగన్. 44

కం. చానా ! హృత్స్థలిఁ దలఁచగ
రాని నడక నడిచితే యరాళగతి నర
ణ్యానన్ కఠినశిలాకృతి
చే నిలకడ సేయరాదె శీఘ్రత ననినన్. 45

కం. తన చెంగట జడదారిం
గని యార్తిం జడిసి యతనికాళ్ళ కెఱఁగ న
ల్లన హృదయస్థలి జనియిం
చిన దయచే నా యహల్య జేరిక నాడెన్. 46

చం. నళినదళాయతాక్షి i యెద నాటిన చండతరార్తి రేచఁగా
గలఁగగనేల దాశరథి కార్య హితస్థితి నిట్టిదారి రాఁ
గలఁ డదిగాన దచ్చరణ ఘర్షణలీల ఘటిల్లి నాటి తీ
రలరఁగ దాల్చె నన్నెరసి యర్థిఁ జరించఁగరాదె లెస్సగన్. 47

వ. అనినంత. 48

ఆ.వె. అట్టి జటిలనేత తట్టినయంతనే
యంగలతిక సడలి యార్తిచేతఁ
నెలఁత చిత్రగతిని శిలయయ్యె నై చండ
గహనధాత్రి నిలిచెఁ గదలలేక. 49

కం. అనఘు యది గనుక నీచ
క్కని చరణహతిన్, దిగీశగణనల్ నిండన్
దనయాద్యాకార స్థితి
సనయక్రియదాల్చి నిల్చె సారస్యగతిన్. 50

చం. అనిన యదాట తజ్జటి, యహల్య నిజాకృతిచేత దాదన
ర్చిన యది యాలకించఁ జని శ్రీనిధి దాశరథిన్ గణించి చ
క్కని తన గేహినిన్ గలిసి, కడ్డడగంగఁ జరించెఁ[1] గానలం
దెనసి యతీంద్రరాజి యెదనెన్నఁగ హర్షతఁదేర నయ్యెడన్. 51

కం. అంతంతటఁ దక్కిన జటి
కాంత స్థలచర్య లెల్లఁగని కనియెద న
త్యంతానందస్థితిఁ జనఁ
జెంతన్ సకలజన ఘటల చేఅంతయ్యెన్. 52

చం. జనకధరాధినేత సరస స్థితి యజ్ఞకరేచ్ఛగాంతు రా
నన చఁగ నేగినట్టి హరిదంతరసాతల నాథరాజి కాం
చన రథ గంధనాగ హయసైన్య హాళాహళికాజయ క్రియన్
గని కని గాధిజాతజటికర్త నిరంతరహర్షశాలియై. 53

కం. తన జ్ఞాన దృష్టిచే చ
క్కని రాకుసహంత కధిక కల్యాణ శ్రీ
లెనయఁగఁ గలదని దృఢగతి
జనియెన్ సకల జనఘటల సందళ్లదరన్. 54

చం. చని యగ్రస్థలిఁ గాంచె నంత జనకజ్యాకర్త రాడ్ధాని దాఁ
గనకాలంకృత చిత్రరాజి సదనాగ్రస్థాన సంధాన కే

1. (కానలం దెనయు యతీంద్రరాజి యెదనెన్నఁగ హర్షముతోడ నయ్యెడన్)

తన చేలాంచల నిర్గతానల శిఖాత్యంతా హతాకాశ ర
త్న నిశానాయక నాకదేశతటినీ ధారాధరారిన్ దగన్. 55

వ. ఇట్లు జనకరాజధాని జేరనరిఁగి యా చక్రధరణీధరాంతర సకలదేశ నర నాథచ్ఛటల్, హరిశిఖి కృతాంతనైర్ఋత జలధీశాఽనిల చంద్రికానేతల్, సిద్ధసాధ్యనాగ చారణ యక్షకిన్నర కర్తల్, గంధగజకంఖాణ శితాంగ సైనిక సన్నాహచర్యలు నిండ శంఖకాహళఝల్లరీ తాళానీక నిస్సాణ ఘంటానాదలీలల్, దశదిశలఁ జెలంగ ప్రక్చందన శాటికాచిరత్న రత్నా లంకారక్రియలు రంజిల్లం దాల్చి సింహాసనస్థిరల నధిష్ఠించి రయ్యెడ 56

కం. తనచెంత రానెలల్ సిరి
దనరఁగ నా గాధిరాజతనయాగ్రణి చ
క్కని నెఱసిరి గద్దెలకడ
నెనసి యధిష్ఠించె నంద ఱెన్నగ నంతన్. 57

చం. కలితనయాతిశాలి, జనకక్షితినాయక మౌళి చక్కఁగా
లలితహిరణ్యశాటిక లలంక్రియ లంచితగంధసేచనల్
గలిఁగి దిగంతరాజతతి గాంచి గణించఁగ లెక్కలేని చా
యల నలరార గద్దెకడ నక్కఱ సంధిల నిల్చెనయ్యెడన్. 58

కం. తనయంకస్థలి సీతాం
గన దిశలన్ నిండినట్టి కళల నధిష్ఠిం
చిన సకలధరణి నేతల్
గనిరి జగజ్జనని చాళికన్ దనరారన్. 59

తే. అచట నీరీతి జనకధరాధినేత
సకల సన్నాహ చర్యల సంతసిల్లి
నిజగృహాంతర సంస్థితనీలకంఠ
ఘనశరాసనయష్టిఁ దే ననిచె నంత. 60

చం. [1]కనక నగాకృతి న్నిగిడి, కానగనైన గిరీశసాయకా
సనదృఢయష్టిఁ జేరి, యతిసాహసశక్తి నిశాచరచ్ఛటల్

1. కనఁగ నకాకృతి (ము)

గని తలలన్ ధరించి, జనకక్షితిరక్షిత యగ్రధాత్రికిన్
జని చని చక్కడించిరి, దిశల్ చలియించఁగ నట్టిచెంగటన్. 61

ఆ.వె. జనక ధరణినేత సకలరాజచ్ఛట
నరసి హరశరాసయష్టిఁ దీని
జేరి యేరలైనఁ నారియెక్కిడిరేనిఁ
గన్నె నీయఁగల నటన్న దెలిసి. 62

సీ. చేరనేటికిఁ దీనిఁ జేగాని చెంగట
గలగంగఁ గలదని నిలిచి నిలిచి
యక్కించి జట్ల నాయధిక సాహసశక్తి
దరలఁ జేయఁగలేక తగ్గి తగ్గి
ఘనతరహస్త శాఖల నాడఁగ ధరించి
గాసియై కదలంగఁ జేసి చేసి
జంకించి గద్దించి సాఁచి యాజేనెల
కెడగాఁగ నింతింత నెత్తి యెత్తి

చక్రశైలాంతర స్థల సకలదేశ
రాజహారిదీశ చారణరాజి చాల
చెదటి లజ్జించి కృశియించి చింత గనలి
కదియలేరయ్యెఁ గడలేనికాక నంత. 63

కం. తారల సందడి నెల
దారిన్ రాజాంతరస్థ దాశరథి జయ
శ్రీ రంజిలఁగా జటి యా
జ్ఞారతిచే సకలదేశ జనతతి గనఁగన్. 64

ఆ.వె. లేచి కదియనేఁగి లేఖాద్రి చందాన
నలరినట్టి హరి శరాసయష్టి
నంఘ్రినఖర రేఖ నాని తృణాకృతి
నెగురఁజేసి లెస్స నంత యాచి. 65

ఉ. కేల ధరించి దాశరథి క్రీడ గిరీశశరాసయష్టి యా
శాలలనాది లేఖ ఖగసాధ్యనిశాచరసారణాహియ
క్ష్మాళి గణించ నెక్కుడి నయక్రియ చే దిగియంగ సాగినన్
జాలఁగ గండ్రలై, ధరణి జారె జగత్త్రయి సంచలించఁగన్. 66

వ. అంత 67

సీ. అచలాదితేయానలాచ్ఛకీలల[1]గంధి
నగరాజె చిట్లిక ల్లిగ ననఁగ
హరిదంత దంతి సంహతి యాగ్రహస్థితి
జేరిక ఘీంక్రియల్ చేసె ననఁగ
నలినసంజాతాండకలశి యిట్టిట్టయి
యడలి చెల్లా [2]చెద రయ్యె ననఁగ
గగన నిర్గళిత నిర్ఘాత సంతతి చాలఁ
దెగి ధాత్రిఁ గలయంగఁ ద్రెళ్లె ననఁగ

దశరథక్షితినాథనందనకరాగ్ర
ఘటిత గిరిశ శరాసన గాఢయష్టి
దీర్ఘ శింజిని, తెగియంగఁ దిగిచినంతఁ
గఠిననాదాతిశయలీల గండ్రలయ్యె. 68

శా. నింగి న్నల్దిశ లెల్ల నిండఁ జెలఁగ న్నిస్సాణరాద్ధంధనల్
కంగారయ్యె దశాననాది ఖలరక్షశ్శ్రేణి కంఖాణసా
రంగస్యందన రాజశేఖర ఘటల్ రంజిల్లె, నాకాంగనా
సంగీతక్రియ హెచ్చె, నృత్యకళలన్ సంధిల్లె హర్షస్థితిన్. 69

ఆ.వె. దానిఁ గాంచి జనకధరణీశకేసరి
చాల హర్షజలధిఁ దేలి తేలి
సీతఁగేలసంజ్ఞ చేసిన రాక్షసా
రాతిఁజేర జనియె రహి దనర్చ. 70

1. కంది నగరాజె (వ్రా) 2. చెదర్లరయ్యె (ము)

సీ. అఖిల రత్నస్థగితాలంక్రియల కెల్ల
సిరియన గాంతి రంజిలంగ జేయఁ
గాయజసాయకాకార నేత్రాంచల
శ్రీలెంతొ చెక్కిళ్ల చెంగలించఁ
జరణ కంజన్యాస సంసర్గచే ధాత్రి
చిత్రలాక్షారసస్థితి గ్రహించ
రాజితతారహారచ్ఛటల్ కలితస్త
నాగ్ర సంసరణి నృత్యగతి గదల

తంత్రీయానతి లేచి చెంతల నెలంత
లెచ్చరించఁగఁ జేరంగ నేగి యతని
దండ [1]దగ్గరి తెలిజాజిదండఁ గేల
నెత్తి కంధరఁ దగిలించ నేసె నంత. 71

వ. ఇట్లేసిన ఝల్లరీ కాహళ నిస్సాణ ఘంటికాతాళనాదక్రియల్ దిశలం జెలంగె, దిగీశయక్షకిన్నర సాధ్యచారణ నాగాండజ గణనల్ నిండె, గంధగంధిల దంతికంఖాణ స్యందనసై నికరాజహాళాహాళిక నెరసె, సకల రాక్షసానన కళల్ తఱఁగె, నాయెడ జనకధరణీజాని దాశరథి సహాయత నిజనగరాంతరస్థలికిఁ జని యర్వాశాలల నిల్కడ జేయించె నంత. 72

తే. అందుఁ దా నిల్చి యా గాధినందనజటి
కాఁగలిగినట్టి కల్యాణకార్యసిద్ధి
కలర లేఖ ల్లిఖించి ధరాఽఽదితేయ
ఘటలచే నంచె నాయాజి కదలిరాగ. 73

వ. అయ్యెడ. 74

కం. హరిగండ ఖడ్గకాసర
కరికిరి సారంగ నికరకానన ధరణీ
ధరరాజిఁ దాటి చని చని
చిరతర సాకేత నగరిఁ జేరి కడంకన్. 75

(1. దగ్గణ)

శా. నానాదేశనరేశితల్ సకలయత్నశ్రీల గాంగేయ శా
టీ నాగేంద్ర హరీంద్రజాల నటచేటీనాటక శ్రేణి క
న్యానంగా కని దగ్గరం జెలఁగు నా యాజిన్ నిరీక్షించి ధా
త్రీనాకాలయనేత లిట్లనిరి యర్థిన్ దేనియల్ జారఁగన్. 76

సీ. ఆకాశకషణ దీర్ఘాకృతి నేతేరు
దిట్ట తాటకఁ గెల్చినట్టి సరణి
యఖిల యత్నక్రియ లలరిన జటియష్టి
నర్థి రక్షించిన యట్టి జాడ
యైంద్రాది సకల శస్త్రాస్త్ర సాధనశక్తి
నాశ్చర్యగతి గాంచినట్టి ఘనత
యంధకారాతి శరాసన దృఢయష్టి
నర్థి గండ్రించినయట్టి దారి

యజతనయరాజ హేళి కత్యంత చర్య
[1]నెఱుఁగఁజేసిన నగ్రజాధీశ ఘటల
కంచితాలంక్రియా దంతిహయ శతాంగ
చేల సంసిద్ధిఁ దనరించెఁ జాల నంత. 77

మ. సకల శ్రీనిధియైన యా దశరథజ్యాక ర్తతాఁ జక్రశం
ఖకళాజాత నరాధినాథకరి సాంగత్యక్రియన్ నిస్సహా
నక సంజాత ధణంధణల్ దిశల నిండన్ జేరఁగా నేగెన
త్యకలంకస్థితి సంధిలన్ జనకరాడ్ధానిన్ సదానందియై. 78

కం. జనక నరనేత దశరథ
జనరాణ్ణిధి రాక నెఱిఁగి సహితస్థితిఁ జ
క్కనెదిర్చి కలసి, దగిన
ట్టి నగళ్లన్ నించె సంగడీ లెన్నంగన్.

వ. అంత. 80

1. నెరుక (ము)

ఆ.వె. దాశరథికి సీతఁ దక్కిన నందన
త్రయికి సహజ ధరణి తలనరేంద్ర
కన్యలన్ గళాతిధన్యల నిచ్చె నా
జనకరాజహేళిసంతసిలఁగ. 81

వ. ఇక్కరణిఁ గల్యాణస్థితియైన చెంగట శతాంగ సారంగ కంఖాణ దాస దాసీ హాటక శాటికారత్న రత్నాలంక్రియల్ [1]సనయగతిఁ దనయనిచ్చి, తనయల ననిచినఁ దశరథనేత నందనసహాయత సాకేతరాజధానికిం దిరిగి చనియెడునెడ 82

సీ. సేనానిగల శిఖాశినేతసన్నిధి
నఖిల శాస్త్రక్రియ లర్థి నేర్చె
దిననాథసంతతి [2]జననాథసంతతి
హరికి సాధన ధారగలయనరికె
నార్తసజ్జనరక్షకై ఖలశిక్షకై
కంధికన్యాజాని కళ జనించె
చక్రాచలాంతస్థజగతి నగ్రజరాజి
కరసి నిరాతంక సరణి నిచ్చె

తే. జనక శాసనధారియై జనని గాంచి
నిశ్చలాగ్రహ శక్తిచే నిగ్రహించె
నట్టి క్షత్రియ హంత దిగంతరాజ
గణనలెచ్చంగ నేతెంచె గాఢచర్య. 83

కం. [3]అనతాగ్రహకీలిశిఖా
కనదాకృతిఁ గదలినట్టి క్షత్రియహంతన్
గని సకలరాజసంతతి
జనితార్తిం గదిలె నర్థిశల్ నిండంగన్. 84

చం. అలజడిచేత నర్థిశల [4]కందరదాటుగ జారినంతనే
తలకని దండి నాదశరథక్షితి [5]రక్షితృ హేళి కన్న రా

1. సనయు(ము) 2. శి.గలో లేదు 3. అనలాగ్రహా (శి) 4. కందర లాటగ (ము) 5. నాయకహేళి (శి.గ) నాయక (శి.గ)

నెలల శరీర రక్షకయినెట్టన నగ్ర ధరిత్రిఁ జక్కఁగా
నిలిచి నరేంద్రహంత ధరణీఖచరాగ్రణి గాంచి యంతటన్. 85

కం. క్షితి సాష్టాంగక్రియ యా
నతి చేతన్ గణనచేసినన్ దానిఁ దృణా
కృతిఁ గాంచి దృగంచల ని
ర్గత శిఖికణ రాజి రాలఁగా నిట్లనియెన్. 86

కం. అకటా ! నాయేలిక యం
ధకహంత శరాసయష్టి ధైర్యస్థితి గం
డ్రిక జేసిన యతఁడేడీ
తెగతెక నాదేహయష్టి తెరలఁగ సాఁగెన్. 87

ఉ. ఆరయ కాంచనాద్రియె శరాసనయష్టిగ శేషచక్రియే
నారిగ, నంచ తేజిగల నాయఁడె సారథిగా, ధరిత్రియే
తేరయి హెచ్చ. రాక్షసతతిం దెగటార్చినయట్టి కాయజా
తారిఁ దిరస్కరించిన గయాళి యతం డిట యేడి కాంచెదన్. 88

తే. ఖచర సంతతి యంతంత గణనఁ జేయ
క్షత్రియశ్రేణి నాయడ్డకత్తి చేత
గండ్రికలు జేసినట్టి నా గాఢశక్తి
గాంచినది లేనియెడ నాలకించరాదె. 89

వ. అని క్షత్రియహంత యాడిన దానికి జడిసి దశరథనృనేత చిన్నరా నెలల
కడ్డ కట్టయై నిలిచి 90

ఉ. కానకకన్నయట్టి కసికం దితఁ డారయ, నద్రికన్యకా
జానిశరాసయష్టిఁ గని చక్క నెఱుంగక కేల నెక్కిడం
గా నది గండ్రలయ్యె జనకక్షితిరాణ్ణిధి సీత నిచ్చినన్
దానికి లేరి కాక దయదాల్చక యేటికి నయ్య యియ్యెడన్. 91

కం. శైలారి సన్నిలాస్థలి
జాలాకీర్తించ, రాజసంతతి నడఁచన్

జాలించిన యా చక్కని
శీలత నేఁ డధికనిష్ఠఁ జెల్లించఁగదే. 92

కం. ఈ నా తనయాగ్రణి క
య్యాన నెదర్చంగ నంధకారాతియె । గీ
ర్జానియె । యచలారియె । యా
హా నిండిన గాక సేయనదియే గతియే. 93

వ. అనిన తండ్రియాడిన తెఱం గాలకించనేరక కేల నాక్షత్రహంతఁ
గాంచి, జానకీజాని యాగ్రహించి 94

కం. నాతండ్రి దశరథక్షితి
నేత హితక్రియ గణించ నీతితెలియు కే
ఘూత్య జెడనాడంగా
నీతియె చెలరేగ ధరణి నిర్జరనాథా. 95

కం. ఆనెలతల దిట్టదియనఁ
గా నేరక జనకధరణి కర్త యనంగా
నేనెఱుఁగనంటి నంతనె
కానంగ శరాసయష్టి గండ్రిక లయ్యెన్. 96

కం. ఆలయెడన్ ధరణీఖచ
రాలియెడన్ నల్గనేర నలిగితినేనిన్
లీలన్ నా దృష్టికి రా
హాలాహలధారియైన నాగఁగఁ గలఁడే. 97

క. అనియాడిన దాశరథిన్
గని క్షత్రియహంత హృదయకంజస్థలి సం
జనితాగ్రహ శిఖిహ్యాత సం
హననస్థితిఁ గెరలి తెగి యనాదరసరణిన్. 98

సీ. అంచతేజీదిట్ట కంధకారాతికి
దీక్షైన యతఁడని తెలియరాదె !

యఖిల ధాత్రీస్థలి నగ్రజ నేతల
కలర నిచ్చినదారి దెలియరాదె!
లీలచే క్షత్రియాళి ననేక చర్యల
దెగటార్చిన కడంక దెలియరాదె!
సరసకాండాసన సరణికేదైన నా
దృష్టికాననిజాడ దెలియరాదె!

తెలియకేకాక నన్నిట్లు తేఁగటిల్ల
నాడి, నీరాచసిరిఁ దెగియాడనేల
కలన నిద్దఱి చక్కట కలిగినట్టి
ధృతి గదిసినంతనే తేటతెల్లగాదె. 99

మ. ఘనకైలాస ధరిత్రి శక్తిధరసాంగత్య స్థితిన్ సాయకా
సన సంజాత కలాచ్ఛటల్ కిసలయాస్త్రచ్ఛేదిచే నేరఁగా
చన గండస్థలి తల్లడిల్లఁగ సహస్రారస్థలిన్ శస్త్రచం
డననాదక్రియ నాలకించి చనినాడన్ దావి ఛాయంగనన్. 100

తే. అంధకారి శరాసనయష్టిఁ గనక,
యకట! యెక్కిడరాయన నతనినాల్క
యేకరణి నాడెగాక యెక్కిడఁగ నట్టి
కేలదెట్లాడెరా రాజకీటకేశ. 101

కం. నానిననలినట్టియ యా
హానలినాస్త్రాద్రి దని యహంక్రియ చేతన్
లేనిసడిచేసి గెలిచెద
కానీక్షత్రియ కనిష్ఠ కడచి చనియెదే! 102

కం. క్షత్రియ సంతతి నెల్లన్
ధాత్రీశాద్యఖిల ఖచరతతి గనఁగా ని
క్షత్రక్రియఁ జేసిన నా
పాత్రసితిఁ దెలియరాదె సంఘర్షణచేన్. 103

కం. ఆటది యనకే తాకన్
ఢాటక గాఢాసనాస్త్ర ధారలచేతం
గీటడగఁగఁ జేసిన నీ
సాటిగలరె సకలదిశల జనతతి దెగడన్. 104

వ. అని యగ్రజాగ్రణి యాడిన నిందాత్రయికి దాశరథి యాగ్రహించి. 105

తే. క్షత్రియ కనిష్ఠయని నన్నసారదృష్టి
నాడఁగా నీతిగతియె యహంకరించి
తెలియ ! నీచే శరాస్త్రశస్త్రికలకతన
నగ్రజక్రియ కానంగనయ్యె నిచట. 106

ఆ.వె. ధాత్రిఁ గలిగినట్టి క్షత్రియఘటల ని
శ్శేషగతి నడంగఁ జేసినాఁడ
ననఁగ నేటి కిట్టు లందఱు గానరా
నకట ! యన్నృతగాధ లాడనేల. 107

కం. అని నెదిరించిన తాటకఁ
గని శస్త్రిక నేసినాడ గాక ధరిత్రీ
జనతతి గన నీ సరణిన్
జన నిని హింసించినట్టి సాహసి నేఁ గాన్. 108

వ. అనిన క్షత్రియ హంత కనలి

కం. కనదశనిసదృశహాల సా
ధనదారిత సకలదేశ ధరణీశితృసం
హననాస్ర సలిలతటినీ
ఘనకంధి న్నాచరిత్రఁ గానఁగరాదే. 110

కం. అనఘా ! నీ తెఱఁ గే నెఱుఁ
గనిదే కరశక్తి లెస్సఁ గననయ్యెడినా
ఘన కాండాసన యష్టిన్
సనయక్రియ నెక్కిడంగఁ జాలిన యెడలన్. 111

కం. అని తన కెంగేలి శరా
సనయష్టి నరేంద్రహంత జనకక్షితిరా
ట్తనయా జానికినంది
చ్చిన దాలిచి యెక్కిడన్ సచిత్రగతిఁ గనన్. 112

తే. తిన్నఁగా గేల శింజిని దీఁడి తీఁడి
యధికటాంకార నాదక్రియలు సెలంగ
నశని కెనయైనయట్టి యల్లంటఁ ధాల్చి
నగి యనాయాసగతిచేతఁ దిగిచి తిగిచి. 113

కం. నీచే నీశస్త్రిక [1]యిం
తై చనఁగా నేర దదితిజాళి కలంగన్
నీ చరణక్షతిచేసెద
గాచిన నాకింక నిందగాదే యనినన్. 114

ఆ. వె. ఆర్తిచేత నగ్రజాగ్రణి దశరథ
తనయ ధరణిజానిఁ గని కలంగి
"చేరి తీర్థయాత్ర జేయంగ గాళ్ళిచ్చి
యనచ లెస్సగాదె" యనఘచరిత ! 115

మ. సకల జ్యాచరఖేచరాళి గణియించన్ నింగికిం జిక్కి క్రిం
దికిరా నేగఁగఁ గాండసంఘటనఁ దంతెల్ గట్టితిం గాన న
త్య కలంకారత శస్త్రిచేత నది యాహా త్రెళ్ళ నేయంగఁ గీ
ర్తికఫల్ నల్దిశలందు నిండెడి దయాదృష్టిం గటాక్షించరే. 116

కం. అన నాలకించి దశరథ
తనయాగ్రణి శస్త్రినట్టి తంతెల తెగనే
సిన, ధరణిం ద్రెళ్ళె నిశా
జననాయక గణన లెంత సందడి నిండెన్. 117

కం. తన కట్టి నట్టి తంతెల్
ఘనశితశతధార ద్రెళ్ళఁగా నేసిన న

1. కణిన్ తై చనఁగా (ము)

ల్లన నగి జానకీశితఁ
గని, కీర్తన జేసి చనియెఁ గాతరచర్యన్. 118

వ. అంత. 119

ఉ. శ్రీనిధి రాఘసారి జయసిద్ధికి నాయజనందనాది ధా
త్రీనరనేత లంచితగతిన్ గణియించఁగ, నింగి నాదితే
యానకదంధనల్ చెరఁగ, నక్కఱ దా నిజరాజధానిఁ దే
రానఁగఁ జేరి నిల్చి యఖిలాగ్రజసంతతి సంతసిల్లఁగాన్. 120

వ. అయ్యెడ. 121

సీ. సరసాలినీ జాత ఝుంకార సంకాశ
సంగీత సాహిత్య సరణిచేత
గంధినాగ రథ కంఖాణ రాజశ్రేణి
గనమైన సాదీల గణన చేతఁ
జలజాకర తటాక సంతాన కాంతార
కేళికా సంచార కేళిచేత
లాలిత నాటకాలంకార శాస్త్రార్థ
నిఖిల సారజ్ఞాన నియతి చేత

నన్నిటను హెచ్చయిన రాఘసారి గాంచి
చేయఁదలఁచె సింహాసన స్థాయిగాఁగ
నజతనయ జటిలాగ్రణి యాజ్ఞచేత
దశరథ క్షితి నాయక దంతి యలరి. 122

వ. అంత. 123

మ. జయలగ్నస్థితి రాఘసారి కధిక ప్రస్పందనాలంక్రియా
చయసంశోభితగాత్రయష్టిగ రచించెన్, దేశికాజ్ఞ న్నయ
క్రియ సింహాసనధాత్రికిం గదియ నర్థిన్ దాసిచే నేగి కే
కయ కన్యాసతి యాజిఁ గాంచి యనియెన్ గాఢాగ్రహాక్లిన్నయై. 124

తే. అనఘ సంగరధాత్రి సేనాజిఁ జేసి
నట్టి జయకార్యసిద్ధికి నతిశయిల్లి
కాంత లిచ్చెదనంటి యాకాంత లిట్టి
దాకఁ దయసేయఁగదె కల్లలేక లెస్స. 125

కం. ధీనిధి నా తనయాగ్రణి
చే నేకచ్ఛత్ర లీల క్షితి నేలించం
గా నిష్ఠ దలఁచితిని నె
య్యానం గాదేనిఁ గల్లలాడితి ననరే! 126

తే. రెట్టి యేడేండ్ల దను కనీ దిట్టరాక్ష
సారిఁ గానల కనిచిన యదియ నీతి
యన్ని నాళ్లైనఁ దిరిగి ధరణి
జక్కగా నేలరాదె యే శంకలేక. 127

చం. అని తన తండ్రిగాంచి తెగనాడిన కైక తెఱం గెఱింగి స
జ్జననిధియైన దాశరధి సాగక నిల్చి హితక్షితీశితల్
గని గణియించి దాన సరగన్ గడతేర్చఁగ దీక్ష దాల్చి చ
క్కనఁ దిరిగెన్ గృహస్థలికి గాఁగల చర్య దలంచి యయ్యెడన్. 128

తే. తన యలంక్రియ లన్నిటిఁ దాచి నార
చీర లంగీకరించి యా సీతఁ గలసి
దాయి చెంగటరాఁ రాజధానిఁ దరలె
దాశరథి యందఱన్ గని తలఁక నంత. 129

చ. అనఁ చఁగలేక చిత్తజనితాయతచింత జలించినట్టి యా
జననికి దండ్రికెల్ల హితసంతతి నారసి యర్హకృత్య న
ర్తన నలరించి కాంచన రథస్థలి నెక్కి సతీసహాయతన్
జనియె నిశాచరారి సరసస్థితి సంధిల దాయి యంటిరాన్. 130

కం. ఈ రీతిని గంగానది
చేరి రథధరిత్రి డిగ్గి శీఘ్రక్రియచే

సారథి నిజనగరస్థలి
కారయఁ దిరుగంగ ననిచె నాయెడ నంతన్. 131

ఉ. శ్రీ నిధియైన దాశరథి చేరఁగ నేగిన, గందరాఖ్యచే
గానఁగనైన దాసజనకర్త దృఢార్చన లాచరించి గం
గానది దాటఁజేసి హితకాండ సహాయత సాగనిచ్చినన్
దానికి సంతసిల్లె దన దాసజనాగ్రణి గాగ రాజిలెన్. 132

చం. చని చని కాంచె చెంగట నిశాచరహంత, సతీసహాయతన్
ఘనతర కేతకీకదళికా హరిచందన కందరాళ కాం
చనఘనసారతాళగణ సంచిత కాననధాత్రి నండజా
ఖ్య నతిశయిల్లినట్టి జటి నంచితశిష్యజనచ్ఛటాతతిన్. 133

ఉ. ఆయతిచేత నంత నిఖిలార్చన చర్చ లెసంగఁగా, ధరా
నాయక హేళి, తాఁ[ద]గిననాళ్లు చటన్ లతికా[1]గృహచ్ఛటా
చ్ఛాయల సంచరించి; క్షితిజాసహితస్థితి దాయి రాగ న[2]
త్యాయత చిత్రశృంగగిరి దారి దగం జనసాగె నయ్యెడన్. 134

శా. నానా దేశగ నఖండఖడ్గహరిణీనాగాండ[3]జాహోద్యర
ణ్యానిం గాంచి యగాధ నీరధర నద్యాళిన్ దగం దాటి తా
నానారత్నతటాక హాటకదరీ నాకాంగనాదిత్యసం
తానాచ్ఛాదిత చిత్ర శృంగగిరి చెంతం జేరి రా జయ్యెడన్. 135

తే. అక్కడి యతీంద్రసంతతి యర్థి నాద
రించఁగా దళశాలలన్ రచించఁ దాట
కేయదైత్యారి నిలిచె నాక్షితిజ గలసి
సరసగాథల హర్షాతిశయత నంత. 136

కం. డాక జయంత ఖరాగ్రణి
కాకాకృతిఁ దాల్చి చరణకరనఖతతి, ధా
త్రీకన్యయంగలత, న
త్యాకాంతును జేరి నింగి కల్లన నెగసెన్. 137

1. గృహచ్ఛలన్, ఛాయల(ము) 2. నధ్యాయత(ము) 3. జాహోదర.

చం. చెనకి రయక్రియన్ చెగసి చెంగట నిల్చినయట్టి హంతఁ దాఁ
గిన నలినేసె, నేయ నది గ్రచ్చఱ నీఱుఱు, నాయడంచ జా
లని కతనన్ సడిం దిరిగిరా నల రానెల యంఘ్రి సాగిసన్
గనియక కాఁచెగా యతనికిన్ సరిగాఁ గలరే జగత్త్రయిన్. 138

శా. సీతాసంగతి రాతుసారి హరిణీ సింహాహి సారంగ సం
ఘాతాచ్ఛాదిత కాననక్షితికి నేగన్ దాశ కత్యంత చిం
తాతీక్ష్ణాగ్నిఁ గరంగి యూజి ధరణీధాతృచ్ఛటల్ గంధ సం
ఖ్యాతీతత్రిదశస్థలిన్ నిలిచె నాహాకారతల్ తేలఁగాన్. 139

వ. ఇక్కరణి * (గానియాదికేకయ రాజనందన కాంతు నేగిన) జక్రాంశ
సంజాతరనరనేత రాజ్యాధికారిం జేయం దలంచి, కైక రా ననిచినఁ దిరిగి
సాకేతనగరి కరిగి యయ్యెడ. 140

చం. తన జనయిత్రి యాజ్ఞ దలఁ దాల్చి ధరాతనయాధినేత కా
ననధర కేగి నంగనలినాక గృహస్థలి జేరినట్టి యా
జనయిత కట్టడల్ దెలిసి చక్రతళాజని రాజహేళి తా
నెనయఁగ నన్నఁ జేరఁ జనియెన్ జనితార్తి ఘటిల్ల నయ్యెడన్. 141

ఆ. వె. గంగ దాసకర్తకతనఁ జక్కఁగ దాటి
యండజాఖ్యఁ గన్న యతని యాజ్ఞ
సేన లఖిల దిశలఁ జేరసాగె ననేక
సేన లఖిల దిశలఁ జెలఁగె నంత. 142

కం. ఆ కలకల నాదక్రియ
నాకర్ణించి హరినాయకాంశజనిత ధా
త్రీకర్త యాగ్రహస్థితి
గై కేయాయాత సరణిఁగా దెలిసి ధృతిన్. 143

కం. తనయన్న జానకీశిత
నెనయంగా నేగి కైకయీ కాంతానం

---

* ఇక్కరణి (గాని యాదికేకయ రాజనందన కాంతు నేఁగిన) (ము)
కోగలదు. కుండలీకృత భాగము ఇతర ప్రతులలో లేదు.

దనధరణిజానని సా
దిన నత్తెఱఁ గెఱిఁగి జాల కెరలికఁ దేరన్. 144

చం. ఘనగజసంతతిం దిరిగి కాండతతిన్ నలియంగ దంచి కాం
చనరథరాజి జెక్కి దృఢసైనికకర్తలఁ గెల్చి కైక యీ
తనయ నరాళితన్ గదనధాత్రి జయించెద కీర్తి నించెదన్
దినకరతేజ నీ కడకు తెచ్చెదఁ జెచ్చెఱ నన్న హార్షియై. 145

తే. తాటకేయారి తనచెంత దాయిఁ గాంచి
కాంచి యతఁ డిష్టసరణి యేతెంచెఁ గాని
యని రచించఁగ గదిసిన యట్టి సరణి
గాదని యడంచె నందఱల్ గనఁగ నంత. 146

ఉ. సేనల వెల్లడించి యతి శీఘ్రగతిన్ జని, దాయి జానకీ
జానకిఁ జక్కఁగా ధరణి సాగిలి యాజి ధరాధినేత చిం
తానల కీలలం గరఁగి యంచితనిర్జరరాజధాని దీ
రానఁగఁ జేరినట్టి తెఱఁ గార్తి నెరుంగఁగఁ జేసె నయ్యెడన్. 147

కం. తనకండ్రి నాకనగరికి
జనిన సరణి దాయచేత జక్కఁ దెలిసి, చ
య్యన ధరణిజాని దశరథ
తనయాగ్రణి లేచి చింత తహతహఁ జేయన్. 148

కం. తనకరశాఖల దాయిన్
గని తిన్నఁగ నెగురనెత్తి ఘనశాస్త్రగతిన్
జనయిత కితరక్రియ జ
క్కనఁ జేయఁగఁ దలఁచె శీఘ్రగతి దీరంగాన్. 149

వ. ఇట్లు తలంచినయెడఁ దజ్జననీ సహాయిత శతానందనజటి చిత్రశృంగాద్రి
కేతెంచినం గలిసి, దాశరథి యర్ఘ్యక్రియం జేసి యందరలఁ దిరుగ సాకేత
నగరి కనిచె నంత. 150

తే. కైకయీనందనస్మృతనేత గాంచి, రాక్ష
సారి యత్యంత హితశక్తి నాదరించి
తిరిగి సాకేతనగరికి సకల
రాజ్య సంరక్ష సేయంగరాదె యనఘ. 151

కం. అనినట్టి దైత్యహంతం
గని దృగ్జలజాత నికరకణ సేచిన సా
హనన స్థలియై యతిదై
న్య నినాదక్రియ ఘటిల్లె నాడెం దెలియన్. 152

ఉ. ఏల శతాంగ కాండతతి? యేల యలంక్రియ? లేల రత్న శా
టీలలనా ఘనాఘనసటీనటచేటికలేల చంద్రకాం
తాలయ గంధసార సరసాన్న హితస్థితి? యట్టిజాడ నీ
[1]శ్రీలలితాంఘ్రి యర్చనయె చెల్లదె నిర్జరశాఖి యన్నిటన్. 153

కం. విన్నరఘుడియం దైనను
సన్నాః దర్శించలేక యాగంగలనే
యన్న దయఁ దాయిఁ గౌఁగిటఁ
దిన్నంగా చేర్చి యాడెఁ దెల్లడి గాఁగన్. 154

ఉ. ఎంచఁగ దండ్రి రాజనవి కిచ్చిన సత్యగరిష్ఠనిష్ఠ దె
ల్లించఁగ దీక్ష దాలిచితి లేక తిరస్క్రియ జారనాడినన్
గాంచిన యందఱల్ నగరె, కల్గిన కీర్తి యడంగదే నిదా
నించఁగ నర్కసంతతికి నిష్ఠ ఘటిల్లదె రాజనందనా. 155

ఆ.వె. ఇన్నియేండ్ల చెంత నేలనీనాట
విట్టిల్నసరణి నిట్టి [2]ఘటిక
దిరిగి ననఁగ గల సతిసహోయతచేత
నడ్డగించనేర యనఘ చరిత! 156

---

1. శ్రీలలి....తె....చాలును (ము) 2. ఘనత.

కం.అని యంత చరణరక్షుల
నవిచిన దయ నీయ నంది నతిఁజేసి ఘనా
ననకాంతి హెచ్చ నిలచిన
తనదాయిం గాంచి యాడెఁ దాఁ జిగురించన్. 157

కం.అనినట్టి దాశరథి శా
సనగతి సాకేతనగరి జాడ జనక చ
క్కన జెంత రాజధానికి
సనయక్రియ నేఁగి నిలచె జటిలాకృతిచేన్. 158

మ. తనదానస్థితి నర్థి సంతతికి నిత్యశ్రీల నందించఁగా
దన యత్యంచిత కీర్తిదాన దిశలన్ దండించి కేల్ సేయఁగా
[1]దనహస్త స్థితిచేత నిట్టి ధరయంతన్ నీతిచే నేలెఁ జ
క్కన ధాత్రీతనయాధిరాట్చరణ రక్షాలగ్నహృచ్చాలియై. 159

## ఆశ్వాసాంతము

కం.అనిమిషపతి శాసన సం
జనితావర్తక [2]ముఖాభ్రచయగళిత [3]శిలా
శనిజకణహాద్గోవ
ర్ధనగిరి ధరణ ప్రచండతర [4]నఖశిఖరా. 160

చం.యువతి వసంత, సంతత సముజ్జ్వల నీతివిధాన, దానవై
భవగుణ దక్ష, దక్షరిపుభావ సరోరుహ సంగ, సంగర
ప్రవిమల సత్వ, సత్వరిత పక్షినృపాలకకాండ, కాండస
ద్భువన నివాస, వాసవ సభోగమునిస్తుత విక్రమక్రమా. 161

కలహంస. నిరుపమ కరుణాన్విత సదపాంగా
కరయుగ సంభృత కంజరథాంగా
చరణాంభోరుహ సంభవగంగా
హరశత ధృతి హృదయాంతర సంగా. 162

*157 నెం. పద్యము (శి)లో లేదు. 1. 'తనహస్తస్థితి హేతిచేత ధరయంతా నీతిచేనేలె'(శి).ముఖాద్ర (శి). 3. శిలాజనహృజ్జనకణహృ(శి). 4. నఖ(శి)

## — గద్య —

ఇది శ్రీమత్కర్పరాచల లక్ష్మీనృసింహ వేంకటేశ్వర వరప్రసాదలబ్ధ సకలై
శ్వర్య ధురీణ శారదాప్రశ్న వివరణ శతఘంటావధాన వినయధునీ
తరంగవిజృంభణాజృంభిత సలిలమృదుమధుర వాగ్వైఖరీఝరీధురీణ
స్థాపితాశేష విశేష ప్రసిద్ధ సాహిత్య సారస్వతాశుకవితాష్ట
భాషావిశేష సంస్కృతాంధ్ర నిరోష్ఠ్యోష్ఠ్యాది వింశతి
ప్రబంధనిర్మాణధురీణ మౌద్గల్యమహర్షి గోత్ర పవిత్ర
తిరుమల దేశికేంద్ర పౌత్ర తిరువేంగళాచార్య పుత్ర
మఱింగంటి సింగరాచార్య కవిరాజప్రణీతంబయిన
దశరథరాజనందన చరిత్ర యను నిరోష్ఠ్య
మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీ

# దశరథరాజనందన చరిత్ర

## తృతీయాశ్వాసము

కం. శ్రీ తరుణీమణి కుచనత
శాత నఖత్రుటిత దితిజ జఠరాస్రజలో
ద్ధాత క్రోధ ధనంజయ
యాతత గుణయూథ ! కర్వరాద్రినృసింహా. 1

వ. ఆ తఱిఁ గథాసరణి యెట్లంటేని. 2

సీ. అట్టిచెంగట రాఘవారాతి గిరి డిగ్గి
దండకకాంతార ధరణి సరణి,
నత్రి యర్చనలచే నలర జానకి నిగ్ర
హించి తారాస్థలి కెగసి చన్న
ఖచరారి ఖండించి కాంతా సహాయత
నచలారి తిరుగంగ ననిచినట్టి
జటి సంతసిలఁ జేసి, శరణన్న యగ్రజ
కర్తలకై దైత్యఘటల నాజి

సంహరించఁగ దృఢశక్తి సందలాడి
ఘటజ దత్తాఽక్షయాస్త్ర సంకలిత శరధి
సాయకాసన ఖడ్గాతిశయతచేతఁ
జెంత దక్షిణ గంగదాఁ జేరియంత. 3

కం. [1]శరజాస్త్రశస్త్రసంఖ్యా
సరసక్షీర ధరణీశ శాఖాకలితాం
తర ధాత్రీ దళశాలల
సిరి సంధిల్లంగ డెంకిజేసిన యంతన్. 4

---

1. తరజాస్త్ర (శి).

చం.అనయదశాననాఖ్య గలయట్టి నిశాచరనేత చెల్లెలా
ఘనతర కాననస్థలికి గ్రచ్చఱ దాఁజని దీర్ఘదేహి న
త్యనత కళానిధిన్ శత సహస్రలతాంత శరాకృతిం దయా
ఖని ధృతిశాలి దాశరథిఁ గాంచి గణించఁగసాగె నయ్యెడన్. 5

కం.ఆనడ లా చక్కదనా
లా నీటా తేట లా నయక్రియ యాలా
గా నిల్కడఁ గని కని య
[1]త్యానందైకజలరాశి నల్లన దేరెన్. 6

చం. జలచరకేతనాచ్ఛకరచండ శరాసన శాతశస్త్రికా
దళిత హృదంతరాళయయి దైత్య గిరిస్తని రాక్షసారి చెం
తలఁదరలంగ లేక సహితక్రియ సంధిలఁ గాంచ సాగె దా
గలితశరీరసంజనితకాంతి యరణ్యధరిత్రి నిండఁగన్. 7

వ. ఇట్లు చేరి నిలచి. 8

కం. అనఘా నీ యాకృతి నే
గని దక్కితిఁ గనుక సరసకాండజకేళిన్
దనియించరాదె కలియక
యనిచిన నే దాశజాలనయ్య నరేంద్రా. 9

కం. ఇల నే నెఱిఁగిన కాయజ
కలిత రహస్య క్రియల్ ఖగస్త్రీ లయినన్
తెలియంగ నేర రాయెడ
గలిసిన దృష్టాంత సరణిగాదే యనఘా. 10

ఆ.వె. అనిన దానిఁ గాంచి యక్షలచర్యలఁ దేల
నాడఁ జెండిచేత నీడగలిగి
యల్లుకృథయు ధాత్రిజిల్కు నేత్రాంచల
(?) రక్తనేత్రలదరి రాయడిల్ల

---

1. త్యానందోజ్జలజరాశి నల్లన తేలెన్ (వ్రా)
7 వెం. పద్యము తరువాత 'శి' లో "ఈరితి దాశరథి గని....శ్రీరంజిల గణనజేసి చిత్రక్రియచేఁన్"– అను పద్యముగలదు. ప్రతి శిథిలము. పద్యము పూర్తిగాలేదు. 8 వెం. వచనము 'శి' లో లేదు.

ఉ. అల్లన రాక్షసారి తనయుండ ఊరించెడి దాయిరానెలల్
సల్లలితేక్షణాంచలజ సంజ్ఞ రచించిన నాతఁ డల్కచేఁ
గల్లడియైన రాత్రిచరకన్యక యంచిత కర్ణనాసికల్
చల్లని నెత్తునీరడర జక్కఁగఁ జెక్కె ఖగాళి రంజిలన్. 12

వ. ఇక్కరణిఁ గక్కసియైన రక్కసి రెక్కసకర్ణ నాసికల్ చెక్కిన రక్తజల
సిక్తాంగియై యాహాకారనాద సంచలీకృతాండజఖండయై హర్షితయత
కిన్నర సాధ్యచారణ సారణయై యనిల తిరస్కార శీఘ్రగతియై జనస్థాన
నగరికరిగి ఖరఖచరారికాళ్ల కెరఁగి యాక్రందించి లేచి జానకీ సహాయత
నేతెంచిన దాశరథి యాద్యంతక్రియన్ తెలియఁజేసిన నాగ్రహించి. 13

త. కలఁగక తనయాస్థానిన్
నిలిచిన ఖచరారి సకలనేతల నెల్లన్
కలితాగ్రహాహృత్థ్సలియై
కలయఁగ దర్శించి నీతికార్య స్థితిచేన్. 14

కం. నరఖాదనకర్తన్ నా
సరణిఁ దెలిసి తెలియలేక సాహసగతిచే
నరకీటనేత యహో
యరయక చేసెనని చాల యాగ్రహదృష్టిన్. 15

చం. ఖరఖచరారి హృజ్జనితగాఢతరాగ్రహకీల నిండఁగా
సరయగతిన్ గజేంద్రహాయసైనిక కర్తల నెంచినంతనే
ఖరకిరణాది తీక్ష్ణసితఖడ్గ ధగాధగ దీధితిచ్ఛటల్
ధరనఖిలాశలన్ నెరయ దారసిలం జని రర్థి నయ్యెడన్. 16

ఆ.వె. ఆజి కేగినంత నందఱి నన్నిచం
దాల నడఁచినట్టి లీల లరసి
యరసి చిత్రపరణి హాతశేషకలరాజి
కనలి ఖరనిశాటకర్తఁ జేరి. 17

కం. ఏరీతిఁ జనిన సేనల
నారీతి హరించి తాటకారాతిజయ

శ్రీరంజిల నని జేసెన్
జారణయక్షాహిసిద్ధసంహతి చెలఁగన్. 18

ఆ.వె. ఇట్టిసరణిచేత నెల్లరక్కసిజేండ్ల
నాజి నడఁగ జేసె నన్నఁ దెలిసి
ఖరనిశాటనేత గాఢాగ్రహక్రియ
నేనలఖిల దిశల వానఁ గదిలె. 19

సీ. కరటి దేహాక్రాంత ఘంటికా సంజాత
సతతఘణంఘణల్ సందడిల్ల
ననిలచిత్తాతీత ఘనరయకంఖాణ
హేష లష్టదిశల హెచ్చరించ
నాదిత్యనందనా హంకార హరణాది
గాధకింకర కహాకహ లెసంగ
నిర్జలాచల శృంగనీకాశ గాంగేయ
రథచక్రజర్ఝరల్ రాయడిల్లఁ

గదలె ఖరఖచరారాతికర్త శృంగ
కాహళానక నిస్సాణకంజతాళ
ఝుల్లరీజాల సంజాత చండనాద
సంచలీకృతహరిదంతజగతి గాఁగ. 20

వ. ఇట్లు చేర 21

కం. ఖరరాత్రించరనాయక
కరిసైనిక కాంచనరథకాండతతికి దా
శరథి గనఁగ దనరారెన్
గరిసైనికకాంచనరథకాండక్రియలన్. 22

వ. అంత. 23

చం. సరగున రాక్షసారి కరచండ శరాసనయష్టిశింజినీ
శరతతి నేసె నేసిన దిశానరనాయక కర్త లెన్నఁగా

గరటీశతాంగరాత్రిచరకాండనికాయత నంత తద్ధరన్
ఖరఖచరారి డ్రెళ్లె సితకంధర దత్తకళల్ తలంచగాన్. 24

వ. ఇట్లు ఖరాదిరాక్షసశ్రేణి డ్రెళ్ళిన జెల్లెలయిన రక్కసి యతిరయగతి నాకాశసరణి లంకానగరి కరిఁగి దశకంఠశేఖారికాళ్ళ కెఱఁగి యాద్యంత స్థితిఁ దెలియంజేసిన జ్ఞాతి సంతతి యడంగిన దానికి గాసిల్లి నిలచి యయ్యెడ. 25

తే. అన్న నీకయి సీతనే నర్థిదేగఁ
దేటఁగాఁ దాటకేయారి దృష్టిసంజ్ఞ
సేయ నాతనిదాయి తాఁజేరి కర్ణ
నాసికల్ చెక్కి నన్నల్క నీసడించె. 26

చం. నరఖచరాహి దేశ నరనాయక కన్యల నెల్లఁజక్కఁగా
నరసితిగాని యాలలన యంగజలేశ కళాచ్ఛకక్తికిన్
సరియనరాదెకా చరణసారస సన్నఖరేఖకైన ని
ద్ధర నెన యన్న నాల్క తెగదా ! దశకంఠ ! నిశాటశేఖరా ! 27

చం. అని తన చెల్లెలాడ హృదయస్థలిరంజిలఁ జెంతఁ దాటకా
తనయ నిశాటనేతఁగని ధారణ జేరఁగ చీటి కాంచనా
సన ధరఁజేర్చి నీతిదృఢసాహస ధైర్యకళాజయక్రియల్
తనర గణించి దాశరథి దారియెరుంగఁగజేసి యెత్తెరన్. 28

కం. జానకిఁ గలసి యనేక
శ్రీనెరయఁగఁ దాటకారి దృఢసాహస చ
ర్యానిరతి దండకార
ణ్యాని న్నిలిచె నఁట నతని నరయఁగరాదే. 29

ఉ. నీ నయశక్తి నీ నటన నీ దృఢసాహస ధైర్య చర్యలన్
గాననఁగ నింక దాశరథి గాఢగతిం గడకేఁగజేయ నె
య్యాన ధరాదితేయ కలికాకృతి దాల్చెదఁజెంత నిల్చెదన్
జానకిఁ దెచ్చెదన్ ఘనరసస్థితి హెచ్చెద గాంతు లిచ్చెదన్. 30

ఆ.వె. అనిన నతనిగాథ లాలించి యాలించి
యాగ్రహాగ్నిశిఖల నడఁచి యడఁచి

సకల నీతిశాస్త్ర సరణి నాతాటకా
జాత నిర్జరారి నేతయాడె. 31

ఉ. నెట్టన ధాతృసంతతి జనించి యనేక కళానయక్రియల్
గట్టిఁగ గాంచి సత్సరణి గల్గి జగజ్జనయిత్రి సీతనే
కట్టడిదే దలంచితిరి కట్టడిచేతలఁ దెచ్చినంతనే
తిట్టరె సిద్ధసాధ్యఖగ దిగ్ధరణీశతతెల్ల గేరికన్. 32

ఉ. తాటకఁ గీటడంచె శశిధారి శరాసనయష్టిలీల స
య్యాటనె గండ్రచేసె గహనాంతరధాత్రి ధరాధితేయ ని
ర్ఘాటకశక్తి జారిచె ఖరత్రిదశారి హరించె నిట్లనా
నాటికి హెచ్చినట్టి జననాయకహేళిఁ దలంచఁ జిన్నయే. 34

కం. తనదాయిచేత నీచ
కృని చెల్లెలి కర్ణనాసికల్ శస్త్రికచేఁ
దునియఁగ జేయించిన యా
జననాయకహేళి సాటి జగతిం గలరే. 35

చం. అలజడి నగ్రజార్యఘట లంచిత దండకకాననాంతర
స్థలి ఖరహంతఁ జేరి సరసస్థితిచే గణియించఁగా దయా
జలనిధిగాన రాత్రిచరసంతతిఁ గీటఁడగించఁ జాల ని
శ్చలగతి సంధిజేసినది సాగక రిత్తచనంగ నేర్చునే. 36

కం. ఖరశస్త్రిక నా దాయిన్
ధరణిం ద్రెళ్ళంగజేసి దయచే నన్నీ
కరణిన్ రక్షించిన యెడఁ
దిరుఁగఁగ నెద్ది గతియింకఁ దెలియదశాస్యా. 37

ఆ.వె. అనిన నాగ్రహించి యా దశాస్యనిశాట
కర్త చంద్రహాసఖడ్గధార
నతని నేసె నేయ నల్లంత నెడఁగల్గి
నిలచి ధిక్కరించి తెలియనాడె. 38

చం. హితగతినీతిచర్య గణియించిన గానఁగలేక యాగ్రహిం
చితి చెడుగంతయయ్యె కటా! చెన్నటి నీయసిద్రెళ్ల నేటి కే
నతని శరాహతిం దెగి నయక్రియ నేరికి నందరాని న
ద్గతి జరియించెదన్ ధృతి నఖండితకీర్తి ధరిత్రి నిండఁగన్. 39

చం. అని తృణలీలఁగా తెలియ నాడి తదాజ్ఞ ధరించి తాటకా
తనయనిశాచరాగ్రణి సదాగతిధిక్కరణాచ్ఛశీఘ్రు న
ర్తన ఘటియిల్లఁగాఁ గదలి దండక కానన ధాత్రి జేరఁగా
జని ఖరహంతగాంచి దృఢసాహసహర్షరసాతిశాయియై. 40

చం. తనహృదయస్థలిన్ గలఁక దాల్చఁగ నిశ్చయదృష్టిఁ దాటకా
తనయనిశాటనేత సహితస్థితి ధారుణిజాతచెంతఁ గాం
చనహరిణాకృతి న్నిలిచి సారతటిల్లతికాచ్ఛలీలలన్
దనరి చనంగసాగె గహనస్థలియెల్ల నలంకరించఁగన్. 41

కం. తనచెంగట దాశరథిన్
గని చేరఁగనేఁగి చిత్రకనకాకృతిచే
దనరారె నిట్టియల్లదె!
చని దాని గ్రహించి తెచ్చి చక్కఁగ నీరే! 42

చం. అని జలజాక్షి యాడ నతిహర్షగతిన్ ఖరరాక్షసారి చ
క్కని జఠరాస్యదృక్చరణ కర్ణశరీరనిగనిగన్నిగత్కళల్
గని కని దానిఁ జేరఁజనఁగా నది యందక యంది సాగఁగా
దన హృదయస్థలిన్ గలఁక దాల్చి నయక్రియ జ్ఞానదృష్టిచేన్. 43

కం. దానిగతి దెలిసి సీతా
జాని దృఢశరీరయష్టి సంధించి ఘన
జ్యానాదలీల లదర న
హీనతరకళాస్త్రధార ననిఁ ద్రెళ్లించెన్. 44

వ. అంత.

కం. ఆయిట్టి దిశలు నిండఁగ
హో! యహిరాడం శజ[1]స్థరాజాగ్రణి! యన నా
ధాయన్ దశరథనందన
[2]నాయిక యాలించి యార్తి నలినలిసేయన్. 46

ఉ. అన్నలినాయతాక్షి తనయందఁ జరించెడి దిట్టఁ గాంచి, నీ
యన్న ఖరారి చండగహనాండజసంతతి సంచలించఁగా
నిన్నధికార్తిచే దలఁచె నెట్టన నాతని కిట్టి జాడయే
చెన్నటి జేసినా డరయ శీఘ్రగతిం జనరయ్య! యియ్యెడన్. 47

ఆ.వె. అనఁగ దరలనట్టి యారాచనెలఁ గాంచి
యాడరాని జాడ యాడె గాన
జలజనయన హర్షసరణి రతుగఁజేసి
దైత్యహంతదారిదాయి చనఁగ. 48

వ. అంత నిట దశకంఠలేఖారి [3]చదుర యగ్రజక్రియ నేతెంచి నిజలీల
దెలియఁ జేసిన 49

చం. జనకజ యాతగాని గని జాలి ఘటిల్లఁగ నేల జారినన్
గని కని నేలగడ్డఁ గరకాండదృఢక్రియ సంగ్రహించి కాం
చనరథధాత్రి జేర్చి యతిసాహసచర్యల లంకజాడగా
జనియె నిశాటకర్త నరచారణనాగఘటల్ చలించఁగన్. 50

కం. ఈరీతి జనిన దినకర
సారథిజాతఖగనేతజాలిన దితిజా
తారాతి నడ్డగించఁగ
దారనఁగరదండశక్తి దాని హరించెన్. 51

ఆ.వె. దానిద్రెళ్ళ నడఁచి దశకంధరాదితే
యారి లంకఁ జేర నరిగి సకల
హితనిశాటనేతలెల్ల నిరీక్షించి
యర్థి గణనసేయ నలరె నంత. 52

1. జాస్థరాగ్రణి (ము) 2. నాయకి (ము) 2. జదర (ము)

కం. జనకజ నేకాంతస్థలిఁ
ధనరిన శృంగారగహనధరణిన్ దితిజాం
గన లరికట్టఁగ దోలిం
చ నితాంత స్నేహచర్య శాసించె దగన్. 53

వ. అంత నక్కడ. 54

కం. తనదాయి నగ్రధాత్రిన్
గని జనకజ డిగ్గనాడి గ్రచ్చుల నేతెం
చిన జాడ నరసి యాగ్రహ
జనితార్తిని రాక్షసారి జడయికచేతన్, 55

తే. తిరిగి నిజదళశాల కేతెంచి ధరణి
జాత నీక్షించఁగాలేని నరణి కంతే
చెదరి రాక్షసచర్యగా హృదయధాత్రి
గాంచి యత్యంతకఠినార్తిఁ గాగి కాగి. 56

కం. ధృతిచే నాకాంతార
క్షితిధరకంధరల చెట్ల చెంతల నేలా
లతి కాగృహశాలల నా
తతగతిచేఁ దిరిఁగి తిరిఁగి ధైర్యస్థితి చేన్. 57

ఉ. హా కలకంఠి ! హా కిసలయాధర ! హా యలినీలకేశ ! యా
హా కరియాన ! హా సితకరానన ! హా జలజాయతాక్షి ! యా
హా కనకాంగి ? హా కలికి ! హా కఠినస్తని ! చేరరాక న
న్నీక్రియ నేఁచ దాళఁగలనే లలనా ! కలనైన రాగదే. 58

వ. అని చింతించి

సీ. తరణికంజారాతి తారకాసరణి స
న్నధాత్రిరాజసంతతి తరించి

యహిఖడ్గకిటిదంతి హర్యక్షగంధ సా
 రంగ చండారణ్యరాజి దాటి
యగణిత రత్నాకరాతీత సాతత
 చిరతర ప్రోదినీశ్రేణి గడచి
కఠినరాత్రించరాకారకీచక [1] సార్జు
 నాగారసకలదేశాళి యరసి

చనుచు సీతాంగనాజాని చందనాగ
సంచరన్నిర్ఝరీఘన స్థగితఘన ల
తాంత గంధానిలాహతాత్యంత దేహ
యష్టిసంజనితగ్లానినైయె కడంగి. 60

చం. అలజడి రాక్షసారి చన నాసరణిన్ ధరణీధరాంగణ
 స్థలి నని ద్రెళ్ళినట్టి హరిసారథి సంతతి గ్రద్దఁ గాంచి చెం
 తలకరుగంగ కన్దెరచి ధైర్యరసస్థితిచే ననేక చ
 ర్యలఁ గణియించి సీత తెఱఁగార్తి నెరుంగఁగజేసి యయ్యెడన్. 61

చం. అనఘచరిత్ర ! సత్యనిధి ! యార్తశరణ్య ! దయానిధాన ! య
 త్యనత దశాననాఖ్య గలయట్టి నిశాచరనేత చక్కఁగా
 జనకనరేంద్రజన్ రథరథాస్థలి జేరిచి లంక కేగ్తెరన్
 జనఁ గని యడ్డగించి దృఢసంధి ఘటిల్లఁగ నాజి జేసితిన్. 62

కం. అరికట్టి సాగనీయక
 చరణనఖర శస్త్రికల నిశాచరనేతన్
 జిరతరగతిఁ దన్న [2]నస్సృ
 క్ఛర ధారల్ గాత్రయష్టి జారఁగ డస్సెన్. 63

కం. ఇతరేతరకరదళితా
 తతగాత్రజరక్త సలిలధారాసిక్త
 క్షితియయ్యె న్నిర్ఝరపం
 తతి తారాసరణి నిల్చి దర్శించంగన్.

---

1. రార్జ (ము) 2. గస్సృ (ము)

కం. నీతండ్రికి నాకధికహి
తాతిశయత గలిగె గాన ననిఁ దెగి నే నా
సీతతెఱం గెఱిఁగించఁగ
నీతఱిఁగా నిలిచితి న్నరేంద్రశశాంకా. 65

కం. అని యీల్గిన యాగ్రద్ధన్
గని యర్వాక్రియ రచించి కడతేర్చె ధరా
తనయాధినేత నడకల
కెనగల్గెదరే జగత్త్రయిన్ తెలియంగన్. 66

సీ. ఆగ్రద్ధ యెఱిఁగించి నట్టి జాడల్ నిద
ర్శన సిద్ధి జక్కనఁ జరిగి జరిగి
ఘనదీర్ఘ హస్తరాక్షసకర్త దెగటార్చి
కాననాంతస్స్థలిఁ గడచి కడచి
జేరి యర్చించిన చెంచెత నిజదాసి
గా దయాదృష్టిచేఁ గాఁచి కాఁచి
యధరసంఘట్టన నైన రెండక్కరాల్
గల సరస్స్థలి నీట నలరి యలరి

తాళ హింతాళ కదళీరసాలకంద
రాల సంతానకేతకీసాలకరక
జాలశాఖల నీడలఁ జాల నలసి
చింతచే రాచనెల లధిష్ఠించి రంత. 67

వ. ఇట్లు చేరి యధిజ్యశరాసనశస్త్రికల్ దాల్చి తరణికళాధరలీలఁ దేజరిల్లెడి రాచనెలల జాడఁ జారసంతతిచే నార్కి యాలించి జడిసి యాంజనేయ హరి ననిచిన. 68

కం. ఇనతనయాగచరాజ్ఞం
జని చని కాసారతీరజగతి నధిష్ఠిం
చినయట్టి రాచనెలలం
గని యానతిఁజేసి నిల్చి కలనాదగతిన్. 69

ఆ.వె. ఎచటి కేట్టి యాత్ర యెట్టి కార్యస్థితి
దాని నెఱుక సేయ దగదె యన్న
ననిలతనయ నగచరాగ్రణిఁ గాంచి ఖ
రారి తెలియ నాడె సాదరించి. 70

సీ. నాతండ్రి దశరథనరనేత చినతల్లి
కిచ్చిన కాంక్ష దానీయలేక
యలగంగ నాగాధ నాలించి యాలించి
సంధి సంధిల యతిసరణిఁ దాల్చి
తగ రాజధాని నేఁ దరలి దండకచండ
కాననాంతస్థ్సలి గదియఁ దెలిసి
తస్కరక్రియచేత దశగళలేఖారి
జనకజాంగన జేరి సంగ్రహించి.

తీక్ష్ణగతి లంకజాడల దెచ్చినట్టి
కట్టడ లెఱంగ తృష్ణ నాకండ్ల నలసి
సరసగంధానిలాంత కాసారతీర
సైకతస్థలి నిలచితి జాలి ననఘ! 71

కం. అని యాద్యంతక్రియ లా
యనిలజహరి కెఱుఁగఁజేయ నాలించి నరా
శనహంత యానన స్థలి
గని యలజడి యడఁచి నీతికార్యస్థితిచేన్. 72

ఆ.వె. ఇట్టికార్యసరణి కేటికి చింతించ
దశరథక్షితీశతనయ! రయత
నార్కిఁ గలిసితేని యఖిలకార్యార్థ సం
ఘటనగాదె యర్థఘటికయందె. 73

చం. హరిశిఖిహేళినందన నరాశననాథ నదీశనార్థ రా
డ్గిరిశదిగంతకేశతతికిం గణియింపఁగ నార్కికర్త తా
నరయఁగ నీసహాయత నయక్రియసంధిల నిశ్చేనేని ని
ర్జరఘటలైన నాజిఁ గడసాగఁగ నిశ్చెదరే జగత్త్రియిన్. 74

కం. అని యాతనియాజ్ఞ నొద్దికిఁ
జని యర్కజహరికి సకలచర్య లెఱుఁగఁ జే
సిన సంతసిల్లి దశరథ
తనయాగ్రణిఁ దేగ ననిచెఁ దహతహ లెసఁగన్. 75

వ. ఇట్లాంజనేయహరి యార్కి యానతిఁ దిరిగి చని దాశరథిం గాంచి. 76

కం. *ఇక్కడి కార్కికి రారా
దక్కడి కేతెంచితేని నఖిలాకాంక్షల్
చక్కఁగ నీడేరును నా
నక్కఱచే లేచి యధికహర్షాసక్తిన్. 77

మ. అల ధాత్రీశిత యంజనాతనయసాహాయ్యక్రియల్ రా గిరి
స్థలిఁ గీశక్షితినేత గాంచి యతికాంక్షల్ దీరఁగా డిగ్గి తా
రలయాహ్లాదరసస్థితిన్ గదసి గాఢాలింగనాద్యర్హ చ
ర్యలచేతన్ నటియించి నిల్చిరి రహస్యక్రీడచే నయ్యెడన్. 70

కం. ఆ దాశరథిని గని య
త్యాదరగతి నర్కతనయహరి తా హృదయా
హ్లాదరసస్థితిచేఁ గల
నాదక్రియ నాడె నీతి నర్తిల్లంగన్. 79

చం. అనఘచరిత్ర ! నీనడక లాహరిచేత నెఱింగినాఁడఁ జ
క్కని చరణాగ్రఘట్టనలఁ గంనిధి లంక యడంగ దన్ని య
త్యనతదశాస్యరాత్రిచరదంతి నహంక్రియ జార్చ తెచ్చి న
ర్తనగతి నగ్రధాత్రి నిడెదన్ జరియించఁగనీక కట్టెదన్. 80

సీ. అదిగాక నేనిట్టి యద్రిఁ గీశసహాయ
తా స్థితిఁ జరియించ దైత్యనేత
కాంచనస్యందనాగ్రస్థలి నిడియు జిం
తాతీతరతాగతి నరుగసాగ

*ఇక్కడికి + అర్కికి = ఇక్కడికార్కికి.

జనకకన్యాకాంత తనచీరగంద్రచే
ఘనతరాలంక్రియల్ గట్టి యిచట
నేసె నేసిన యది యిన్నాళ్ళదనుక నీ
చరిసంది దాచితిఁ జాడ దెలియ

నని తరలి దానిదెచ్చి ఖరారిచెంత
నిడిన గన్నీటిజడిచేత నెల్ల యంగ
యష్టి తడియంగ నిలజారిలేచి తక్క
చెంత తనదాయి లాలించ శాంతిఁ జెందె. 81

వ. ఇట్లు శాంతిఁ జెందిన దాశరథింగాంచి యార్కి యిట్లనియె. 81

ఆ.వె. ఇంత చింతఁగలఁగ నేటికి నాకాంత
జేరి సంఘటిల్లఁ జేసితేని
యర్థఘటికనీహితార్థక్రియల్[1] సేయ
గలనయా ఖరాంతకక్షితీశ ! 83

కం. తారాపతి నాకడ కే
తేరంగాఁ గాంచి శాక్రి దృఢగతి గిష్కిం
ధారాజ్యక ర్తయై తన
రారె నతనిసాటిసేయ జగతిం గలరే. 84

తే. అనకాఖ్య గలిగినట్టి ఖగారాతి
సంహరించి యంఘ్రి సంహరించి
నికటశిఖరి దాటనేసె నాశాక్రిచే
శక్తి గణనసేయఁ జాలననఘ. 85

కం. ఈడనరాని దృఢక్రియ
నేడింటన్ దాడిచెట్ల నేకాకృతిగా
క్రీడతలల్ కరశాఖల్
గేడించి గ్రహించె శాక్రికిన్ సరిగలరే. 86

1. సేతు (ము)

కం. అనినం దరహాసయుతా
నన కంజారాతికిన్ ఘనశ్రీలెచ్చం
దిననాథజ హరినేతన్
గని తేనెల్ జిల్కు నాడె గాదిలి సేతన్. 87

చం. అనఘా! నీయెదఁ జింతసేయఁ దగదే నా నిర్జరాధీశనం
దనకీశాగ్రణి [1]గాలకాశనటనన్ నారాచధారాహతిన్
గనెలై త్రెళ్ళఁగ నేనయేసినకడన్ గారాన నీలార నీ
కనతఖ్యాతి ఘటిల్ల నిచ్చి హరిరాజ్యశ్రీల నేలించెదన్. 88

ఆ.వె. అంగజారియైన నచలాధరారాతి
యైన స్రష్టయైన నడ్డగించ
సాగిరేని శాక్రి జక్కాడకే చన
నిట్టి సందగాన నెరుఁగరాదె. 89

కం. అని యార్కి చెంతరాఁగాఁ
జని త్రెళ్ళిన నిర్జరారిచరణనఖర సం
జ్ఞ నెగుర గీచెన్ హరినం
దనహరికన్నాన క్షాత్రతరనయశక్తిన్. 90

వ. అది గడఁచి. 91

ఉ. ఎన్నికఁ దాడిచెట్లకడ కేఁగి ధరాతనయాధినేత య
చ్ఛిన్నశరాసయష్టి నరిఁజేరిచి కీలికరాళశస్త్రిచే
నన్నిఁట గండ్రలై ధరణినంటఁగనేసె దిశల్ చలించఁగా
గిన్నర సిద్ధసాధ్యఖగఖేచరకీర్తన లెచ్చ నయ్యెడన్. 92

కం. తన కట్టిదె నాదశరథ
తనయాగ్రణి నడకసాటి దాకిన నినినం
దనహరి యలరి తదాజ్ఞం
జని శాక్రిన్ జేరి యుద్ధసన్నద్ధగతిన్. 93

1. కాలక + ఆశ - 'క' స్వార్థము.

ఉ. చేరి దినేశజాతహరిఁ జీటిన[1]నంతట నాలకించి నిం
డారిన యాగ్రహాగ్నిశిఖ లాశల నిండఁగ దాకనేఁగి శై
లారిజకీశనేత గదియన్ గరితనక్రియ నాజి యయ్యె నా
చారణసిద్ధసాధ్య ఖగచారణ సంతతి తల్లడిల్లఁగన్. 94

కం. సాలాసాలి శిలాశిలి
తాళాతాళిం గరాళదంతాదంతిన్
శైలాశైలి కచాకచి
హేళిం గలయించ సాగి రిద్దఱ లంతన్. 95

చం. చని ఖరహంతచెంతఁగల శాఖియె యుండగ నిల్చి సాయకా
సన దృఢశింజినిన్ గరితనశ్రుతిఁ జేరిచి లేఖరాజనం
దనహరిఁ గాంచి కాంచి ధర తల్లడిలంగ ఝుళీనదాక నే
సినఁ దెగిత్రెళ్ళె దా నశనిచే నలియైన ధరాధరాకృతిన్. 95

కం. ఈ రీతి శాక్రి ద్రెళ్ళిన
దారాసతి నార్కి కిచ్చి దయచేఁ గిష్కిం
ధారాజ్యకర్తఁ జేసెన్
శ్రీరంజిల నతని గణన సేయంగలరే! 97

వ. అంత. 98

శా. తారాకాంత దినేశజాతహరి నిత్యశ్రీల శృంగార కాం
తారాజ్యస్థలిఁ జందనాచల దరీధాత్రీఘనప్రోదినీ
తీరాగ్రక్షితిరాజ గేయగుహలన్ దీరానహ్యజ్ఞాతకే
శీరాగస్థితి దేలియాడిరి హాటాళీజాలసంక్రాంతిచేన్. 99

కం. ఎతటిఁ దెలియఁగనేరక
యాతారాకాంతఁ గాంచి యత్యంచితరా
జ్యాతిశయ శ్రీచేతన్
సీతాజానిఁ గనలేక క్షితిఁ జరియించన్. 100

1. శంతట (ము)

వ. అయ్యెడ నాషాఢాది దినచర్యల్ నడచె నయ్యెడ. 101

కం. క్షితి గగనస్థలి యేకా
కృతిదాల్చినయట్టిజాడ దృఢదంతికర
స్థితి నంచిత జలధారా
తతిజారెన్ జలదగర్జిత క్రియ లెసఁగన్. 102

మ. కరచాచ్ఛిన్నదిగంతశాఖియయి నిర్ఘాతాహతా[1]గారయై
హరినాగేంద్రకరాతిచండశతధారాశ్లేషశేషాహిశే
ఖర గండస్థలియై ఘనాఘనతటిద్గర్జాతిరేకస్థితిన్
ధరయెల్లం జడి నిండసాగె జనచింతాకారణస్థానియై. 103

తే. అట్టిజడినాళ్ళ నాదైత్యహంత చింతఁ
గైకసీ జనకాగ్రజాఖ్యాక శిఖరి
నర్థి నిల్చెను నధికహితార్తి చేతఁ
దాళఁ జాలక తనచిన్నదాయిఁ జేరి. 104

కం. చేసిన [2]శరతికి రాకే
యాసారసహితజహరి యహంక్రియచేతన్
నాసాలసనాహ్వాత్థస్నలిఁ
గాసిలఁ జేయంతసాగెఁగా నిర్దయతన్. 105

కం. తేలిన తనకార్యస్థితి
లీలన్ ఘటియించె గనుక లెక్కించక తాఁ
జాలానాళ్ళయ్యెన్ రాఁ
డేలా నేనింక నార్కి కేలా తెలియన్. 106

కం. తనరాజ్యశ్రీచేతన్
దన సాహసచర్యచేతఁ దారాస్థితికిం
దనదేహాయష్టిఁ దెలియక
సనయత నేతేరడాయెఁ జంచలదృష్టిన్. 107

1. గాలియై(ము) (వాతాంగాలియై) 2. శరతి=శరత్కాలార్థము.

ఉ. చక్కఁగ ధాత్రి నద్రిచరజాలసహాయత గల్గి యార్కి తా
నిక్కడ కేఁగ లెస్స యతఁ డేగక సాహసశక్తి నిల్చె నా
నిక్కినయట్టి శాక్రి దెగనేసిన శస్త్రిక యగ్నికీలలం
గ్రక్కఁగ సాగె దీనికిక గానఁగనేయ నదేల ధీనిధీ. 108

కం. అనియాడి యన్న యిచ్చిన
ఘనశస్త్రికఁ దాల్చి తీక్ష్ణకరరయగతిచేఁ
గనదాగ్రిహాహృత్థ్వనియై
చనియెన్ గిష్కింధదారిఁ జనతతి కలఁగన్. 109

కం. అనలాకృతిచే దశరథ
తనయక్షితిజానిరాగఁ దగఁ గిష్కింధా
జనసంతతి హృదయస్థలిఁ
గని యార్తిం గదలి సాగెఁ గన్నటికార్తిన్. 110

కం. సరగ సదనాంతరస్థలి
కరిఁగిన రాచనెలఁ గాంచి యలజడి దారా
హరినేత లెద్ది తెలియక
తిరుగంగాసాగి రాత్రి తిండ్రించంగన్. 111

వ. అంత శేషాంశసంజాతధరణిజాని యంతఃస్థలికిం జని. 112

చం. ఇనతనయాగచారిఁ గని యుద్ధతరాగ్రహదృష్టిఁ జీఱిచే
సినగెరి దాట నేటి కిఁక జేరని దెంత కడింది శక్రనం
దనహరి ద్రెళ్ళనేసిన ధనంజయహేతి కరాళశస్త్రి చ
క్కన గనరాదె నిన్నడఁచఁ గాగల దీ ఘటియందె కానరా. 113

వ. అని దాశరథిదాయి యనినఁ దారాసహాయత దినకరనందన హరి
కర్త చలించి. 114

ఉ. దారనధాత్రిసాగిలి హితస్థితిచేఁ గణియించి డగ్గరాఁ
జేరి యనేకసత్క్రియలచే నలరించినఁ గాక డిగ్గి నిం
డారిన శాంతి రాచనెల యాహరి లాలనచేతజిక్కి నే
తేరఁగజేసి తాఁదిరిగె దిగ్ధరణీశితలెన్న నయ్యెడన్. 115

ఉ. ఆ నలినీశజాచలచరాగ్రణి రంజిలి యద్రికన్యకా
జాని నగారికీలి హరిజాత నిశాచరనాథకంధిరా
జానిల యక్షనాయకదిశాగతకీశసహాయతాస్థితిన్
శ్రీనిధియైన దాశరథి జేరఁగ నేఁగి గణించ నయ్యెడన్. 116

కం. దిననాథ జాతహరి శా
సనగతిచే రాక్షసారి జనకక్షితిరా
ట్తనయకయి యనఁచ గిరిచర
జనసేనల నాశలెల్లఁ జదియఁగ నంతన్. 117

ఉ. అనిచిన గీశసేన లఖిలాశల కేఁగి యనేకచర్యలన్
ఘనతర శైల కందరలఁ గానలఁ దిన్నెల నేటిజాడలన్
గని కని జానకీలలనఁ గానఁగ నేరక లజ్జచేత జ
క్కనఖరహంత జేరి తిరుగంజని రాత్రి ఘటిల్ల నయ్యెడన్. 118

ఉ. ఆనగచారి నంతతి దృఢాకృతిగా (నిరసించి చాలక)
న్నానిన యాంజనేయహరి యంచితశక్తి నెఱింగి జానకీ
జాని దయార్ద్రదృష్టిఁ దనసన్నిధిఁ జేరఁగఁజీటి సాహస
శ్రీనయ కార్యధైర్య జయచిత్రకళల్ గణియించి నిల్కడన్. 119

కం. తనచేతి యలంక్రియ నా
యనిలజహరి చేతికీయ నది దాలిచి చ
య్యన దక్షిణ జలనిధి చా
య నరిఁగె గిరిచరఘటా సహాయతచేతన్. 120

వ. ఇట్లు చని చని. 221

ఉ. కానల నేటిచాళికల గట్ల యదాటికిఁ గందరాంతర
స్థానలతాగృహోచ్ఛటల చర్లకడన్ గడలేని దిన్నెలన్
జానకి దైత్యహంతసతిఁ జక్కనిజాడఁ గనంగనేర కే
గ్లానిజరించి కీశతతి కందఁగ సాగె ననేకచర్యలన్. 122

కం. ఆహార నిద్ర లెఱుఁగక
యాహాకారగతిచేత నాశలు గలఁగన్
ఆహారిసేనల్ దిరిగిరి
సాహసదృఢ నీతిధై ర్యచర్యలచేతన్. 123

కం. అలయికచే నీరీతిం
దెలియక నల్దిశలఁ గలయఁ దిరిగి తిరిగి తృ
ష్ణలచే *నాకండ్లెంతే
నిలజడి సేయంగ నిలిచి రా రాత్రిక్రియలన్. 124

వ. అంత. 125

సీ. అంజనానందనహరికర్త సంగడి
కాండ్లనందటి జతగలసి చెంత
సలిలాండజాత సంజాతయాతాయాత
కందరాంతస్థ్సలి గదిసి సాగఁ
గడలేని గాఢాంధకార సంహతిఁ దాటి
నిశ్చేతనక్రియ నెగడినట్టి
రత్నసాల హిరణ్యరాజిగేహాంగణరం
జిత రాజధాని దర్శించి యచటఁ

జక్కనినెలంతఁ గని యట్టిచానకతన
దృష్టయాకండ్ల నడఁగించి దేజరిల్లి
యది గడచి ఢాక నెగసి యింద్రాద్రిఁ జేరి
సంచరించిరి[1]యంతంత జగతియగల. 126

వ. ఇట్లు సంచరించి యలయికనందఱల్ జంగిలిగట్టి దాశరథి కథ లిష్ట
గాథల నాడసాగి రెట్లంటేని. 127

సీ. జనయిత్రియాజ్ఞ దాశరథి దండకకాన
నాంతరస్థలికి దానరుఁగనేల ?

1. యంతట జగతిగలయ (వ్రా) *ఆకళ్ళచే.

ఖరఖరాది నిశాటక ర్తల నంధర
శితశ స్త్రికలచేతఁ జెండనేల ?
తస్కరక్రియలచే దశగళ త్రిదశారి
క్షితిజ లంకాస్థలి జేర్చనేల ?
యతని దండాహతి నర్కసారథిజాండ
జాగ్రణి నలిదెగటార్చనేల ?

యట్టిరానెల కీయార్కి కాంజనేయ
శిఖరిచరనేత సఖ్యత సేయనేలఁ ?
దృష్టనాకండ్ల చే గడ దెలియలేక
గట్లఁ గానల జరియించఁగా నదేల ? 128

కం. అని హరిసేనల్ జాలిం
గనలఁగ నాయింద్రశిఖరి కందఱ శయనిం
చిన దినకరసారథినం
దననీడజనేత తెలిసి తహతహచేతన్. 129

సీ. దశరథరాజనందన కథాకర్ణన
క్రియచేతరెక్కలిగిర్చినట్టి
గ్రద్ధ తానింద్రాద్రి కందరాంతస్థ్సలిఁ
గడఁచి చెంగటి కీశఘటలగాంచి
కలయ నందఱఁ జేరఁగాఁ జీఱిచక్కఁగ
గణియించి హర్ష సంగతిఁ దనర్చి
తనచర్యలన్నింటఁ దాచక యెఱిఁగించి
జడయక తార కాసరణి కెగసి

కైకసేయనిశాచరక ర్తనగరి
సరసశృంగార కాననస్థలి కృశాంగి
యైన జనకజగట్టిగా నరసియరసి
జగతికతి శీఘ్రతరగతిఁ జారినిలిచి. 130

ఉ. కానకనల్దిశల్ గలయఁగాఁ జరియించఁగనేల నిస్సహా
గ్లాని జరించి చండదశకంఠనిశాచరశాసితాచ్ఛలం

కానగరస్థలిన్ సరసకాననధాత్రి గృశాంగియైన యా
జానకి గంటి నం చరిగె జక్కఁగ గ్రద్ధ నిజేచ్ఛ నయ్యెడన్. 131

కం. దినసాయకసారథినం
దననీడజచేత [1]ధరణి కన్యా
ఘనసరణిఁ దెలిసి చక్కఁగ
ననిలజహారి సంగడీల యాజ్ఞారతిచేన్. 132

సీ. నింగికిఁ జక్కఁగా నెగిరి నిశ్చలత లం
కారాజధానికిఁ గదలి కదలి
జలరాశి దేలిన శైలకన్యాసహా
జాద్రి యం దొకకేల నాని యాని
యట్టకట్టిన యనిలాశనీజనని య
త్యంతసత్కారాల నంది యంది
యల్క సింహిక జఠరాంతస్థ్సలి నిల్చి
చెలఁగి గండ్రల్ గాంగ జీరి చీరి

యంచితశ్రీలచే హెచ్చినట్టి యాత్రి
శృంగధరణీధరస్థలి జేరి చేరి
నంతనే చండదీధితి య స్తశిఖరి
గదిపె నెలసంజకెంజాయ లెదుఁగసాగె. 133

తే. అంత గాఢాంధకారసంహతి యజాండ
కలశి నిండిన గిరిచరకర్త బుతు
సరణి కెగసి దశాననవారణారి
నగరి నతగాత్రయష్టియై నాచి కదిసి. 134

కం. తెలియక నదృశ్యగతిచే
గలయఁగ రాజగృహశాలఁ గరిహయరథశా
లల నగళల్ నింటింటన్
లలితక్రియఁ గిరిఁగి తిరిఁగి లజ్జ ఘటిల్లన్. 135

---

1. ధరణికన్యా (ము)

శా. అలంకాస్థలి యంతటన్ దెలిసి దేహగ్లానిచే చెంగటన్
శ్రీలానంగననంతనాకనగ సచ్ఛృంగార కాంతార ధా
త్రీలేఖాహిత గేహినీచలితరీతిన్ నాతి నీక్షించి తాఁ
జాలా రంజిలి సీతగా నరసి తత్సాన్నిధ్య సంస్థాయియై. 136

కం. తనచేతి యపలంక్రియ నా
జనకతనయచేతి కిచ్చి జనకతనయచే
ఘనరత్నకలిక దాలిచి
యనిజల హరినేత సాహసాతిశయతచేన్. 137

సీ. అనతశృంగార కాననశాఖిరేఖల
ధరణీస్థలిని ద్రెళ్ల తన్ని తన్ని
చెనట నిశాచరాంగనల కర్ణాస్య నా
సికలెల్ల నిలియంగ సెలఁగి సెలఁగి
యాజి కేతెంచిన యక్షకాదినిశాట
శేఖర సంహతిఁ జెండి చెండి
శక్రజిచ్ఛరధాతృ శస్త్రికఁ జిక్కి దై
త్యేశిఁ చెంగటి కేఁగి యేఁగి
లంకకాలాగ్ని శిఖలఁ గలంచి తిరిగి
సీతయానతిఁ జని రక్కసిని హరించి
కడలి లంఘించి హరిసేనఁ గలసి రాఘ
సారి దర్శించి నతిఁ జేసి యండనిలచి. 138

కం. కంటిన్ సాక్షాదిందిర
గంటిన్ జనకక్షితీశకన్యన్ ధన్యన్
గంటిన్ సత్యగ్రేసర
గంటి జగజ్జనని సీతఁ గంటిన్ గంటిన్. 139

వ. అనిన సంతసిల్లి దాశరథి యిట్లనియె. 140

కం. నాతండ్రి దశరథక్షితి
నేత సరణిగాదె యనఘ ! నీఋణగతి నే

నేతటినైనం గానిక
నాతతగతి దీర్చఁగలనె యందఱ లెరుఁగన్. 141

కం. అన సంతసిల్లి దశరథ
తనయక్షితిజాని గాంచి దండకరిగి యా
యనిలజహారి యంఘ్రిస్థలి
కెనయఁగ నానతి రచించె హితగతి నెరయన్. 142

చం. క్షితితనయాలతాంగి దయచేసినయట్టి దినాధినాయకా
యతఘృణి కంజరాగశిల నాహరియిచ్చినఁ గేల నంటి యం
చితనయ నాగ్రజాతజలచేసి శరీరయష్టియై
ధృతిచెడి నేలఁ జారి యతిదీనతలేచి ఖరారి యయ్యెడన్. 143

ఆ.వె. కదియం జింతఁ జేసి కట్టెద దెలసి దా
శరథి రాజహాళి సకలకీశ
సేనలెల్ల నిండిరా నీరనిధి చెంతఁ
జేరి ఖచరరాజి చెలఁగ నంత. 144

కం. ధీనిధి ఖరారి యగచర
సేనలచే జలధిచెంతఁ జేరిన జాడల్
రా నాలకించి కెరలి ద
శానన ఖచరారి లేచి యాగ్రహదృష్టిన్. 145

కం. ఘనరత్నఖచిత సింహా
సన ధరణిన్ నిలిచి సకలశాస్త్రజ్ఞ నరా
శనకర్తల హితసరణిం
గని చేరఁగఁ జీరి చాల కాక ఘటిల్లన్. 146

చం. కట కట తాటకారి తనకాంతఁ దలంచఁగలేక యష్టది
క్తట హరిసేనలన్ గలసి కంనిధి చెంగటికేఁగి విల్చినాఁ
డట గిరిజాగిరీశసహితాద్రి నహీనకరాళసారసం
ఘటితకరాగ్రశక్తి సిరిసందఁగ నెత్తిన నన్నెఱుంగఁడే ! 147

వ. అని యాస్థాని గ్రక్కటిల్లఁ గ్రీగంట రక్తజలధారల్ జార జండనిర్ఘాత
నాదతిరస్కార దంతసంతాన సంఘటిత కిటగిటల్ నెఱయ దీర్ఘనాసి
రంధ్ర నిర్గతానిలాహతి నంగయష్టికంద దశశీర్ష చిరత్నరత్న కిరీటనిగ
నిగచ్ఛాయల్ జదలంట సితశాఖ కంటకార కేశచ్ఛట లల్లలనాడ నాత
తజఘనఘనాఘన నిర్జాడ్యగర్జాగాధ తర్జనలం జెంగలిచ నగ్రస్థలి
నీతికార్యదక్షుదండ నాయక సంహతిఁ గాంచి శరశరాసనఖడ్గచేలాం
గల గదల్ దెండన సదృశ కంఖాణగంధగంధిలకరటికాంచనశతాంగ
సైనికతతి కర్మక్రియ లలంకరించిన యదిగండనిస్సాణ నిస్సాణ
ఢక్కానక ఝుల్లరీ ఘంటాశంఖకా హాళరంతదరఁ జేయ నిఖిలహిత
నిశాచరకర్తల కందటికి లేఖల్లి ఖయించిన నది లెస్సయని నెయ్యి[1]
చిలికించిన కాలాగ్నినాఁ గెరలి యహంకరించి గద్దించి యంతటం
గలయ నధిష్ఠించి 148

కం తనయాస్థానధరిత్రిన్
ఘనరాక్షసకర్త నీతికార్యనిధి దశా
ననరాత్రించరనేతన్
గని దాసహాత్ర సరణిఁ గణియించెఁ గృతిన్. 149

కం. అరనీటకకర్తధృతిన్
హరిసేనలఁ గలసి చన్ననకటా ! యెదని
(?) ర్జ రకంజన జరియించన్
శరణియె హరికర్తలైన సరియనగలరే. 150

సీ. అరచేత నే నింగినాన శేషాహి
తలలడంగ ధరిత్రిఁ దన్నలేనె
కలఁచనే జలరాశి గడలెల్ల జారంగ
నలయంగ గాలాగ్ని నడచలేనె
గట్లన్నియచ్చనగండ్లగాఁ గీటనే
యార్కిదంష్ట్రిలు రాల [2]నణఁచలేనె
శక్రాది నిర్జరసంహతిఁ ద్రాళ్లచే
గట్టి యంగడియడ్డ గట్టలేనె

1. చెలికించిన (ము) 2. నలచ (ము)

తెలియనీయాజ్ఞ యెంతైనఁ గలిగెనేని
యెంతటికి నైన నిలిచెదఁ జింత యేల
యశనిసంకాశ కఠినాట్టహాస సంచ
లీకృతారాతిరాక్ష్యేయ ! కైకసేయ ! 151

కం. నన్నుచటికి శాసించిన
దిన్నఁగరానేల దెచ్చి తృణగతిగా నీ
సన్నిధి నిడియెద నాయెడఁ
గన్న ననర్ఘగతి గల్లఁగాంచెద నిచటన్. 152

కం. అనియాడినట్టి గాథల
ననతానందజలరాశి నలరిన దశకం
ఠనిశాచరక్షితీశితఁ
గని హితజనరేఖలెల్లఁ గణియించి రటన్. 153

## ఆశ్వాసాంతము

కం. పురుహూతాది దిశాధీ
శ్వరసముదయమస్తకాగ్ర సంస్థితసుకుటీ
వరమణి నీరాజన వి
స్ఫురిత పదాంభోజయుగళ సురుచిరనఖరా ! 154

— ము క్త ప ద గ్ర స్త ము —

చం. వనధినిశాంత శాంతమునివర్గస్సాదామరభూజ భూజభం
జన దృఢచక్ర చక్రసఖసాదసవిద్విషదక్షు దక్షుజా
తనురిపువంద్య వంద్యభినుతప్రతిభాగుణజాల జాలన
ర్తనకృతలోక లోకహితధర్మవిచార యుదార వైభవా ! 155

(?) కలశవారధికన్యకాకృతి[2] కామ్రసుకృతి ఫలోదయా
లలిత [3]యాగహుతారితసుకీలాలపూర్ణ సరిచ్ఛయా
మలహరాది గిరీశసేవిత మంజులాంఘ్రికుశేశయా
జలజచక్ర గదాసిశార్ఙ్మక సంగ్రహోచ్ఛ చతుశ్శయా. 156

1. అన్నచటికి (ము) 2. క్రమ (శి) 3. పరశు (ము) 156 సంఖ్య గల పద్యము 'సు'లో 'మత్తకోకిల' యనిగలదు కాని లక్షణము సరిగాలేదు.

– గద్య –

ఇది శ్రీమత్కర్పూరాచల లక్ష్మీనృసింహ వేంకటేశ్వర వరప్రసాదలబ్ధ సకలై
శ్వర్య ధురీణ శారదాప్రశ్న వివరణ శతఘంటావధాన వినయధునీ
తరంగవిజృంభణాజృంభిత సలలితమృదుమధుర వాగ్వైఖరీఝరీధురీణ
స్థాపితాశేష విశేషప్రసిద్ధ సాహిత్య సారస్వతాంధ్రకవితాష్ట
భాషావిశేష సంస్కృతాంధ్ర నిరోష్ఠ్యోష్ఠ్యాది వింశతి
ప్రబంధనిర్మాణధురీణ మౌద్గల్యమహర్షి గోత్ర పవిత్ర
తిరుమల దేశికేంద్ర పౌత్ర తిరువేంగళాచార్య పుత్ర
మట్టింగంటి సింగరాచార్య కవిరాజప్రణీతంబయిన
దశరథరాజనందన చరిత్ర యను నిరోష్ఠ్య
మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము.



శ్రీ

# దశరథరాజనందన చరిత్ర

## చతుర్థాశ్వాసము

కం. శ్రీవేంకట పురుషోత్తమ
కావేరీమధ్య బదరికావనకాంచ్యా
ద్యావాస [1]విశ్రవణకరు
ణావిత కౌంతేయ కర్పరాద్రినృసింహా. 1

వ. ఆతఁటి గథాసరణి యెట్లంటేని 2

సీ. [2]నాకనాథజిదాది నందనాహంకార
కలితగాథల కిచ్చు నలరి యలరి
హితదండనాయకాహీననీతినిధాన
చిత్రగాథల కిచ్చుఁ జెలఁగి చెలఁగి
ఘనఖడ్గహస్తరాక్షసరాజ సాహస
హృద్యగాథల కెల్ల హెచ్చి హెచ్చి
సకలశాస్త్రజ్ఞానచణకళాధరజాల
గణితగాథల కర్థిఁ గరఁగి కరఁగి
హస్తియై సిక్కినట్టి దశాస్యనిర్జ
రారి నీక్షించి రహితాగ్రహాగ్ని శాంతి
కాంతిసంసక్తిఁ జల్లార్చి కైకసీక
నిష్టతనయ ఖగారాతి నిష్ఠ ననియె. 3

క. కీడింత తెలియకే ని
న్నాడికె సేయంగ నిట్టి యందఱు లాహో

---

1. విశ్రగుణ (శి); 2. నాకనాథజదాది (ము)

యాడంగనట్టి జాడల
నీడేరెనె, కార్యసిద్ధు లిద్ధచరిత్రా! 4

చం. అలజడిఁ [1]జేసి శక్రదహనార్కజనైరృత కంధినాయకా
నిల ధనదాంగజాద్యఖిల నిర్జర కిన్నర సిద్ధ సంతతిన్
గలన జయించినట్టి త్రిజగజ్జన రక్షణకర్త కాంచనా
చల ధృతిశాలి చండతర [2]సాహసియైన ఖరారి యన్నిటన్. 5

కం. సిరియే జానకి యయ్యెన్
హరియే దాశరథియయ్యె నదిగాక నిశా
చరనాథ! త్రిదశఘటలే
గిరిచరకర్తలయి రిలను గీడాడంగన్. 6

సీ. శృంగారకాననక్షితిజాతసంతతి
యంతటఁ ద్రెళ్లిన ట్లాయెనేని
శిలలచే ఘనరజశ్శ్రేణి చేత నగడ్త
లర్థి ధాత్రికి[3]చదునాయెనేని
కేతనాయత్త గాంగేయ రాజగృహాళి
యక్కడక్కడ దిన్నెలాయెనేని
గంధగంధిల దంతి కంఖాణరథరాజి
యడరి చెల్లాచెద ర్లాయెనేని
యరయ నంగళ్ల ధనధాన్య హారణార్థ
హారసంహతి నలిగాసి యాయెనేని
నిలిచి నేనాడినట్టి యానీతిసరణి
యెదకె దృష్టాంతగతి గాదె యదితిజారి. 7

కం. ధరణీకన్యానాయక
చిరతర శితసాయకాగ్ని శిఖదేర్చి నిశా
చరగహనస్థలి యల్లై
సరఁగనె యార్చినది లెస్స జాగిక నేలా? 8

---

1. చేసె(శి) 2. సాహసితమై 3. చెద(ము)

ఘాత దృఢాస్త్రధార లధికక్రియ నీతలలెల్లఁ ద్రెంచగా
నాతరి నానయస్థితి యహో! గణియించఁగ దాచనేర్చెదే. 13

కం. చింతఁ దొలగించి సీతా
కాంతం దాశరథికిచ్చి ఘననయగతి నీ
సంతతి హిత రాత్రించర
సంతతి రక్షించఁగ దె నిశాచర నాథా! 14

తే. అనిన తనదాయఁ గని చంద్రహాళికాలఁ
దన్నెఁ, దన్నినదానికి ధరణిజారి
లేచి యందఱ నార్తి యాలించ నాడె
సాహసక్రియచే నీతి సడలనీక. 15

సీ. సీతగాదిది దైత్యశేఖర నీకేల
నల్లిన యట్టి నీలాహిగాని
సీతగాదిది దైత్యశేఖర నీనెత్తి
కట్టజారిన యట్టి యశనిగాని
సీతగాదిది దైత్యశేఖర నీశాటి
నంటిన యట్టి చండాగ్ని గాని
సీతగాదిది దైత్యశేఖర నీ యింట
నట నిల్చినట్టి రక్తాస్యగాని
సీతగాదిది నీయెడ ఘాతనాటి
నట్టి హాలహాల తీక్ష్ణశాతాసిగాని
తైన నాగాధ లాలించి యతని గృహిణి
సతని కిచ్చినఁ గాదె నీ యంగరక్ష. 16

చం. అని తృణలీలగాఁ దెలియనాడె ధృతిన్ హితజాతసంతతిన్
దన జనయిత్రిఁ జేరఁజని తత్స్థితి యంత నెఱుంగఁజేసి చ
య్యన జలరాశి దాటి సకలాద్రిచరేశిత లెన్న నెంత ని
ల్చిన ఖరహాంతఁ గాంచి నతిఁజేసి గణించిన హర్షశాలియై. 17

---

1. దొలఁగించి(ము) 2. కట్టి(ము) 3. హాహాల(ము) 4. హితజాల సంతతిన్(శ)

కం. చేరంగఁజేటి యతనిని
నీరస్థాయిగ రచించి నిల్కడగా లం
కారాజ్యకర్త జేసెద
యారాశిఖరారి సాటి యరయఁగ గలరే. 18

వ. అయ్యెడ 19

కం. ఆరాజహేళి హితగతి
నారసనిధిస్థాయియై దినత్రయు తృణశ
య్యారన శయనించె నిరా
హారక్రియ చేత నిష్ఠ యతిశయిలంగన్. 20

చం. జలనిధిఁగాంచి దాశరథి చక్కఁగ సాగిలి లేచి నిల్చినన్
లలితతరంగ నిర్గత ఝుళం ఝుళ లెల్లెడ హెచ్చ, తారకా
స్థలిఁ దెలియంగ నిక్క, దనసనంగడి చక్కని దాయికా స్థితిన్
తెలియఁగఁ జేసి హ్రాజనిత తీక్ష్ణతరాగ్రపు దృష్టిఁ దేరఁగన్. 21

కం. దాశరథి నింగి యంటిన
నా శరనిధి సెగని కరశరాసన యష్టిం
దాశరథి శక్తిఁ దిగిచి ది
గీశ రథికరేఖ లెన్న నెద సంధించెన్. 22

వ. అంత 23

కం. ఆనారాచక్రియఁ గని
దీనాకృతి జలధి జడసి ధృతి ధరణీ జా
జాని చరణాగ్ర సంస్థలి
కానతి రచియించి కేలితాంజలి చేతన్. 24

ఉ. ఇంతనె నాతెలంగరయ కీర్త్య ఘటిల్లఁగ లేచి కేల న
త్యంత శరాసయష్టి నరినగ్గె నయించఁగ నేల నాదినీ
సంతతి రాజ సంతతి రసాస్థలి కార్యగతిన్ రచించ దై
త్యాంతక సాగరాఖ్యఁ దనరారితెఁ జిల్లరగాథ లేటికిన్. 25

ఆ.వె. జగతి నిట్టి సగర సంతతి సాక్షాత్క
రించి యాది హరి జనించె నన్న
కాంక్ష నలరి నాడ కాక సేయఁగ [1]నెద్ది
దారి కీర్తిధారి ! తాటకారి ! 26

కం. నీ చరణ దర్శన స్థితి
నీ చరణ [2]క్షాలనాది నియతఖ్యాతిన్
నీ చరణారాధనగతి
యాచరణశ్రీ ఘటిల్లెనయ్య నరేంద్రా ! 27

ఆ.వె. అనిన ఖరనిశాచరారి యాగాధల
కలరి కినియకే శరాసయష్టిఁ
జిత్రశస్త్రఘటన జేసితి నిది రిత్తఁ
గాదటన్న జలధి [3]కలఁగనాడె. 28

కం. అనఘా ! నీచే సంధిం
చిన సాయకధార రిత్త సేయఁగరాదే
గనక తెలియంగఁ జేసెద
ననతక్రియ దీనిలెన్న నాలించఁగదే. 29

కం. ధనదాశ, ననంతనరా
శనకర్తల్ గలరయా రసనాయక ! త
ద్ఘనశస్త్రికచే నందఱ
గనియలు సేయంగరాదె గ్రచ్చఱ ననినన్. 30

చం. శరనిధి యాజ్ఞ దాశరథి చండశరాసన యష్టిశింజినీ
ఖరతర శస్త్రి వేయఁ [4]దనకాంతి దిగంత నిశాటసంతతిన్,
సరగ హరించి తాఁదిరిగి చండశిఖల్ నెరయంగఁ జేరి త
చ్ఛరధి దనర్చె ఖేచరరసాచర కీర్తన లెచ్చనయ్యెడన్. 31

కం. తనచెంగటి హరిసేనలఁ
గని, నీరధి గట్లచేత గట్టంగ శాసిం

1. నద్ది (ము) 2. క్షారనాథినయతఖ్యాతిన్ (ము) 3. కనఁగనాడె (ము).
4. ధనకాంత (శి)

చిన దైత్యహాంత యానతి
[1]ఘనతర క్రియఁదాల్చి దిశల కరఁగిరి సరగన్. 32

కం. తత చక్రనదాంతరిర సం
స్థిత ధరణీ శిఖరి ఘటలఁదెచ్చిన జలధిన్
ధృతిసంధిల [2]గట్టె నల
క్షితిధరచరనేత సాటి సేయఁగ గలరే. 33

శా. ఆ లంకాస్థలిఁదాక కంధినయచర్యం [3]గట్ల గట్టించి తా
హాళిన్ రాక్షసహంత సద్గిరి చరాధ్యక్షుచ్ఛటాసంగతిన్
జాలా రాత్రిచరేశితల్ కలఁకచేఁ జల్లించఁగా నింగి జే
జేలె ల్లన్ గణియించఁగా నడచె నక్షీణక్రియల్ దీరఁగాన్. 34

ఆ.వె. ఇట్టి సరణి గట్లకట్టదారి నిశాచ
రారి యర్కనందనాదికీశ
ఘటల[4]నెనసి శీఘ్రగతినంతనే. త్రిశృం
గాద్రినెక్కి నిలచె హర్షశక్తి. 35

వ. అంతట నసంఖ్యాతైన హరిసేనలచేత త్రిశృంగగిరి నిలిచి దాశరథి గంధ
గజకుంభాణశతాంగ శాలలచేతఁ గింజల్కరంజిత కంజాతసంజాత రసా
క్రాంత కాసార తటాక దీర్ఘికలచేత సకల ధరణిజ లతాంత రసస్థగిత
దిగంతశృంగార కాంతార రేఖలచేత గాంగేయసాలహీరకలశ కేతనారి
యత్త రాజసదనఘటలచేతఁ జెంగలించి రత్నచ్ఛాయల నాకాశసరణిచే
నలంకరించెడి లంకానగరి దర్శించి, గణించి తలఁగదలించెడి యారాజ
హేళిం హైకసీకనిష్ఠనిశాచరనేత చేరం జని 36

ఆ.వె. అనఘ లంకచిహ్నౌ లసితి నాచెంత
కైక సేయ దితిజకర్తనిఖల
హితనిశాటనేత నెంచనాస్థానినై
తనరెఁగాన నతని గనఁగరాదె. 37

1. అనతిక్రియ(గ) 2. గట్టిరల(శి) 3. గట్టగట్టించి. 4. ఘటలనెనసిలంక గదియంగజనియె శృంగాద్రి యెక్కినిలిచె హర్షశక్తి (శి)

కం. తెలియంగ సెలఁగకే, లర
సెలఁగ దలలచేతఁ దనర రత్నశిలా
కలితాలంకార స్థితి
నలరెన్ లంకాధినేత నల్లనఁ గంచే. 38

సీ. కాలాగ్ని తీక్ష్ణఖడ్గలతల్ ధరించె రెం
డెడల రాక్షసకర్త లెచ్చరించ
నయశాస్త్ర చణదండనాయకచ్ఛటలకా
ర్యాకారవ్యవర్తన లతిశయిల్ల
*జగతి రసాతల గగనచారేశిత
లయ్యెడ జయలిడ హాస్యగతిని
నాకనాథజిదాది నందనరేఖల
సాహసాలంక్రియల్ సందడిల్ల
ననదృశ హిరణ్యఖచిత సింహాసనాగ్ర
ధర నధిష్ఠించిన దశాస్యదైత్యనేత
కట్టె సాక్షాత్కరించిన కాలదండి
దండి దనరారె నంతంత ధరణినాథ. 39

వ. అని యాడిన దాశరథి సంతసిల్ల లంకానేతం గాంచి 40

తే. ఎంతసిరి ఎంత యాకృతి యెంతశక్తి
యెంతతే జెంత నిల్కడ యెంతదండి
యట్టి సాహసి గాంచిన యట్టితల్లి
సత్క్రియ గణించగలఁడె యా స్రష్టయైన. 41

చం. అగజాజాని ననేక కంధరలచే [1]నర్థించె జన్యస్థలిన్
దిగధీశాదితినందనచ్ఛటల నర్థిం గెల్చి శంకించకే
తెగి కైలాసగిరిన్ దృఢాకృతిగ నెంతే గాన నీతండహో
జగదారాధ్యత హెచ్చనేరఁడె సదాచారక్రియన్ జెందినన్. 42

---

*ఈ పాదము నగమే యుండఁ దక్కిన దానిబూర్తి గావించితి-ఇట్లు లేఖన కర్త (ము)*జగతి రసాతలఁ గగనచారిత లయ్యెడను నెదలందు జంకును ధరించి (ను) జగతిరసాతల గగనచారేశిత లయ్యెడిం జయలిడి హాస్య గతిని (శి) 1. నర్చించి జన్యస్థలిన్ (శి)

కం. ఈ నరఖాదాగ్రణి నె
య్యాన [1]సదాచార నియతి యలరి నడచె నా
నేనైనం నిర్జించం
గానేర నటన్న నార్కి కాక ఘటిల్లన్. 43

కం. నాతల్లియైన ధరణీ
జాతం [2]దాశరథి చరణజలజధ్యాన
ఖ్యాతక, రక్షిత జనసం
ఘాతన్, జెఱసాల నిడియె గాయని దాకన్. 44

సీ. సింగిణియల్ల నా నింగికి నెగసిరా
సకల [3]సంహారాతిశయతచేత
నాస్థానియై నిల్పినట్టి లంకానేతఁ
జేరి చండతరాజి [4]జేసి యంత,
దండనాయకరాజి దండించి కాంచన
ఘటరత్న కేతన కలితరాజి
శాలల నన్నింట జగతి బ్రద్దల్లఁగఁ దన్ని
ధాక లంకారాజధాని గలఁచి
దృఢజయానంద సాహసశ్రీలఁ దనరి
మరిగి యేతించి దాశరథిక్షితీశ
హేళిఁ గదియంగ జని కాళ్ల కెరఁగి కీశ
సేన లెన్నంగ దనరారెఁ జిత్రకళల. 45

వ. అయ్యెడ లంకానేత కీరసారణాఖ్యాకచారనిశాచరకర్తలచే దాశరథి శృంగగిరి శిఖరి ననంతసంఖ్యలైన గిరిచరసేనలచే నిలచిన జాడఁ దెలసి

కం. హరసఖదిగ్గ్రాజగృహా
గ్రరసాస్థలితా దశాస్యఖచరారి నిరం
తరహితసంగతి నిలిచెన్
నరగన [5]లెక్కించరాని ఛత్రచ్ఛాయన్. 47

1. సదాచారనియతి(శ్రీ) 2. దాశరథి చరణధ్యానఖ్యాతన్(శ్రీ) దాశరథి.... [illegible](ము) 3. సకలసన్నాహాతి 4. చేసిచెంత 5. లెక్కించరాని (శ్రీ).

ఆ. వె. నింగి గానరాని నీడనిండిన గాంచి
దాశరథి దశాస్య దైత్యకర్త
శక్తిగాగఁ దెలిసి సకలఖచరధరి
త్రీచరాళి గనఁగ తీక్ష్ణసరణి. 48

చం. క్షితితనయాధినేత తనచేతి శరాసనయష్టి నారి నం
చితిగతి నస్త్రసంఘటనఁ జేసి దశాస్యఖగారి ఛత్రసం
తతి తృణలీలనేసిన యథాయథలై జలరాశి నల్దిశల్.
క్షితి గలయంగ నిండె నహిసిద్ధఖగాండజ రేఖలెన్నగన్. 49

తే. జానకీజాని శరహతిచే నిశాట
నేత ఛత్త్రాళి గండ్రలై నేలం ద్రెళ్లె!
[1]యల్లరాజ గృహస్థలి యార్తి డిగ్గి
హితనిశాచరకర్తల నెనసినంత. 50

కం. తనతల్లి యగ్రజనయిత
గని చేరఁగ జీఱి రత్న కలితహిరణ్యా
సనధర నిల్కడ సేయిం
చి నితాంతస్నేహసరణి జెందఁగ నాడెన్. 51

తే. ఎన్నికనిశాట సంతతికెల్ల నాస
చేత కల్యాణసిద్ధిగా జేయనైన
యార్తి నడచంగ నన్నిఁట నలరినట్టి
నన్నిచటికేగఁ జేసితి నీతి దెలియ. 52

కం. జలధి ధరాధరతతిచే
నలరఁగ గట్టించి రాత్రుసాధిత్రిశృంగా
చలధాత్రిన్ గిరిచరసే
[2]నలచేత న్నిలిచె నట్టి నడకలఁ దెలియన్.

వ. అని యిట్లాడిన లంకానేతం గాంచి [3]కైకసజనకాగ్రజనిశాటకర్త
యాగ్రహించి 53

1. అల్క (గ) 2. నలచేదిన్నిలసెనట్టి నడక దెలియఁగన్ (ము) కైకపి
జనకాగ్రజ నిశాటకర్త (శ)

సీ. [1]శతధృతిచే నద్రిజాజానిచే చిత్త
కాంక్షితార్థస్థితి గాంచి కాంచి
అష్టదిక్కర్తలకైన దృష్టికిఁ దేని
నందన సంసిద్ధిఁ జెంది చెంది
అగణిత [2]రత్నాకరాంతరస్థలరాజ
ధాని సంఘటిలంగఁ దనరి తనరి
గంధనాగ శతాంగ కంఖాణసైనిక
శ్రేణి రంజిల్లంగఁ జెలఁగి చెలఁగి
[3]అంచిత స్థితి శ్రీలచే నతిశయిల్ల
లెస్సగా[4]సంచరించంగ లేక లేక
నిఖిల హితరాక్షసేశితల్ నిందఁజేయ
నెనఁగ రరిగాఁగ సీతఁదెచ్చితి దశాస్య ? 55

కం. [5]నిధి ధరణీకన్యా
జానిసదక నిఖిలదిశల సరిదాకఁగొన
జ్ఞానిగతిన్ సన్నడగం
గా నేటికి కైకసేయఖచరారాతీ ! 56

చ. జలనిధినేయఁ దాలిచిన చండశరాసనశస్త్రధారచే
నలయలకాధినాయక దిగంతఘనత్రిదశారి రాజితే
ఖలతృణలీల నద్ధిఘటికం దెగటార్చిన [6]కోసలేశ స
ల్లలితకథాచ్ఛటల్ దెలియ లజ్జ ఘటిల్లదె రాక్షసాగ్రణీ.

కం. రాక్షససంతతి నెల్లన్
శిక్షించఁగ సకలదిశల శిష్టజనాళిన్
రక్షించఁగ శ్రీహరి దా
నీక్షితి జనియించె జానకీశాత్మతిచేన్. 58

ఉ. చాలదిగేశితల్ సకలచర్యల నచ్చనజేయ నన్నిటన్
జాలినయట్టి నన్నధిక సాహసశక్తిగ్రహించి తెచ్చి కా

1. శతధృతి(గ)కాని పాఠము సరసముగా లేదు. 2. రత్నాకరాంతర (శి). 3. అంచితశ్రీలీలచేచాల నతిశయిల్లి (శి) 4. సంచలించగ లేకకాక (శి) 5. అజ్ఞానగతిఁ నన్నడగంగా నేటికి (శి) 6. చక్రహస్త(ప్రా)శాక లోకము).

రాలయధాత్రి డించిన నగాహితనందన కీశనీతఁ దా
లీల హరించె, నాతనికి లేరిక సాటి జగత్త్రయింం గనన్. 59

కం. నీసరి జేజే తెల్లన్
సీసీ యనఁ జిన్నదాయిచెల్లెల్ గదియన్
నాసిక[1] గిలించె, ఖలా
గ్రేసరఖరచారణారి గీ టఁణగించెన్. 60

ఆ.వె. ఏ నెఱింగి నంత నెరుకగా జేసెద
నియతి నాలకించి నేర్చెదేని
జనకతనయ నిచ్చి శరణన్న దే లెస్స
గాని యన్యచింతఁ గనఁగ నేల. 61

కం. అని యాడినట్టి ణాతన్
గనదాగ్రహదృష్టిచేత గడ కనిచి, దశా
నన నిర్జితారి నిజహిత
జనసంగతి నధికనీతిసంధిల నిలచెన్. 62

వ. అంత నక్కడ 63

ఉ. [2]కంగక తా దయాజలధిగాన ధరాతనయాధినేత, యా
చెంగట నిల్చినట్టి హరిసేనల నేరల నడ్డసేయకే
[3]యంగద కీశకర్త నతిహర్ష గతిం గని చీఱి యన్నిఁటన్
సంగతి నాచరించి దృఢసాహసచర్య గణించి నీతిచేన్. 64

ఆ.వె. అనఘు లంక కేఁగి యాదశాస్యనిశాట
కర్త కధికనీతి కార్యచర్యఁ
దెలియఁజేయ లెస్స, తెలియని నాటికి
తిరిగిరాగరాదె తీక్ష్ణసరణి. 65

చం. అని ఖరరాక్షసారి దయనాడిన యాజ్ఞఁ దలన్ ధరించి, చ
య్యన హరి[4]కర్త లంక కతి హర్ష రసస్థితి సంధిలంగ చే

1. గోయించె (శి.గ) 2. కంగదతా(ము) 3. అంగదకీశకర్త (ము)
4. లంక కర్తకతి(శి)

ర నరిగె కాంచనాసన ధరన్ దనరారినయట్టి కైకసీ
తనయ నిశాచరాగ్రణి నధఃక్రియచే గని నిల్చె నిల్చినన్. 66

వ. ఇట్లు నిలిచిన యంగదహరిం గాంచి లంకానేత యాగ్రహించి[1] 67

కం. నీ యాఖ్యన్ [2]నీజనయిత
నీ యేలిక, నీ చరిత్ర. నీసంస్థలి, య
త్యాయతగతిచే దెలియం
జేయం గదరా ! యటన్నఁ జెదరక యాడెన్. 68

ఉ. నిన్నని గెల్చి తెచ్చి చెఱనించిన క్షత్రియకర్తఁ జేరికే
లన్నిటఁ జెండి రాల్చిన ధరాదితిజాగ్రణి, యడ్డకట్టనన్
జెన్నడ గించినట్టి జగజెట్టి, రసాతనయాధినేతచే
నెన్నికఁ గన్న దాసకరి నేనెఱిఁగించెద నాలకించరా. 69

కం. సారతరశక్తి నిన్నా
కారాగృహధాత్రి నడ్డకట్టిన ఘనశై
లారాతిజాతహరి దా
నారయ నాతండ్రి యంగదాఖ్య నలరితిన్. 70

కం. ఏనెఱిఁగించిన జాడ, ద
శానన కాఁజేసితేని యఖిలశ్రీ సం
తానహితదైత్య సంతతి
కానందక్రీడ గాదె యది యెట్లన్నన్. 71

ఉ. ఆ నరనాథకేసరి దయానిధి గాన నిశాచరేంద్ర ! నె
య్యాన గణించి విన్నరయ నంచిన నీకిట దేహరక్షగా
నే నెఱిఁగించి శీఘ్రగతి నేఁగితి నాచనినట్టి దానికిన్
జానకినిచ్చి ధాత్రి సిరిసంధిల హెచ్చఁగరాదె యన్నిఁటన్. 72

కం. తెచ్చిన దానికి గ్రక్కున
నిచ్చిన యది లెస్స, సీత నీలేని యెడన్

---

1....గ్రహించి నల్దిశల్ గలయ నిరీక్షించి (శి), 2. నిన్జనయిత (ము)

జెచ్చెఱ సంగర ధరణిం
గ్రచ్చఱ నిల్పి నదినీతి గాదే తెలియన్. 73

సీ. అల్క[1]తాటకఁ గెల్చి యతి యష్టి రక్షించె
శిల నాతిగాఁ జేసె, చిత్తజారి
ఘనశరాసన యష్టి గండ్రించె, రాజారి
దండి యడంగించెఁ, దల్లియాజ్ఞ
కాన కేఁగి నిశాటకాంత నాసిక గీసె,
నని ఖరాదిఖలసంహతి నడంచె
శాక్రి ఖండించె, హెచ్చఁగ నార్కిఁ దయ నేలె,
కంనిధి గట్టించె గట్లచేతఁ
దరలి నీదాయి యాతని దండజేరి
లంకచెంగట నిల్చెనే శంకలేక
యట్టి జగదేకకర్త [2]సీతాధినేత
జడత నరలీలఁగాఁ దలంచంగనేల. 74

చం. ఘన ఖరరాక్షసారి కరకాండ ధృతాశనిచండసాయకా
సన దృఢశింజినీ గళితసాయక కీలిదశాస్య! నీ నరా
శనతతి కాననచ్ఛటలు స్రగ్గగజేయని యాదినేధరా
తనయను నీతినిచ్చి సిరిఁదాలిచి హెచ్చఁగరాదె యన్నిటన్. 75

క. అని యాడిన నంగదహరిఁ
గని దశకంధరనిశాటకర్త హృదయసం
జనితాగ్రహ కాలానల
ఘనకీలన్ నింగినిండఁగాఁ దెగియాడెన్. 76

చం. ధరచరహీన! నీజ యితం[3]దెగటార్చగఁ జేసినట్టి దా
శరథి జయించలేని యది జాలదె, చాలక యాతనిగాని సి
గ్గరయఁగలేక నల్దిశల యంత దలార్చి హరించదాసతం
దిరిగితి, యాశ్రయించ జగతీస్థలి లేరె నరేశితల్ గనన్. 77

1. తాటక దెల్చి(ము) 2. సీతాధినేత(శ్రీసరాధినేత(ము). 3. దెగటారగ(ము)

మ. నరనాగత్రిదశక్షితీశతతి దైన్యగ్లాని నేతెంచి కిం
కరలీలన్ జరియించి, చిత్రహయనాగశ్రేష్ఠ గాంగేయ ర
త్నరథాలంకృత తారహార ధనధాన్యశ్రీల రంజిల్లఁగా
సరిగా నాతని నెన్న నేల నహాహా ! చాలించరా యంగదా ! 78

కం. *తనకట నేనఁట శరణని
యననఁట సీతఁ దనకడకు ననిచెదనట తా
ననిచిన నిజనగరికి హా
చనునట యీరీతి యెందు జరుగంగలదే ! 79

కం. గట్లకడన్ నిల్కడలై
చెట్లంగల కాయలెల్ల చెడదని యాహా
[1]కాట్లాడెడి హరిఘటల ని
కెట్లన్నరకీట నిరతి నేతెంచిరిరన్. 80

ఉ. ఎన్నికచే నగస్త్య జటిలేశిత తా నరచేతదాల్చి యా
[2]కన్నిధి ద్రాగినట్ల, ఘటకర్ణనిశాచరకర్తకేచ, నా
యన్నర కీటకాగ్రణి సహాయత, నానగచారిరాజి న
చ్చిన్నగతిన్ హరించి కడజేసి, తినంగలడేల యంగదా ! 81

ఆ.వె. తల్లిదండ్రి కెడసి, దాయాది సంతతి
కెడసి, గహనధాత్రి కేఁగినట్టి,
తాననంగనెంత, తాటకేయారి న
న్నేలరేచి యాడ నేరఁగలఁడె ! 82

చం. అనత కరీంద్ర సైనిక శతాంగ హయస్థితిలేక చందసా
ధనగతిలేక, దాయితన దండయిరా, నలినంఘ్రిచారియై
యని రచియించ నేఁగెనఁట, యానరకీటకకర్త కట్టయా
తనిసిరి నాజయక్రియ, నిదర్శన సిద్ధిగగాంచి యాడరా ! 83

---

* ఈపద్యము కొంత శిథిలమగుటచే పూర్తిగావించితి (ము)ఇట్లు లేఖకర్త.

1. కొట్లాడెడి 2. కంనిధి: సముద్రము.

సీ. కాకచేఁ దాటకి ఖండించె నననేల ?
నలినాతి నిర్జించి నాఁడ దెంత !
హరిశరాసనయష్టి హరియించె నననేల ?
[1]యలకట్టె గంఁడించి నాఁడదెంత !
క్షత్రియారి కడంక సడలించె నననేల ?
నల యగ్రజుని గెల్చినాఁ డదెంత !
తాటకేయ[2]ఖరారి దండించె నననేల ?
[3]యలనిట్టి శాసించి నాఁడదెంత !
యహహా ! నీరధి గట్టించె ననఁగనేల ?
నీళ్లకడ జేసినట్టి యానీటదెంత
తాననఁద నెంత నేనెంత ధరణి జాని
గీటడంచెదరా కీటకీటకేశ ! 84

కం. ఖరరాక్షసకర్తన్ సం
గరధాత్రి జయించెఁ దాటకాహంత యటం
[4]చరయం గూకలు జేసెద
చిరకాల శరీరధారిఁ జెండిన దెచ్చె ! 85

కం. చెట్టందె దాగి, శాక్రిన్
నెట్టన శితశస్త్రిఁ ద్రెళ్లనేసిన యదియే
కట్టడ ? క్షితిధరచారిన్
[5]గిట్టించిన నిందగాక కీర్తి కలిగెనే ? 86

కం. తెలియంగ లంక చండా
నల కీలల సగ్గజేసి నాఁడని హరి ని
చ్చల గణియించఁగ నేలా
[6]యెలుకలఁ జర్చించరాదె యీలాటితరిన్. 87

---

1. నలికట్టె నిర్జించె నాతఁడెంత ? (శ) నాడదెంత ? బములునాతఁడెంత. (శ) 2. ఖగారి(శ) 3. నలినర్థి (ము) 4. అరయక గణనల్ చేసెద 5. గెట్టించిన నిందగాక కీర్తిగలిగెనే (ము) 6. యలికల యర్చించరాదె యింటింటకడన్ (శ)

కం. *హరి లంకకె లంఘించిన
[1]సరణి గణించంగనేల చాలుఁ జెల్లఁ
శరనిధి కీతల కాతల
యరయఁగ [2]నీదె ననరాదె యంగదకేశా ! 88

వ. అని తెగనాడిన దశానన ఖచరారి గంధకరటికై లంఘించిన కేసరి చందాన నెగసి దశశిరః కిరీటశ్రేణి సడల్చి, హాటకశాటికల్ చించి, గాత్రకీలితాలంక్రియల్ జార్చి, యాస్థాన దండనాయక నేతల ఖండించి, ధనధాన్యశాలల్ చెల్లాచెదరఁ జేసి, లంకారాజధానిఁ గలంచి, తిరిగి, (త్రిశృంగాద్రి) స్థలినిల్చి, దాశరథికి సాష్టాంగదండక్రియ లాచరించి, యాద్యంత క్రియ లెఱింగించె నక్కడ 89

కం. అనతాంగద హరి కరతా
డనచర్యన్ గాత్రయష్టి డస్సి కలఁకచేఁ
దన సదనాంత స్స్థలికిన్
జని దశగళ నిర్జరారి జడియఁగ నంతన్. 90

శా. ఆ లంకానగరీస్థలిన్ జనకకన్యాజాని యాజ్ఞారతిన్
జాలా సందడినర్కజాతహరి రాజశ్రేణి శంకించకే
పౌలస్త్యందన ఖేయదంతి శకటీశస్త్రాస్త్రశాటీనటీ
శాలాహాటక దీర్ఘికల్ చెరచి యిచ్చున్ గన్నదేగా గతిన్. 91

---

1. (శి) లో లేదు........జెల్లెల్ (గ) 2. నీదంగరాదె (శి).
* 88 పద్యము తరువాత 'శి' ప్రతిలోగల పద్యములు :

వ. అదిగాక నా యంతఃకరణ స్థితిం దెలియఁ జేసెద

ఉ కానఁగ నేరకే యన్నృతగాథ లికేటికి నాడ నక్కటా
కానఁ జగజ్జనిత్రి తనకేత్తెన దెచ్చిన (యట్టి) జానకీ
జాని కరాస్త్రధారఁ దెగి సద్గతి గాంచెదనన్న కాంక్షచే
నేఁట వింతఁ జేసితి గ్రహించర నాతెఱఁగెల్ల చల్లఁగన్.

కం. జనకజ సాక్షాత్త్రిజగ
జ్జననీయతి సాదరచరయా....
యన.........

తే. గిరిచరశ్రేణి లగ్గకెక్కిన దశాన
నాదితేయారి, డిగ్గంగ నడచి యల్కఁ
జింత హరిజిష్ణగారాతిఁ జేయఁ జీటి
యని రచించంగ ననిచిన నతిశయిల్లె. 92

చం. ఘనదశకంధరాజ్ఞ నతిగాఢ నగాహిత జిష్ణగారి రా
నని రచియించ నర్కతనయాది హరిచ్ఛట లెల్లఁ దాటి చె
ట్లనచఁ, ద్రిశృంగగండశిలలన్ నలినేయఁగ దాళలేక చ
య్యన నిజరాజధానికి నయక్రియచేఁ దిరిగెన్ దృఢార్తియై. 93

కం. *తనకేలన్ దారానం
దనహరిచే దెగినయట్టి దానికి [1]గిరిశా
సనజిత్సురారి యరిజన
హననేష్టి రచించదలఁచి యసదృశగతిచేన్. 94

తే. అహితజన యజ్ఞ కారియై యలరి యజ్ఞ
యందధిక చిత్రజయశరాంగాస్త్రశక్తిఁ
గాంచి, రాత్రించరశ్రేణి గణనఁజేయ
హెచ్చ లయకాల చండచండీశలీల. 95

సీ. చండకాండాసన జ్యాటంక్రియలచేత
గణితనిస్సాణ ధంధణలచేత
యధికదైతేయ రాజాహంక్రియలచేత
[2]చరణసుకట ఝుంఝుణశచేత
గంధగంధిలదంతిగణ ఘీంక్రియలచేత
[3]ఘంటికాయత ఘణఘణలచేత
కరహేతి సంఘాత కషఖంక్రియలచేత
[4]ఘనరథచక్ర ఘర్ఘరలచేత
కదలె హరిజిన్నిశాచరకర్త ధాక
హరిశిఖకృతాంత నైరృత శరధినాథ

1. గిరిశాసనజిచ్ఛగారి (ము) * తననేనల్ 2. చరణకటకఝుళఝుళల
చేత(శి) 3. కలితనిస్సాణఘణంఘణంచేత(శి) 4. ఈ చరణము శి.గ.
ప్రతిలో లేదు.

ఖగధనాదీశ కాళికాకాంత సకల
ఖచర నేతల కట్టెదల్ గాసిఁ గలఁగ*. 96

తే. ఆజి కేతెంచినట్టి శైలారిజిన్ని
శాటక త్తనదల్చి యే శంకలేక
నగచరశ్రేణి గదియరంతయ్యె, దిశల
నింగి చారణ సంతతి చెంగలించె. 97

చం. కటచర ణాధరాధర నఖస్తనకీకస కర్ణనాసికా
నిటల కరాస్యదంత కచనేత్ర కటీర[1]గళాస్యజంఘికా
చ్ఛట లసిధారలన్ క్షితిజ శాఖలచేఁ దెగి జన్యధాత్రి నం
తట కలయంగ ద్రెళ్లిరఁట దైత్యహారిశిత లేక చర్యలన్. 98

తే. ఆరసాతల జలనిధి యచలకెగసి
కలియ దిశలెల్ల నిండిన కరణి నధిక
సాంద్రరక్త తరంగిణీ సలిలధార
[2]కేఁగె నాయాజి హరిసేన లెచ్చరించ, 99

కం. ధృతి నగచర[3]ధాత్రి చరే
శిత లితరేతరదృఢాజి సేయఁగ నెంతే
క్షితిచర ఖేచరతతియా
తతగతి గానంగసాగె నాయాయెడలన్ 100

తే. అల్కచే నింద్రజిత్ఖచరారికలిత
హాయధృతరథాంగసంగతి యంతరిక్ష
సరణి కెగసి, జలంధరచ్ఛాయ నిలిచి
చిరతరాదృశ్య గతి నాజి సేయసాగె. 101

కం. ఆ కటికరేయి నిండిన
చీఁకటికిన్ రెట్టియైన చీఁకటి సేయన్

---

1. గళాస్త్ర (శి) 2. లెసఁగె (శి) 3. రాత్రి (శి).

* 96 నెం. పద్యము 3 వ చరణము 2 వచరణముగా, 2 వ చరణము 4 వ చరణముగా, 4 వ చరణము మూడవ చరణముగా గలవు(శి).

నాకధరిత్రీతలదీశ
లేకాకృతియైన నాత డిద్ధక్రియచేన్. 102

కం. కాలానల చండశిఖా
జాలిక, సచ్ఛ్రుతికల దిశల్ తలకంగా,
లీలన్ గిరిచరనేతల
నేలన్ ద్రెళ్లంగనేసె నిశితక్రియలన్. 103

చం. అని దశకంఠనందన ఖగాహిత కర్త హృదంతరాళ సం
జనిత దృఢాగ్రహోగ్నికణ సంతతి కన్గడలన్ దిశంగధా
రనగరిచారి రాడ్భటల రానెలలన్ హరిసాయకాహతిన్
ఘనతరశక్తిగట్టి తిరుగన్నిజ సంస్థలికేఁగె నయ్యెడన్ * 104

తే. కైకసేయాజ్ఞ త్రిజటదాఁ గగనయాన
సంస్థలక్షిత నందన జక్కఁజేర్చి
[1]రనశరాహతి ద్రెళ్లిన రాచనెలల
[2]గానగాఁజేసి తిరగ యక్కానడించె. 105

వ. అంత. 106

కం. తన జ్ఞానదృష్టిఁ దశరథ
తనయక్షితినేత లర్థి ధరణీస్థజా
రినజాడఁ దెలసి, కలహో
శనజటి యేతెంచె నింగి సరయక్రియచేన్. 107

చం. తదఘనదేహయష్టిఘృణి ధాత్రిదిశల్ కలయంగ నిండఁగా
దన కలకంఠగాననినదక్రియ చక్కఁగఁదేనె లీనఁగా

---

* 104 తర్వాత 'శి' ప్రతిలోగల పద్యము.
కం. తనతంద్రికాజయక్రియ
యనతస్థితిఁ దెలియఁజేయ హర్షించి దశా
ననవిర్జరారి నయగతి
తనయాగ్రణిఁ గౌఁగిలించె దయచేనంతన్.
(5 ఆశ్వాసము 30 పద్యమునకు దీనికి పోలిక గలదు).

1. కర (శి) 2. కనగశాసించి.... 106, 107 సంఖ్యకుగలభాగములు శి.గ.లలో లేవు.

దనకెనయ్యెనయట్టి జడదారి జతల్ గనిసాగిలన్, రణా
శన జటికర్త, దాశరథి సన్నిధినిల్చి గణించె నేడ్తెరన్. 108

తే. అజ ! జగన్నాథ ! నిఖిలేశ ! యార్తరక్ష !
త్రిణయనారాధ్య ! యనఘ ! నీతేజియైన
తార్క్ష్యఖగ నేతఁదలఁచినఘాక, నాగ
శరాహతి హరింపగలదన్న చక్కఁదలఁచె. 109

వ. ఇట్లుఁదలఁచిన 110

సీ. నిండిన ఘాకచే నెగసిన నింగిదా
జిగి యజాండ [1]ఘటకట్ట గడయంట
రెక్కలల్లార్చిన నిక్కిన గఱెల్ల
గెంటు గృధ్రాండజ క్రియలనాడ
నచల కాళ్లానిన యహిరాజశీర్ష సం
తతి కండలగిలి కిందటికె దిగగ
ఘనశీఘ్రగతి దేరఁ జనదాని జాడల
[2]ధరధరాద్రిచ్ఛటల్ తెరలి కదల
హరిశిఖి కృతాంతనైరృత శరధి రాట్స
దాగతి, ధనేశ కాళి కాద్యతుసాధ్య
ఖచర కిన్నర చారణ గణన లెసఁగ
నీడజాగ్రణి యేతెంచి నిశితచర్య. 111

చం. అలయఁగ నింగిదారి జనినట్టి సితాస్య ఖగాది నేతరె
క్కల నెఱిగాలి రానెలల గట్టిన [3]నీల గళాస్త్ర రేఖలన్
గలయఁగ డాకి సంతటనె [4]కంనిధిగాతుగనారసాతల
స్థలికరిగెన్, దిగీశఖగ సంతతి సంతసిలంగ నయ్యెడన్. 112

తే. లేచినిలిచి నట్టి తేరాచనెలసర్ల
గాంచి కాళ్ల కెఱఁగి గణనఁ జేసి,

1. ఘటికట్ల కడనయంట (శి.గ.) 2. ధరాధరచ్ఛటల్ (శి) 3. నీలగ
శాస్త్ర (ము) 4. కన్నిధిగాతగయా(ము)

సరస శేషశాయి సన్నిధి కా యండ
జస్థిరాధి నేత చనియెనకట 113

కం. సారిహయదిశాద్రి చెంగట
హరిగానఁగనైన రాక్షసారాతి ధృతిన్
హరిసేనాసంగతి సం
గర ధాత్రి న్నిలిచె సనయగతిచే నంతన్. 114

కం. తనహిత [1]సంతతి దశరథ
తనయక్షితినాథ కీశతతి చేతన ద్రె
ళ్లిన డానికి గలిగి దశకం
ఠనిశాచర కర్త సంకటక్రియ దేరన్. 115

వ. ఇట్లు సంగర సన్నాహక్రియలఁగఁదలం దలంచిన లంకానేత తెఱం
గాలించి శక్రజిజ్జనని [2]సకల శ్రీలాచ్ఛాదించ నేతెంచిన యాకె సింహాసన
స్థలి నధిష్ఠించఁ జేసి సరసగాథ లాలించి యాసనస్థలిఁ గాంచి 116

కం. జలజాక్షీ నీ హృదయ
స్థలి లెక్కించంగరాని జడయిక నిటరాఁ
[3]దెలిసె, యహో ! నరకీటక
తిలక హరిశ్రేణిచేత ధృతి చెడెగాదే. 117

కం. నన్నచటికి రాననిఁచిన
కన్నియ [4]రాలేనె యలసగతినే తేరన్
జన్నెయని లాలించఁగ
యన్నరహంతఁగని యాడె యాదర సరణిన్. 118

చం. తెలియత సీతఁదస్కరత దెచ్చిన నీయెడ చెట్ల చెంగటన్
నిలిచి దిగీశజాతహరి నేసిన యట్టి నిశాటహంత గా
సిలనరి జేర నేఁగి నతి జేసిన కైకసిఁగన్న చిన్నదా
గలిగిన యార్తి డాల్చఁగనికంజడియెన్ దెఱఁగద్ధి నాకిటన్. 119

---

1. సంహృతి 2. కలగ (ము) 3. తెలిసెన్ హో నరకీటక(శ)4. నేరానె(?.గ).

కం. ఖరహంతయె సాక్షాత్క్రియ
హరయని తెలియంగలేక యాహోధృతి సం
గర కరణదృష్టి నిలిచిన
సరణి కిచటి కరిఁగితిన్ నిశాచరనాథా. 121

చం. అలయక నాకనాథ దహనార్కజ నైర్‌ృత కంధినాయకా
నిలధనదాంగజాద్యఖిల నిర్జర సంహతి, యయ్యజియ్యలన్
గలఁత శతాంగ గంధ గజకాండ నటీనటరత్నశాటికల్
కలయఁగ [1]నిచ్చి సంతటనె, కానక నిక్కితె రాక్షసాగ్రణీ ! 122

కం. ఆనిన యఘచింతన ని
న్నానందించంగఁ జేయ నకట దశాస్యా
యె నెఱిఁగించిన హితగతి
గానక నేర్చెదె చెడంగఁ గడతటి యయ్యేన్. 123

కం. కన్నిచ్చయైన చక్కని
కన్నెల్ నీసదనధాత్రి గల్గగ సాక్షా
త్కన్నిధి కన్యక సీతన్
గ్రన్ననఁ దేనేల జాలిఁ గ్రందఁగ నేలా ! 124

కం. ఏటికి జానకి దెచ్చితి,
యేటికి యారాక్షసారి కెడజేసితి హా !
యేటికి కలిగిన యలజడి
యేటికి యంతరలజేర నిద్ధచరిత్రా ! 125

కం. గట్టిగ జలనిధిగట్టం
గట్టించె, ననంఖ్యలైన ఘనహరిసేనల్
నెట్టన లంకానగరికి
కట్టై నిలిచె, నికనెట్లు కడతేఱంగన్. 126

ఉ. [2]శైలజిదాదిఖేచర నిశాచర సంతతి సంతసిల్ల నీ
యేలిక యద్రిజేశిత యహీన శరాసన యష్టియంఘ్రిచేఁ

1. నిల్చి (ము) 2. శైలజిదారి (శి)

గేలధరించి యెక్కిడిన, గెంటినలగ్గనెలయ్యె నాదయా
శీలి, నరాగ్రణిన్, గణన సేయఁగ నేర్చెద యెన్నిజాడలన్. 127

కం. కానకగిరీశ స్రష్టల
హీనక్రియ నిచ్చినట్టి హేలాశక్తిన్
హాని దలఁచక యెద నెం
తేని రచించంగనేల దితిజాధ్యక్షా! 128

కం. ఆ నరనాయక హేళి ద
యానీరధి గనుక, జనకజాంగన నయసం
ధానగతి నిచ్చి శరణన
గానే రక్షించగలఁ డికన్ జాగేలా. 129

కం. అని యాడి హేతిరీతిన్
తనకట్టెద గాఢనధికధైర్య స్థితి జా
రిన జారనీక చంద్రన
యన యలజడి యడఁగఁజేసి నయగతిదేరన్. 130

మ. తరళాక్షీ! హితశక్తి నీసనయగాథల్ లెస్స యాలించనా
కరయంగా సరిదాక నేనిక నరాహారాళికిన్ గర్తనై
నరకీటాకృతిఁ దాటకారి కతిదైన్యక్లేశ సంక్రాంతి చే
ధరణికన్యక నిచ్చినన్ నగరె దిగ్ధాత్రీ శితల్ కేరికన్. 131

శా. హాలాహాల ధృతిం శిరశ్చటలచే నర్చించితిన్ జక్కఁగా
కైలాసాద్రిఁ దృణాకృతిన్ ధృతకరాగ్రశ్రేణిచే నెత్తితిన్
లీలన్ దిక్తల నేతలన్ గెలిచి జాలిం జెందఁగాఁ జేసి నా
నేలా! నాకిక దైన్యచర్య యటగా యెగ్గించఁగా నందఱల్. 132

కం. తేఁదగ దంగన దెచ్చిన
నీఁదగ దిచ్చెదనటన్న హీనస్థితికిన్
రాఁదగ దెల్లెడ నాఱడి
గాఁదగదీ సరణిలెస్స గానఁగరాదే. 133

తే. చెలియ ! శక్రాది నిర్జరశ్రేణికైన
స్రష్టకైన నగేంద్రజాజానికైన
కాలగతి దాటఁగారాని కతనఁజేసి
ధాత్రి నస్థిరదేహి నై [1]తలడనేల ! 134

చం. అతని రణాంగనస్థలి నయక్రియ సంధిలనేనె గెల్చినన్,
హిత గతితో జగత్త్రితయి నేలెద రాతసకర్త లెన్నఁగా
నతఁడె రణాంగన స్థలి నయక్రియ సంధిల నన్నె గెల్చె నా
హితగతి నైక్యలీల ధరియించెదఁ జిల్లరగాథ లేటికిన్. 135

కం. అని చంద్రహాసి నిజగే
హినికిన్ హితశాస్త్రసరణి యొజఁగంగాఁ జే
సి, నితాంత స్నేహక్రియ
ననిచెన్ రాజగృహధాత్రి కక్కడ నంతన్. 136

కం. కానంగా నీఁగె తెరన్
తేనియత ట్టాగినట్టి తేటన్ ధృతి లం
కానగర స్థలి నిండిరి
యా నగచరసేనలెల్ల నాశ్చర్యగతిన్. 137

సీ. సాలహింతాల రసాల హరీత క్షి
తిజశాఖారాజిఁ జెలఁగి చెలఁగి
కలితరాజగృహాగ్ర గాంగేయ కలశ కే
తనదండ సంహతిఁ దటిఁగి తటిఁగి
రథ్యల ధన ధాన్య రత్న చిత్రికలచేఁ
దారహారశ్రేణిఁ దార్చి తార్చి
దానరాజిత నాగసైనిక స్యందన
కంఖాణ సంతతిఁ గలఁచి కలఁచి
ఘన ఘనాఘన నిర్ఝాడ్య గర్జలెసఁగఁ
జేసి, దితిజాంగనల గాసి చేసి చేసి,

1. తలఁగ.

యచట గాంచిన హరిసేన లచట నచట
లంక నిండంగ సాగి రేశంక లేక. 138

కం. [1]నగరీస్థలి నిండిన యా
యగచర [2]సేనాట్టహాస హాసక్రియలన్
జగడించి దిగ్గ నడచిరి
జగతి చరించంగ రాత్రిచరఘట[3]లల్కన్. 139

మ. ఘన నిస్సాణ ఝుణంఝుణల్, కరటి ఘీంకారక్రియల్, శాతసా
ధన నీరంధ్రతళత్తళల్, గతినటత్కంఖాణహేషల్, నరా
శన నిర్ఘాత దృఢాట్టహాస రచనల్ సంధిల్ల ధాకన్ దశా
స్యనిశాటక్షితినేత ధాటి గదలెన్ హర్షాతిరేకస్థితిన్. 140

కం. ఏతెంచినట్టి లంకా
నేతం గని యర్కజాది నిఖిల హరిఘటల్
సీతానాథాజ్ఞారతి
చేత నిలచి రాశలెల్ల జెదఱఁగ నంతన్. 141

చం. [4]అనిల సఖాకృతిన్ గనలి, యాదశకంఠ నిశాటనేత కాం
చనరథ గంధనాగహయసైనికకర్తల హెచ్చరించఁగా
గనిఁ హరిజాది కీశతతి గాఢరయక్రియ చేత నేఁగి చె
ట్లు నచలశృంగ గండశిలలన్ దిగి యేయఁగ సాగి రయ్యెడన్. 142

సీ. చెక్కలై గాంగ్రడలై చిద్రలై నలిగిఁన
దిశలనిండినయట్టి తేర్లచేతఁ
గడరెక్క లెడలిన గట్లనాగ్రదెల్లిన
గంధగంధిలదంతి ఘటలచేత
గాఢలంఘనల జంగల్గనై ధాత్రి
తలక్రిందైన తత్తళ్లచేత
నాకారలేఖలింతైన కానఁగరాఁగఁ
జతికిన రాతుసచ్ఛటలచేతఁ

1. నగరస్థలి (శి) 2. సేనలఘునాట్టహాస (శి) 3. లంతన్ (శి) 4. అనతన ఆకృతిం (శి).

గలిగి దశకంధరనిశాకర్త సేన
లానఁగాలేక యంచితగ్లానిచేత
నందఱల్కన్న దే నాగనార్త్రి జనిరి
నింగినిర్జర సంగతి నిచ్చగించ. 143

తే. చెక్కలైనట్టి యరదాలఁ జిదికినట్టి
గంధనిజరాజిరేఖల గండ్రలైన
యట్టితత్తళఁ గలిగి దశాస్యసైని
కచ్ఛటల్, గన్నదేగాట గదలె నంత. 144

ఉ. ఆ యెడ గైకసేయ ఖచరాహితకర్త ఖరారిరాయి య
త్యాయతశక్తిఁ [1]దారసిల యచ్ఛశరాసన శింజినీగళ
త్సాయకరేఖలంగనల బ్రగ్గఁగ జేయఁగ సాగిరష్ట ది
జ్ఞాయక సిద్ధసాధ్య ఖగనాగఘటల్ గని దద్దరిల్లఁగన్. 145

కం. [2]అనిలాశననాథ కళా
జనితధరాధీశ హేళి సంగడియై ని
ల్చిన [3]దనదాయిని చక్కఁగ
గని, దాళక యంగయష్టిఁగా దగ నచటన్. 146

చం. ధృతి దశకంఠ దైత్యకరి [4]దృగ్జనితాగ్ని శిఖాకణచ్ఛటల్
క్షితిగగనస్థలిన్ దిశలఁజిత్రగతిన్ గలయంగ నిండఁగా
శతధృతి దత్త చండరశక్తి రయక్రియ నెత్తియేసి యం
చితదితిజాద్రి చారితతి చేష్టలడంగి కనంగ నయ్యెడన్. 147

తే. దశగళత్రిదశారాతి దాయిదాని
రానరసి కాంచి రాత్రిసారాతిదాయి
యతని యగ్రధరిత్రి తా నడ్డగించ
శక్తిదాక నిలాస్థలిఁ జారె నంత. 148

1. దారసిలి (శి) 2. అనిదాశదాథకళా (ము) 3. తనదాయింజయ్యన (శి) 4. దృగ్జనితాగ్ని (శి)

చం. ఎంచఁగ ధాత్రిజారిన యహీన కళాజనితక్షితీశతన్
గాంచి దశాస్య రాత్రిచరకర్త రథస్థలిఁ డిగ్గఁజేరి య
త్యంచితశక్తిచేత, కదలాడఁగ జేయఁగలేక గానలన్
సలచలితాంగ యష్టియయి చాలనదల్చె ఖరారిధాకచేన్. 149

తే. సారథిని డించి హయతతి సంహరించి
తేరిలంద్రెళ్లనేయ [1]దద్ధర్రిల్లి తరల
ఘనకిరీటచ్ఛటల్ రాలఁ గైకసేయ
రాక్షసాగ్రణి లంకజేరంగనరిఁగి. 150



వ. అంత 151



చం. ఎనయఁగ నేలద్రెళ్లిన యహీశకళాజనిరాజహేళి, నా
యనిలజకీశనేత గదియంజని కేలగ్రహించి యాజినం
దనకరర్తచెంత నిండినన్, సనయక్రియలేచిసాగె నిం
గి నిఖిల నిర్జరచ్ఛటల కీర్తనలెల్లెడ నిండి సాగఁగన్. 152



వ. అయ్యెడ దశకంఠలేఖారి దద్ద(ర్రి)ర్రిల్లి రాలిన కిరీటాద్యలంక్రియల్, చినిగిన హాటక [2]నిశాటికల్, గంద్రలైన సారథిశకలాంగ కంకణచ్ఛటల్ గలిగ యద్రిచరరేఖల్ హసించ, నిశాటసేనల్ నశించ లంకానగరిఁ జేరి యంతస్స్థలి కటిఁగి, హితసంతతి యాచ్ఛాదించ సింహాసనస్థిర నధిష్ఠించి తనయార్తి యందరల కెరింగించి కలశకర్ణరాక్షసనేత నిద్రదేర్చ హిత దండనాయకకర్తల ననిచినయెడ 153

సీ. అధికనాసాకందరాయాత యాతాని
లాహతి నింగి యట్టట్టె[3]యదర
నశని సంకాశదంతాగ్రజ కిటికిట
నినద సంతతికి కంనిధి కలంగఁ
గఠిన తంద్రాక్రాంత గాత్రల హరిహరి
కర్తల కట్టెదల్ గాసిఁ జెందఁ

(1. దద్ధరిల) పై పాఠమే (శ). 2. శాటికల్ (శ) 3. యరయ (ము)

జిరతర కఠినాంఘ్రి కరదంత సంసర్గ
ఛిద్రశై నర్థిశల్ చెదరి రాల

విగిడి గాంగేయశిఖరి కె ళ్లగసి చాల
చండచండాకృతి ధరిత్రి సాగె ననఁగ
శయ్యకడ నిద్ర శెందెడి శ స్తకలశ
కర్ణచరారి నీక్షించి కదియ నేగి. 154

తే. అఖిల కరతాడనక్రియ నళనినాద
హారణ కఠినాట్టహాస సంసరణి దండ
దళవిస్వాణ ధణం ధణ ధణల నిద్రఁ
దెలియజేయంగ నేరక తిరిగి తిరిగి. 155

సీ. దహనతీక్ష్ణ కటాహ తైలధారల్ నాసి
కాంతస్థలి దిగంగ నాని యాని,
కైలాస సంకాశ గండశిలల్ దెచ్చి
డాపినె త్తిఁ దటాస నేసి యేసి
గంధ గంధిలదంతి కఠినశృంగాగ్రస్థ
సిత హేతి లతి కేలఁ జెలఁగి చెలఁగి
శక్తిసాయక గదా చక్రాసిరాజిసా
ధనతతి ఖతిచేతఁ దరఁగి తరఁగి
ఝల్లరి తాళవిస్వాణశంఖకాహ
ళాట్టహాసక్రియలచేత నార్చి యార్చి
నిద్ర తెలియంగఁ జేసిరి నిలచి కలశ
కర్ణచరారి యత్యంతగాఢశక్తి. 156

కం. ఈ రీతి వారగించిన
యారాత్రుసకర్తఁ జేరి యతిరయగతి లం
కారా జచ్చటికివి వి
న్నారయ రాననిచె నన్న నల్లన తేచెన్. 157

వ. ఇట్లు లేచి నిలచిన

ఉ. కానకనింగి [1]నీరరథగర్జల తాఁకనిదానఁజేసి గ
ర్జానినిశాకరచ్ఛటలఁ జక్కఁగ దెచ్చి ఖరారిఁ జేరఁగా
యానిజ జాడనిల్పి చని యార్తి ఘటిల్లఁగఁ గీశసేవ లా
హానివదక్రియన్ ఖరఖరారి యదాటల డాగె నయ్యెడన్. 159

ఆ.వె కలశకర్ణ దైత్యకర్త యాయాస్థాని
యన్నకాళ్ల కెఱఁగి యతని యాజ్ఞఁ
దగిన గద్దె నిల్పి తహతహ నల్దిశల్
గాంచి యధిక చిత్రగతి గణించి. 160

కం. నెలలేని రాత్రి జాడన్
గలయఁగ నాస్థానసరణి గానఁగ నయ్యెన్
దెలియఁగ గనిష్ఠ సహజని
కలదా ? లేదా ? యెఱుంగఁగా జేయఁగదే. 161

వ. అనినఁ గలశకర్ణ ఖచరారిఁగాంచి యనేకచర్యల గణియించి దాశరథి దండకారణ్యాని కేతెంచి నకలజటినేతల్ [గీ]ర్తించిన రాక్షస సంతతి సంహరించ శరతి(?) రచియించి లాలించిన, శక్తిచెల్లలైన రక్కసకర్ణ నాసికల్ గీయించిన సరణి ఖరాదిరాత్రించర కర్తల ఖండించిన దండి యది గనక జనకతనయం జేరఁదెచ్చిన నడక, యాంజనేయ హరి దాని జాడ నేతెంచి యతని గేహిని నరసి, శృంగార కాంతార శాఖరేఖలఁ ద్రెళ్లన నడఁచి యక్షక హంతయై, లంకారాజధాని నగ్నిశిఖచే స్రగ్గించి తిరిగి చనిన కరణి, కైకసికనిష్ఠ నందననిశాటనేత యరాతి నాశ్రయించిన దాశరథి గిరిచర సేనలచే గట్లు కట్టు కట్టించి సాలాంగణస్థలి నాగిన నాద్యంతస్థితి దశాసన రాక్షసాగ్రణి యెఱిఁగించిన నర్ధఘటిక చింతించి యన్న కిట్లనియె. 162

మ. అకటా ! కాఁగల కీ డెఱుంగక నిశాటాధీశ నిర్ణీతి జా
నికిఁదేనేల ! ధర న్నరేంద్రతనయల్ నాగాంగనల్ సారక

---

1. నీరజధర (శి. గ.)

న్యక లత్యంతకళాధరల్ సరసయత్న శ్రీల రంజిల్లఁ గా
నక నిష్కారణ ఖేదదైన్య గతిఁ జెందన్ జాలకే యన్నిఁటన్. 163

కం. ఈ నేలకన్న కన్నియ
దేనేల దిశల్ చలించ ధృతి హరిసేనల్
రానేల లేని యలజడి
గానేల నిరర్థనింద గానేలనయా. 164

సీ. చెలియలి కర్ణనాసిక లంటఁ జెక్కె, ఖ
రాది రాక్షసరాజి నాజి నడఁచె

ననిలజహరికర్త నక్షకహంతయై
తెగిలంక యగ్నికిఁ దిండిజేసె.

జానకిఁ దెచ్చినజాడఁ జక్కఁగ గాంచి
యల కీశసంతతిఁ గలసి నిలచె

యల్కసంధిల దాయి యరిజేరఁగా నేఁగఁ
గట్టించె జలరాశి గట్లచేత

సర్థిసాలాంగణస్థలి యాగి హెచ్చె
నని దశానన కాగల యత్న సరణి
తేలనాడిరి యింక నేదీర్చ నాచ
గలవె చాల్పాల దేటికీ గాథ లేల. 165

కం. కానక చేసిన దానికి
జానకి దిరగంగ నిచ్చి శరణని యాడం
గానే రక్షించం గలఁ
డా నరనాథ హరి తా దయానిధిగాఁడే. 166

ఉ. ఎంచ నిశాటసంతతి జయించగ, నాశ్రితదాసరాజి ర
క్షించఁగ శేషశాయి హరిక్రీడ ధరాతనయాధికర్తయై
నించిన కీర్తి సంధిల జనించిన కట్టడి, యాది నాకెటిం
గించె రణాశ నర్థి యడగించఁగ రిత్త చనంగ నేర్చనే. 167

తే. అనిన యతని గాథ లాలించ నేరక
యుల్కు నడఁచి నీతి యతిశయిల్ల
దాయిఁ గాంచి కాంచి దశకంఠ లేఖారి
యందఱ ల్గణించ నాడె నంత. 168

చం. అసదృశ శక్తి నెత్తితిఁ దృణాకృతి నాగరికన్యకాగిరీ
శ సహితతారకాద్రి హరశక్రధనంజయదండదైత్య నా
థ సరిదధీశ కార్థిగతి దాస్యగతిన్ జరియించ నన్నిటన్
వెసఁగితి, నాతగాని కిఁక నేల చలించ నిశాటశేఖరా! 169

తే. ఆజి నీయంతదాయి నాయండ నిలచె
నన్న సత్కీర్తి కెంతెకా కధిక శక్తి
కిన్కచే దాశరథికిని, గీశరథికి
జడపెనా, నీసడించరె జన్నధాత్రి. 170

కం. నిచ్చ నిరాహారక్రియ
హెచ్చిననేనని రచించ కీల్గితినేనిం
జెచ్చెఱ హరధాతల్ నా
కిచ్చిన కాంక్షాతిశయత లేగతి యయ్యెన్. 171

ఉ. సీతయె కంధి నందనగఁ, జెంత ఖరారియె శేషశాయిగా
నీతి ఘటిల్లగా నెఱుఁగ నేరనె! దాచఁగనేటి కాజినే
నాతనిచేతఁ ద్రెళ్లి సనకాది యతిచ్ఛట లందలేని యా
ఖ్యాతిఁ దనర్చి సద్గతికిఁ గాఁచితిఁ జిల్లరగాధ లేటికిన్. 172

ఆ.వె. శిష్టరక్ష నహితశిక్ష సేయంగ దై
త్యారి ధర జనించె నంటి గనక
సీత నిచ్చి లజ్జచెడిన దింతియెగాక
తిరిగి చనఁగ నేరఁ డరయరాదె. 173

వ. అని యాడిన దశకంఠలేఖారిం గాంచి. 174

కం. ఆడదగినట్టి నయగతి
యాడిన తెఱఁ గింతెగాక యకటా నేనీ

జాడల తిరగక నడచిన
యాడికగాదే నిశాచరాళి తెగడరే! 175

## ఆశ్వాసాంతము

కం. చండద్విపతుండ నిభో
ద్దండభుజాదండ పరశుదండితరిపు రా
ట్కాండ శిరో[1]మకుట మణి
మండిత మహితాహవక్షమాదిగ్భాగా! 176

— ముక్తపదగ్రస్తము —

చం. అమలవిచార చారణనగాపహావిక్రమసంగ సంగర
క్రమఘనదక్ష దక్షజనకస్ఫుట మానసధామ ధామవి
భ్రమజితమిత్త్రి మిత్త్రపరిపాలననీతినిదాన దానవా
గమ సురరాజ రాజ కులఖండనఘ[?]రకుఠారభృత్కరా. 177

స్రగ్విణీవృత్తము —

దీనచింతామణీ, దేవతాగ్రామణీ
భానుకోటిద్యుతీ, భార్గవీహృత్పతీ
గాననాదక్రియా, గర్భలీలోదయా
దానవీ భంజనా, ధర్మబోధాంజనా. 178

— గద్య —

ఇది శ్రీమత్కర్పరాచల లక్ష్మీనృసింహ వేంకటేశ్వర వరప్రసాదలబ్ధ సకలై
శ్వర్య ధురీణ శారదాప్రశ్న వివరణ శతఘంటావధాన వినయధునీ
తరంగవిజృంభణాజృంభిత సలలితమృదుమధుర వాగ్వైఖరీఝరీధురీణ
స్థాపితాశేష విశేషప్రసిద్ధ సాహిత్య సారస్వతాశుకవితాష్ట
భాషావిశేష సంస్కృతాంధ్ర నిరోష్ఠ్యోష్ఠ్యాది వింశతి
ప్రబంధనిర్మాణధురీణ మౌద్గల్యమహర్షి గోత్ర పవిత్ర
తిరుమల దేశికేంద్ర పౌత్ర తిరువేంగళాచార్య పుత్ర
మఱింగంటి సింగరాచార్య కవిరాజప్రణీతంబయిన
దశరథరాజనందన చరిత్ర యను నిరోష్ఠ్య
మహాప్రబంధంబునందు జతుర్థాశ్వాసము.

---

1. నమో[?]ము) 2. మణిమకుట(ము)



# దశరథరాజనందన చరిత్ర

## పంచమాశ్వాసము

కం. శ్రీనీళా స్తనకలశా
నూనపటీరాతిరంజితోరస్స్థల ! స
మ్మానిత నామస్మరణ గు
ణానర్ద జనాంహ ! కర్పరాద్రినృసింహా ! 1

వ. అత్తఱిని గథాసరణి యెట్లంటేని. 2

ఆ.వె. అన్నచేత హాటకాలంక్రియల్ శాటి
కల్ గ్రహించి హర్షకంధిఁ దేలి
కలశకర్ణదితిజ కర్త దిశల్ సంచ
లించ నాగ్రహించి లేచి నిలిచె. 3

చం. తన తలఁదాకి నింగి గ్రహతారక లట్టిటుఁ దూలరాల హె
చ్చిన చరణాగ్ర ఘట్టనలచే ధర యల్లలనాడ హస్త చా
లన గతిచే దిశల్ చిదికిలన్ లయకాలదినాధినాథ నం
దన కఠినాకృతిన్ నిలిచె దాక నిశాచరకర్త యయ్యెడన్. 4

కం. ఇనకషణ రత్నకీలిత
ఘననాతిశ్రేణి నేడగడ్త ల్గని చెం
గనజంగడాలై దాటిన
జననాయకసేనలెల్ల జాలం గదిలెన్. 5

ఆ.వె. అంత కంత శతసహస్రలక్షానంత
సంఖ్యలైన యద్రిచారిరేఖ
లెల్ల చెట్లచేత [1]ఱాలచే నేయంగ
[2]సాగి రాశలెల్ల నంచలించ. 6

1. రాళ్ల(ము) 2. సాగిరాసలెల్ల (ము)

వ. అంత. 7

మ. గద కేలన్ ధరియించి చండతర నిర్ఘాతాట్టహాసక్రియల్
చదలంటన్ జరణాగ్రఘట్టనల నాశల్ దల్లడిల్లంగఁ దీ
క్ష్ణదిశల్ దీర్ఘ దృగంచలాగ్నికణ సంక్రాంతిన్ జరించంగ నా
త్రిదశారిం గని కీశసేన లధికార్తిన్ డాఁగె నాయాయెడన్. 8

కం. ఆతరణితనయ గిరిచర
నేత కఠిన[1]శిలలఁ దెచ్చినెట్టన ఖచరా
రాతి శిరస్థ్సలినేసిన
ఘాత నెదం దెలియలేక గడదెలిసి ధృతిన్. 9

తే. కలశకర్ణ నిశాచరకర్త కెరలి
త్రిశిఖసాధనధారియై తీక్ష్ణసరణి
హేళినందన హరికర్తనేసెఁ దాని
కదితిజశ్రేణిగాంచి చెల్లాడి చనఁగ. 10

మ. తనదారిన్ లయకాల చండశిఖ నాదాకంగరాఁ దానిఁ దాఁ
గని లీలం గరశాఖనంది హరిరేఖల్ కీర్తనల్ సేయఁగా
దినరాణ్ణందన కీశకర్తయది యర్థిం గాళ్లచేనాని చ
య్యన గండ్రించె నిశాట సైన్యతతి యాహాకారతన్ జెందఁగన్. 11

కం. తనచేత నిరర్థకగతిఁ
గని దానికి కలశకర్ణ ఖచరారిఘనా
ఘన గర్జలచే నినదం
దనహరి కేలం గ్రహించి తరలని దండిన్. 12

చం. ఘనతరశక్తిచేఁ గలశకర్ణనిశాచరనేత యర్కనం
దనహరిచేఁ గ్రహించి యరతన్ ధరియించి చనంగఁ గాకనా
తని దృఢకర్ణనాసిక లధఃక్రియచే దెగనేసి యార్చి చ
క్క నెగిరెఁ దారకానరణిఁ గాంచి హరిత్తులకర్త లెన్నఁగన్. 13

1. శిఖర (ము)

కం. తన చెల్లెలి నాసిక గీ
సినదానికి లజ్జగన్న చెన్నటి యాహా !
తన[1]యాసలేని చెంగట
జననేర్చెనె యన్నఁ జేర జలియించకటా ! 14

చం. అనతదృగగ్నికీల లఖిలాశల నిండఁగ నిర్జరారి దా
రన దృఢనాశికాగళిత రక్తజలార్ద్రశరీరయష్టియై
కనలి నయక్రియం దిరుగఁగా హరినాయకసేన లార్చి చె
ట్ల నచలశృంగ గండశిలలన్ దెగనేయఁగ సాగి రయ్యెడన్. 15

చం. అలయకరాత్తుసారి కలహాంగణధాత్రి ననేకశస్త్రధా
కల ఘటకర్ణ రాత్రిచరకర్త గదాంచిత దీర్ఘహస్తశా
ఖలఁ దృణలీలలన్ బెరకి కాళ్లదరట్టగ ద్రెంచి యానన
స్థలిఁ జితికించి నాల్కఁ దెగఁజాచిన గండ్రికఁజేసి యల్కచేన్. 16

తే. దాశరథి చండసాయక ధారచేత
కలశకర్ణాదితేయాది కంఠనాళ
సంహరించిన హరికరాళనిహతాద్రి
సరణి ద్రెళ్లె దిగీశితల్ సంతసిల్ల. 17

కం. తలగెంటి సాగరాంత
స్థ్సలి ద్రెళ్లిన యాస్యరంధ్రసరణిన్ జన[2]నీ
రలరంగ నిండ నల్లడ
లిలఁగన రాఁగ గదియసాగె నెన్నఁగ నంతన్. 18

తే. అచ్చరల నర్తనక్రియ లతిశయిల్లె
నింగి నిస్సాణ ధణధణల్ నిండె ఖగల
తాంతసంతతి జెడి తనరారు నష్ట
దిశల వీఁక ట్లుడఁగె నెంతేని గనఁగ. 19

కం. ఈరీతి దాయి దెగ లం
కారా జత్యార్తిఁగలసి గాఢాగ్రహ కీ

1. యాశలేనిచంగట (ము) 2. నీశలరంగ (ము)

లారటితదేహియై త్రిద
శారాతిశ్రేణిఁ గలసి హాళహాళిచేతన్. 20

కం. అతికాయాది నిశాచర
తతి ననిచిన నేఁగి కలన దశరథతనయా
యతకాండాసనకాండా
హతిఁ ద్రెళ్లి దిశాధికర్త లలరఁగ నంతన్. 21

చం. ఘనదశకంధరాజ్ఞ నతిగాఢరతిన్ హరిజిత్తరారి చ
య్యన హయదంతి సైనిక శతాంగహళాహళికల్ నిశాటనా
దనికరసాట్టహాసనినదక్రియ లెల్లెడ నిండిరాగ రా
చనెలలఁదాకి నంతటనె చండరణస్థలియయ్యె నయ్యెడన్. 22

కం. ధృతి దాశరథి సదాగతి
హిత దత్తశరాసనాస్త్ర హృద్యతర రథ
క్షితి నిలిచి నింగి జలధర
తతి యండగ నెరసిచాల తసాతహ లెసఁగన్. 23

ఆ.వె. కలయనాటిరేయి కటికచీఁకటిఁ జేసి
జలధరాళియండ చక్కనిలిచి
కానరాక చండకాండధారలచేత
హరినిశాటఘటల యర టడంచె. 24

చం. అసదృశదానకంతఘనహస్తశరాసన శస్త్ర(ధారచే)[2]రాజిచే
నెసఁగఁగ చిత్తజల్లనఁగ[3]నేసిన దానికి తాళలేక రా
క్షసతతి అంకదారిఁ జనసాగె హరీశిత లెన్నకానకే
నసిజెడి దైత్యహంతకడఁ జక్కఁగఁ డాగిరి జాలి నయ్యెడన్. 25

వ. *అదిగాక 26

చం. కలన నగారి [3]జిద్దితిజకర్త శనైశ్చర ధారచేత రా
నెలల నశేషకీశతతి నెట్టన నిద్రలఁజెంది నట్టిలా

1. 'శ' యందునుగలదు. 2. జేసిన(ము) * 'శ'లో లేదు. 3. జద్ధితిజ(ము)

స్థలి నొరగంగ నేసిన యథాయథలై గిరిశాసనాదిది
క్తులధరణీశితల్ చనిరి తారక లెల్లెడ జారె నయ్యెడన్. 27

కం. గిరిచర సేనల యారా
నెరసర్ల నిజాస్త్రధార నిశ్చలగతిచే
ధర ద్రెళ్ల నేసి దశకం
ధర తనయఖరారి యార్చె దశదిశ [1]లదరన్. 28

వ. అంత 29

తే. తిరిగి నిజరాజధానికి నరిఁగి తండ్రి
కా జయక్రియ లెరుక సేయంగ నలరి
శక్రజిత్ఖచరారికి సరసకనక
శాటిక లలంక్రియల్ దెచ్చి చాలనిచ్చె. 30

వ. అంత నిక్కడ 31

సీ. గనదస్త్రధార ద్రెళ్లిన యందఱఁ గాంచి
యార్తిచే ఋక్షస్థిరాధి నేత
తారాతనయకీశ దశకంఠదాయి రా
ఘవకర్త యనసి నల్జాడ లరసి
యంజనానందనహరిఁ జేరి కీర్తించి
ధనదాశకేఁగి యాడారి కలశ
జలరాశి చెంగటఁ జంద్రాద్రిఁ గని దాని
సంగడి గిరిగాంచి సారశక్తి

దనరఁగా శల్యకరణి సంధానకరణి
యాదియైన క్రియల్ దెచ్చి యఖిలశైల
చారిరేఖల రానెలసర్ల లెస్స
గాఁచి రక్షించరాదె యగణ్యచరిత! 32

---

1. లగలన్ (ము)

వ. ఈరీతి కార్యసరణిఁగాఁ జేయ నీచేతనేగాని యన్యసాధ్యచికిత్స
గాదని యనేక చర్యలఁ గీర్తించిన సంతసిల్లి దాని కంగీకరించి. 33

కం. ఆబుతునగాగ్రణి యా
జ్ఞారతిచే ననిలజాద్రిచారి ధనదధి
క్షీరజలరాశిదారిం
దారాస్థలికెగసి చనియె ధైర్యస్థితిచేన్. 34

కం. అగచారికర్త నింగికి
నెగసి సరగజలధిరేఖ లెల్లఁ గడఁచి చం
ద్రగిరిం గని యాచెంగటి
తగిన శిఖరిఁ జేర నేఁగెఁ దహతహ చేతన్. 35

కం. ఏదారి శల్యసంధా
నాదికరణఘటనగాక యనిలజహారి యా
హ్లాద క్రియచే గిరిని య
నాదరగతి[1] కేలఁ దిగిచి యందిన యంతన్. 36

చం. కని ధృతినడ్డగట్టిన ఖగచ్ఛటల న్నలిఁజేసి యేఁగి చ
య్యన గిరి కేలదాలిచి నయక్రియ సంధిల నాజి ధిక్కరిం
చిన రజనీచరేశితల చండదిగంత నరేంద్రజాత కీ
ర్తన లలరంగ దెచ్చె దృఢధైర్యజయాతిశయస్థితిం దగన్. 37

వ. అంత. 38

ఆ.వె. దాశరథిని యతనిదాయి హరిశ్రేణి
నహహ తెచ్చినట్టి యద్రిచేత
దీటఁజేసి లెస్స రక్షించె నంజనా
జాతకీశనేత సాటిగలరె. 39

వ. అయ్యెడ. 40

1. జేల (ము)

కం. అక్కడ దెచ్చినగిరిఁ దా
నక్కడనే యాంజనేయహరి దించి ధృతిన్
జక్కఁగ దిరిగి నరేశిత
చక్కఁగ నిలచె త్రిదశగణన సంధిల్లఁగన్. 41

వ. అయ్యెడ నింద్రదశఁదరణికానఁగనైనఁ జారణశ్రేణిచే దాశరథి
యతని దాయి హరికర్తల్ దేలినజాడ లాలించి శక్రజిత్తచరారిని
నిందించి లంకానేత యాగ్రహించి 42

ఆ.వె. కలశకర్ణతనయ ఖరనందనాది ని
శాటరాజి నాదశాస్యదితిజ
కర్త యాజిసేయఁగా నంచినంతనె
దాశరథి యరీంద్రతతి హరించె. 43

కం. తన సేనలెల్ల దశరథ
తనయాగ్రణిచేతఁ జెగిన దానికి గిరిశా
సనజిత్తగారి యాగ్రహ
జనితానలరటితహృదయజలజస్థలియై. 44

ఉ. ఆనినకాకచే క్షితిధరాహిత ధిక్చరారికర్త తాఁ
గాననధాత్రి కేఁగి యరిగంజనయజ్ఞరతి న్నటించ లం
కానరనేతదాయి యది గాంచి ధరాంతకరాజహేళికిన్
గానఁగఁ జేయఁజాల నతికాయనిశాచరహంత నంచినన్. 45

కం. అనిచిన యారాచనెలల్
గని హయరథ శక్తిచేత గగనస్థలి క
ల్లన నెగసి యంచితాగ్రహ
జనితానల కీల లెసఁగ సాహసదృష్టిన్. 46

చం. కలితనయాతిశాలి యతికాయ నిశాచరహంత చక్కఁగా
నలరిన యాంజనేయహరి యంసధరాస్థలి నింగినంటఁగా
నిలిచి కరాళశస్త్రికలనేయ నగాహితజిత్తగారి రె
క్కలెడలినట్టి యద్రియన గ్రచఁఱద్రెచ్చె దిశల్ చలించఁగన్. 47

వ. అయ్యెడ. 48

తే. అష్టదిగ్గాజకీర్తన లతిశయిల్లెఁ
జారణానక దంధణల్ సందడిల్లె
నచ్చరల నర్తనక్రియ లలరె దాశ
కంఠరణధాత్రి ద్రెళ్లినకతన నంత. 49

కం. ఘననాదరాక్షసాగ్రణి
యని ద్రెళ్ళినయట్టి జాడ యాలించి దాశా
ననదైత్యకర్త యాగ్రహ
కనదాకృతి [1]లంక జెదఱఁగా ధర యదరన్. 50

సీ. ఘనతరనిస్సాణగణధణంధణలచే
జలరాశి నీరెల్ల గలయసాగ
నసిశాత నిస్త్రింశ శతతళత్తళలచే
గగనరత్నాకృతి గాసిగాఁగ
గంధరాధిక నీలకరటిఘీంక్రియలచే
దశదిశ లంతంత తల్లడిల్ల
ననతకంఖాణ రింఖాగ్రఘట్టనలచే
శేషాహిదృఢశిరశ్రేణియగల
నఖిలనిర్ఘాత ధిక్కారి నిస్సహాట్ట
హాసలీలల [1]నచలాచరారి తలక
సంగరాంగణధాత్రి నే శంక లేక
కైకసేయ నిశాచరకర్త నిలిచె. 51

తే. నిలిచి తనదాయి రాకాసి కలనగాంచి
యాచఁగాలేక చేశక్తినార్చి యేసె
దాని నతికాయవంత యత్యంతదీక్ష
గండ్రికల్ జేసె జేసిన కలఁకరేగి. 52

---

1. కచరాధరారి (ము)

కం. తనగృహిణితండ్రి దయ ని
చ్చిన ద్రిజగజ్జైత్రశక్తి చేదాలిచి స
య్యన నేసెన్ హరి రాక్షస
జననేతల్ చేష్ట లడఁగి జడియఁగ నంతన్. 53

ఉ. కాలధనంజయాకృతి నఖండితచండశిఖాకణచ్ఛటల్
గ్రాలఁగ రాక్షసాగచరకర్తల కన్జెదరంగ నింగిజే
జే లెదఁ దల్లడిల్ల నతిశీఘ్రగతిం జని శక్తిఁ దాకినన్
దాళఁగలేక దాశరథిదాయి ధరాస్థలి ద్రెళ్ళి నయ్యెడన్. 54

కం. ఇల ద్రెళ్ళిన దాయిం గని
కలకం దాశరథి శస్త్రకలన నతని హృ
త్స్థలి నాటఁగ రథహయతతి
నలిగా గంద్రించి యార్చె నల్దిశల గలన్. 55

చం. క్షితితనయాధికర్త తనచేతిశరాసన శస్త్రధారలన్
ధృతి దశకంఠదైత్యకరితే రిల ద్రెళ్ళఁగనేయఁ గాకచే
వతఁ డెదఁ దాళజాలకరయక్రియచే నిజరాజధాని కా
యతగతి నేఁగసాగె హరిదంత నరేశితలెన్న నయ్యెడన్. 56

సీ. ఘనదేహయష్టిని గంట్ల నాటిన జాడ
రక్తకీలాలజాడల దిగంగ
దశశిరః కీలిత తతికిరీటశ్రేణి
క్షితిజారి యెంతయుఁ జికిలిసేయఁ
దగనద్ది నట్టి నిద్దాలైన శాటికల్
గంద్రలై యంతంత గాలినగరఁ
గరదండకాండ నిర్గళితకాండాసన
తీక్ష్ణశస్త్రిక లష్టదిశల కరఁగ

దిగధినాయక కిన్నర త్రిదశ సిద్ధ
సాధ్య నాగాండజచ్ఛటల్ సంతసిల్ల

జెదరి దద్దర్లి లంకఁ జేరంగ నేఁగి
నిజగృహాంతర సంస్థితి నిలిచె నంత. 57

కం. చని యలయిక దేరఁగఁ జ
క్కన దశగళనిర్జరారి కాంచన సింహా
సనధరణి నిలిచి నిజగే
హిని జేరఁగ జీటి కాక లెసఁగఁగ ననియెన్. 58

కం. ఎక్కడనైన గ్గాంచిన
నక్కడనే తాటకారి యాకారకళల్
చక్కఁగ గానఁగ నయ్యెన్
జిక్కితి నా కెద్ది నీతి సితజలజాక్షీ. 59

కం. నాకడదాయి సనీతి న
నేకక్రియలన్ తరించ నెటిఁగించిన నే
నాకర్ణించఁగ నేరక
చీకాకైనాఁడ నెద్దిఁ జేసెద లలనా. 60

కం. హరిదిన సాధన సంహతి
నరయఁ దృఢాకృతిఁగ జేసి రతనికి నాకీ
నరకీటకశరధారల్
సరయగతిం దాకి తెరలసాగెన్ గాంతా. 61

మ. హరి నిర్జించి శిఖన్ హసించి ఖగయక్షాధ్యక్షకాశీశ సా
గరనాథార్కజ దైత్యకర్తల యహంకారక్రియ ల్జార సం
గరధాత్రి న్నలిజేసి తేలిచిన, నా గాఢస్థితిం గానకే
నరకీటాగ్రణి యెంతఁ జేసె నతిదైన్యగ్లానిచే దస్థితిన్. 62

ఉ. అక్కట తెల్లగట్టిల జయక్రియ నెత్తినయట్టి శక్తి నేఁ
డెక్కడ దాగె? ధాక దిగధీశితలం దెగటార్చినట్టి లా
గెక్కడి కేఁగె! ధాత దంపనిచ్చిన యంచితకాంతు తెల్ల హా!
యెక్కడ డాగె? దీని కిక నెయ్యది జాడ నిశాకరాననా! 63

సీ. దక్షారిఁ ద్రిశిఖసాధనలీల హరియించి
యచలాధరారాతి యశని ద్రెగడి
యగ్నిచే శక్తి దృఢాకృతి నిరసించి
యర్కనందన దండహతి హరించి
దైతేయనాయక హేతి తీరడఁగించి
నారథీశితత్రాడ నాదరించి
తగ సదాగతి శీఘ్రతరగతిఁ గారించి
ధననాథఘనగదాధారఁ జెరచి
నట్టి నాయంతరాత్మసాధ్యత్వహేళి
నిట్టి నరకీటనేత దానేసినట్టి
చిన్నగిసినకట్టె లచ్ఛిన్న సరణి
గాడి హృత్థ్సలి యెంతెంతఁ గందసాగె. 64

కం. ఐనట్టి తెరంగెల్లన్
గానీ నాతండ్రి నఖిలకర్త గిరిజా
జాని నియతి నర్పించెద
నానాఁటం గాంక్షలెల్ల నడఁచఁగ నింతీ. 65

వ. అదిగాక. 66

కం. నాకలగానక్రియదా
నాకర్ణనజేసియాది హర్షస్థితిచే
నాకాయజారియనె నెద
నాకలిత కటాక్షసరణి యది యెట్లన్నన్. 67

చం. కలన జయించరాని యరిఁగాంచిన నన్నధికారిఁ జేసి వి
శ్చలతరదీక్ష నిష్టికడసాగ రచించినయట్టి యగ్నియం
దలర శరాసనాస్త్రిహయహాటకకంకటశక్తిజాలి తే
రలర జయింనఁగాఁగల దజాండఘటస్థలి తేజరిల్లఁగన్. 68

కం. ఆతేరెక్కి యరాతి ధ
రాతల కీర్తన లడంచరాదేయన స్నే

హాతిశయత కాశీశిత
యాతతగతి నానతిచ్చె నందఋలెన్నన్.

వ. అని యాద్యంత స్మరణిఁ దెలియఁజేసి జలస్నాయియై హాటక శాటికా
స్రక్చందనాలంక్రియ లార్చి యంధకారాతి నారాధించి యజ్ఞదీక్ష
నిలిచిన నింద్రజిజ్జనని చేరనరిఁగి లంకాకర్తం గాంచి 70

కం. కానంగలేని నీచే
నైనట్లల రచియించి యనయక్రియ లం
కానాయక! యాసాసల
చేనింకన్ దిరుగనేల చెన్నటి నడకన్. 71

ఉ. ఆరయ నీశధాతల దృఢార్చన జేసిన యట్టిదానిచే
నేరి రణాంగనస్థలి జయించితి శక్రజిదాదినాకగే
హారితతిన్ ఖరాహితకరాంతశరాసన శాతశస్త్రికా
ధారల ద్రెళ్లనే సరణిఁ దాళితినయ్య నిశాటశేఖరా! 72

ఉ. ఎక్కడి సృష్టికర్తదయ యెక్కడి యంధక హంత శక్తి, నేఁ
డెక్కడలేని కాక సృజియించఁగ నేటికి యట్టియందఱల్
చక్కఁగ నిల్చినట్టె కడసాగెనె నీ ఘనసాహసక్రియల్
చిక్కఁగ నాఖరారియెడఁ జెల్లఁగ నేరదయా దశాననా! 73

క. జనకజ ఖర నఖ ధారలఁ
జెనకిన కాక ఖచరారి చెడిచేరిన దాఁ
గని దయచే రక్షించెన్
గనక యతని నెన్నరాదె కడతేరంగన్. 74

ఉ. ఎంచగ ధాతృశైల ఎనయేశితలన్ దృఢశక్తిచేత న
ర్చించి హితార్థసిద్ధిగల చెన్నటి రక్కసిఱేండ్ల నెల్లన
త్యంచిత జన్యధాత్రి దెగటార్చె నెరాగడతేర దెచ్చుటన్
గాంచితె రిత్తయాసలట గట్టఁగరాదె నిశాటశేఖరా! 75

వ. అని యాడిన గేహినిగాథ లాలాలించిన కట్టెద నత్తెఱంగెల్ల నరి దాకిన యజ్ఞదీక్షుఁ జాలించి యాయంగన నలిసి యంతస్సలికిం జనియె నంత నక్కడ 76

చం. అని దనదాయిఁ దెల్పిన ఖరారి నరేశిత దీర్ఘనేత్రసం
జనిత జలార్ద్రదేహియయి జాలిఁ జలించఁగ గాంచి కైకసీ
తనయ కనిష్టరాత్రిచరదంతి నయక్రియఁ జేరనేఁగి లా
లన రచియించి కట్టెద కలంక యడంచి నిజేచ్ఛ సంధిలన్. 77

తే. దశగళత్రిదశారాతిదాయి తార
తండ్రి ఋక్షస్థిరాధినేత జతగలసి
యాంజనేయాద్రిచరకర్త నాదరించి
యనిచిరతికాయజిద్రక్షణైక దీక్ష. 78

వ. ఇట్ల నిలిచిన యాంజనేయహరి ధనదదిశ కరిఁగె నంత 79

ఉ. ఆతటి రాజరాజదిశ కద్రిచరేశిత సాగి యేఁగఁగా
నాతలఁ జంద్రహాసి సనయక్రియతోఁ గని తాటకేయ సం
జాతనిశాటనాయక నిశాంత ధరిత్రికిఁ జేరినట్టి లా
గాతఁ డెఱింగి యంఘ్రిజలజార్చనలం దనరించి జాలిచేన్. 80

కం. ఈ నడిరేయి దశానన
రానేటికి రాననిచిన రయగతినేనే
రానే! యేకార్యస్థితి
హైనన్ గాఁజేయలేనె యాదరశక్తిన్. 81

వ. అనిన యతనిం గాంచి సంతసిల్లం జేసి శేషాంశసంజాత రాజ కర్త రక్షించ నాంజనేయహరి ధనదదిశ కేఁగ సాగె. నేకరణి నైన యతనిం దెగటార్చరాదే యని యాద్యంత క్రియ దెలియఁ జేసిన నతం డతని కిట్లనియె. 82

ఆ.వె. తండ్రి ! జననియైన తాటకఁ దెగటార్చె
చిన్నతండ్రి నల్కఁ జే హరించె
కన్న తండ్రి చండకాండ ధారలఁ జెండె
నెనయ నంగ[1] గలదె యుద్ధచరిత. 83

చం. హరి నిరసించెదన్ శిఖిజయక్రియ డించెద గాలిఁ గేరెదన్
శరనిధినేఁ దనర్చెద నిశాచరకర్త నదల్చెదన్ కళా
ధర దిననాథజాత ధనదత్రయి గిట్టెదగాని యట్టిదా
శరథి యదాట నానడక సాగక నేరదయా దశాననా. 84

చం. అనయత సీతఁ దెచ్చినది యాదిగ, రక్కసిఱేండ్ల తాటకా
హనన కరాగ్రకీలిత శరాసన చండతరాస్త్రకీలిచేఁ
దినఁదిన జేసి దానిగడదేరకఁ దక్కినయట్టి యందఱన్
దినఁగ దలంచితే యకట! తెక్కలి నీతెఱఁగెన్న నేటికిన్. 85

చం. ఇలగలరాక్షసచ్ఛటలనెల్ల ననిం దెగటార్చి గట్లచే
జలనిధి గట్టి, యద్రిచరజాల సహాయత లంక చెంగటన్
గలయఁగ నిండె నాకలశకర్ణనగారిజిదాది దైత్యరే
ఖల హరియించఁగాఁ దెలిసి గట్టెద లజ్జ ఘటించనేరదే! 86

ఆ.వె. అనిన నాలకించి యల్కఁ జే లంకాధి
నేత హేతిధార నేయ ననిచి
నట్టిసంజ్ఞ దెలిసి యా కార్యసరణి నం
గీకరించి కదలెఁ గృతకసరణి. 87

వ. ఇట్లా తాటకాతనయనిశాటకర్త చని చని యాంజనేయహరికంటె యతి
శీఘ్రతఁ గదలి తదగ్రస్థలి సకలచేతనగ్రాహియైన నక్రాగ్రణిగల సరసి[2]కడ
కృతక శృంగార కాంతారధరణి జట్యాకృతి నధిష్ఠించె నంత. 88

సీ. అంజనానందనహరికర్త చని చని
యలయికచేఁ దృష్టయైన కృతక

1. నెనంత (ము) 2. కడగిలి (ము)

శృంగార కాననక్షితిగాంచి దిగజారి
యందలి సరసినీరానగరచి
నట్టినక్రాగ్రణి హరియించి శ్రీమైన
దాని నిర్జరరాజధాని కనిచి
నిష్ఠిత జట్యాకృతి నిలిచిన తాటకా
జాతజాతనిశాటనేతఁ గదిసి
కంధరస్థలిఁగరశాఖగట్టి యాస్య
కర్ణనాసికలం దసృక్కాండధార
లడర నలినలిగారాచి యచలనేసి
నిగిడి యక్షయగతి నింగి కెనసి యంత. 89

చం. అనిలజా[1]కేశనేత ననయక్రియ చేతనదాసక్షీర కాం
డనిధియదాట చంద్రగిరి డాసిన నద్రి గ్రహించి యడ్డగిం
చిన ఖగసేనలం గెలిచి శీఘ్రతఁగాఁ జని దారిలో నెది
ర్చిన రజనీచరేశితలఁ జెండి జలస్థలి నేపె నయ్యెడన్. 90

చం. అనిలసఖాకృతిం గలసి యంచితశక్తి ధరించి కైకసీ
జనయిత యన్నతోఁ గదియసాగిన యాతనికేల గట్టి నీ
రనిధి జరీననేయ నహిరాజజగత్స్థలి జారి నిల్చె నా
యనిలజకేశకర్త కహోహో! సరిగ ల్గెదరే జగత్త్రయిన్. 91

ఆ.వె. అంత నాంజనేయహరి దెచ్చినట్టి యా
యద్రిచేత ఖరనిశాట హంత
దాయి లేచి నిలచెఁ ధరణి యాఖండల
దిగ్ధరిత్రి కొంత తేజరిల్ల. 92

వ. అయ్యెడ 93

కం. కని దాశరథి సదాగతి
తనయ హరిం జేర నేఁగి దయచే నాలిం
గనరచనఁ దేల్చె నిర్జర
జనకీర్తన లష్టదిశల సంధిల నచటన్. 94

1 కేశనేన (ము)

ఉ. ఆనగచారి తాఁ దిరుగ నద్రి యథాస్థలి డించ నేఁగ లం
కానరనేత యాజ్ఞ నతిగాఢనిశాచరకర్త లార్చి క
య్యాన నెదిర్చినం గడఁగి యందఱలన్ జలరాశి నేసె తే
ఖానకదంధణల్ చెలఁగ నష్టదిగీశతలెల్ల నెన్నఁగన్. 95

కం. అలయ కరశక్తి నగ్గిరి
నలయక తానాంజనేయహరి యేఁగి యథా
స్థలి డించి తిరిగిరా నెల
కేలన నిలిచెఁ ద్రిదశరాజి కీర్తించంగన్. 96

వ. అంత నక్కడ 07

తే. ఆదశాననరాతుసాధ్యతు పేళి
చింతఁ దనదేశికాగ్రణిఁ జేర నేఁగి
యానతి రచించి యర్హసింహాసనాగ్ర
ధర నధిష్ఠించి యాడె[1]నాదరణ సరణి. 98

కం. ఏ యెడఁ గీటంటంగా
నీయక జయకార్యచర్య లీడేర్చంగా
నీయాజ్ఞ నేటిదనుకన్
ఆయతగతి నలరినాడ ననఘచరిత్రా! 99

చం. కలన ఖరారిచండకరకాండ శరానన శాతశస్త్రి ధా
రల ఘటకర్ణ నాకగ్రహరాజజిదాదిహిత క్షితీశ రే
ఖల ఘన గంధ నాగరథకాండ నిశాట సహాయతన్ ధరా
స్థలిఁ దెగటార్చె నీ సరణి దాచఁగ నేటికి దేశికాగ్రణీ! 100

వ. అని యాడిన లంకానేతం గాంచి. 101

కం. ఇన్నాళ్ల దనక[2]చింతా
కన్నెరగఁగలేక యార్తిగా సాగె నహా!

1. సాదరణ (శి) 2. నింతా (శి)

నన్నడగఁగ నేతెంచితె
చెన్నటి నీకద్ది నడక చెడతఱి యయ్యెన్. 102

చం. గిరిచరసేనలం గలసి క్రీడ ఖరత్రిదశారిహంత రాఁ
శరధిదాటి నీనగరిజట్టిగ నాగిన దింతెగాక య
తురతర శస్త్రధారల నిశాచరకర్తల నందఱిన్ [1]రణ
స్థిర హరియించెనన్న గడతేర్చఁగ నేరనయా దశాననా! 103

ఉ. ఏఱెడఁ గింకరక్రియల హెచ్చరికం గిరిశాసనాది ది
జ్నాయకయక్షసిద్ధఖగనాగ నిశాచరకర్త లర్చనల్
సేయఁగ హంసయానశశిశేఖర దత్తజయార్థ సిద్ధిచే
హా! యఘకారి నిన్నెఱఁగ కాఱడిఁ జెందితె యందఱల్ గనన్. 104

కం. ఐనట్టిదాని కలజడి
యాశంగా నేటికిక నరాశననాథా!
నేనెఱిఁగించినగతి నె
య్యానజనిన కార్యసిద్ధి యది యెట్లన్నన్. 105

కం. [2]క్షితిజానాయకహరి సం
హతిగానఁగనీక యహితహరిణేష్టి నయ
స్థితి ఁడసాగఁగ జేసిన
హితతతి నీకాంతులెల్ల నీడేరుఁ దగన్. 106

చం. అని మతఁ డానతిచ్చిన దశాననరాడసకర్త హర్షియై
తన గృహధాత్రి కేఁగి సహితస్థితి సంధిల నేకతానఁ జ
య్యన నరిగంజనేష్టి దనరార రచించెడిదానఁ జేసి యా
యనశిఖాచ్చటల్ గలయ నాశలనిండఁగసాగె నయ్యెడన్. 107

వ. అంత కైకసీకనిష్ఠతనయనిశాటనేత దెలిసి. 108

కం. తనయన్నయజ్ఞచర్యల్
గని సీతాజాని కెఱుకగాఁ జేసిన యా

1. రుస్థలి (శ). 2. క్షితిధరచరఖేచర సం....(శ. గ).

తనిదాయినెన్ని దినకర
తనయాద్యగచారిఘుటల దగ ననిచె నటన్. 109

కం. చని యజ్ఞదీక్షచే ని
ల్చిన లంకాకర్తఁ జేరి చిత్రక్రియలన్
గని గాసిసేయ దరలక
కనకాచల సదృశధైర్యగతి దనరె నటన్. 110

సీ. కరశాఖలగ్రహించి గండశిల ల్దెచ్చి
యెత్తి శిరశ్శ్రేణి నేసి యేసి
కట్టిన తగటద్దినట్టి శాటికలెల్ల
చించి గంద్రల్గాగఁ జేసి చేసి
ఘనతరకరినాంఘ్రి ఘట్టనక్రియలచే
ధాక కట్టెదయంట దన్ని తన్ని
విఘ్రాత సంకాశ నిస్సహా చండాట్ట
హాస[1]లీలలఁ దెగటార్చి యార్చి
[2]జడకఁగా యాజ్యకలశికల్ చరచి చరచి
నీళ్ల యాగాగ్ని శిఖలార[3]గేళ్ల జల్లి
నట్టిదానఁ జలించక యాదశాస్య
చారదారాతి కనకాద్రి సరణి నిలచె. 111

తే. సకల హరిఘుట లీరీతి చంద్రహాసి
డాపి యెంతెంత దెలిసియుఁ గాసి చేసి
తరలక హిరణ్యశిఖరి చందాన దనర
కలక నిశ్చలచర్యల నిలిచి రంత. 112

వ. అయ్యెడ. 113

చం. అనిలజశాసనక్రియ నయస్థితిసంధిల శక్రజాతనం
దనహరి కైకసీతనయదారయదాటల కేఁగియార్తిచే

---

1. లీలను(ము)లీలలఁదెగనార్చియార్చి(శి) 2. జడకగాంధ్యకలశిఖల్ (ము) 3. నిలిచిచల్లి(ము). 113 నెం. వచనము(శి)లో తే.

గనలగ నీడ్చి తెచ్చి తెగగాసిలఁజేయఁగ యాగదీక్ష చ
క్కనఁ జెడి లేచి నిల్చె లయకాలనిశాకర శేఖరాకృతిన్. 114

కం. నిలిచిన గిరిచరఘట లి
చ్ఛల కన్న దెగాతిగాగ జని కేరఁగ నా
జలజాక్షి లజ్జచే దళ
గళఖచరారాతి గాంచి కందఁగ నాడెన్. 115

సీ. కాకచే నగ్రజకర్తల హింసించి
యగ్రహారస్థిర లాగడించి
కలికి యచ్చర కన్నియల దెచ్చి[1]చెఱఁ దాచి
యజ్ఞాది సత్క్రియ లడ్డగించి
సరసిజాక్షస్థాన శాలలన్ని హరించి
కాసార దీర్ఘికల్ గాసిఁజేసి
అతిథిజనార్చన లడఁగించి శతఖడ్గ
ధారలచే చాలఁ దరిగి తరిగి
[2]శాంతిదాంతి దయానయజ్ఞాన దాన
సంతతాచార నిష్ఠాతిశయతలార్చి
నట్టియఘకారి నీచేతలట్టె నీకె
[3]పాటిదాకెగదయ్యొ నిశాటనాథ। 116

కం. నారాయణ సత్కళచే
[4]నా రాజచ్ఛట జనించె నఖిలాశాలే
ఖారాతిఘటల నందఱి
నారసి గండ్రించె సంశయక్రియ తేలా. 117

చం. అనిఘటకర్ణ[5]శైలజితలాది నిశాచరనేత లందఱల్
చనిరి హాయచ్ఛటల్ నలిసె సైనికకర్త లడంగి రచ్ఛకాం

1. చరనాగి(ము)2. శాంతిచేదాంతి (ము) శాంతిదాంతిదయానయ (శ) 3. సాటిదాకించెగాని నిశాచరేంద్ర(శ.గ.) 4.నారాజచలంజనించె(శ) 5. శైల దజిదాది (శ).

చనరక్షరేఖ లీడిగిలె జండగజేంద్రఘటల్ నశించె నిం
కనయిన నీర్ష్య డించి నయకార్యగతిం గనరాదె చక్కఁగన్. 118

ఉ. ఆతతకీర్తి సంస్థలి దయారసకంనిధి యార్తచేతన
త్రాత ధరాధరేంద్ర ధృతిదాశరథక్షితినాథ హేళికిన్
[1]సీత సనీతినిచ్చి నతిఁ జేసి గణించిన నీహ్యదిష్టకాం
క్షాతిశయక్రియ ల్ఘటనయయ్యెడి చిల్లరగాథ లేటికిన్. 119

శా. హేలాసంగతి నాంజనేయహరి తా నేకాకియై చేరి తా
నీ లంకాస్థలి నెంతచేసె నది నాఁ డీక్షించరే యన్నిఁటన్
యాలాగంతటికన్న ధైర్యనయచర్యల్గన్న కీశచ్ఛటల్
నేల న్నల్దిశ లంతరిక్షసరణిన్ నిండారినా రారయన్. 120

ఆ.వె. ఈ నెలంత నతని కిచ్చి లంకాస్థలి
దాయికిచ్చి గహనధాత్రి కేఁగి
తేనిలెన్న యట్ల లేనినాటికి దాశ
రథిశరాగ్ని ద్రెళ్ల రాదె యాజి. 121

కం. అని తేర్గడ నెదిరించిన
దన గేహిని జేరఁజీటి దశకంఠనరా
శనకర్త యాగ్రహ స్థితి
గననీయకయాడె నీతికార్యాసక్తిన్. 122

కం. జానకి యేసరి ధరణీ
జానియె దృష్టాంత శేషశాయిగ యాహా
యేనెఱుఁగనె నెలతా ! య
జ్ఞానినె నీయంత శాస్త్రసరణిఁ దెలియనే. 123

చం. కనికని నేరకే యనృతగాథల నాడ నదేటి కాజి నా
యన శరధారలం దెగి దిగంత నరేశితలెల్ల నెన్నఁగా
సనకసనందనాదియతిసంతతి నందఁగరాని చెంకికిన్
జనియెద గాన దీనికిక శంకిల నేటికి నీరజాననా ! 124

---

1. సీతను నీతినిచ్చి నుతిజేసి (కి. గ.)

కం. ఈలంక యేల ధనధా
న్యాలంక్రియ లేల కరటిహయరథ రాజ్య
శ్రీ లేల నీసహాయత
జాలించఁగ రాదె నీరజాతదళాక్షీ! 125

ఆ.వె. ఎల్ల దిగధికర్త లిట దాస్యచర్యల
జనశతార్ధలక్షసంఖ్యలైన
యేండ్ల దనక ధరణి యేలినే నతనికి
శరణనంగ నేల హరిణనయన. 126

చం. సతి! యచలాహితాద్యఖిలచారణరేఖల నేల నేసిరా
చితి నరియెన్న నేల సరిచేయ జగత్త్రియి నేర రెన్న, హా!
యతనికి నేనె సాటి యతఁ డారయ నాకిట సాటి సాహసా
యతధృతి సాయకాసనదృఢాగ్రహనిగ్రహకార్యచర్యలన్. 127

చం. అని రజనీకరానన గృహాంతర సంస్థలి కన్య చక్కఁగాఁ
దనయెద కాంతు లెల్ల సహితస్థితిసాగ నియట్టి దానిక
త్యనత గిరీశ ధాతలఁ దృణాకృతిఁ గా హసియించె నాదికా
శన సదృశాచ్ఛతారకరసారససంస్థితి ఖడ్గశాలియై. 128

సీ. శాంకరీ శంకర స్థలియైన రజతాద్రి
హత్తంగ గెంగేల నెత్తినాఁడ
నచలాహితాది దిశాధినేతలచేత
నానతిఁ గని కాన్క లందినాఁడ
లలితసాహసధైర్య[1]లక్షణం దనరార
సిద్ధిచే సత్కీర్తిఁ జెందినాఁడ
సాధ్యసిద్ధాండజసారణాహిశ్రేణి
దాస్యక్రియ జరించఁ దనరినాఁడ
నట్టియంత నారాక్షసాధ్యక్షు పోలి
నిట్టి నరకీటకాగ్రణి యెంత జేసె

1. లక్షనందనజాల (ము).

సృష్టిరక్షణకర్త యాస్రష్టకైన
కాలగతిఁ దాటరా దింక కలఁగనేల. 129

తే. ఐనదానికి చింతసేయంగ నేటి
కధికసారంగ సైనిక హయ శతాంగ
సంతతి ఘటిల్ల నరకీశసంతతికిని
జడిసినను నీసడించరే సకలదిశల. 130

వ. అని యహంకరించి గద్దించి నల్దిశల్గలయనీక్షించి కరధృతచంద్రహాసలత యల్లార్చి జగజ్జననాంశ కరణ దండధారి కెరలి లేచి జలస్నాయియై హాటకశాటికల్ దాల్చి యష్టదిశాకర్తల లిఖయించిన యందియ నెలకాలఁ గీలించి హితరాక్షస సంగతి సరసాన్నహార సంసిద్ధి నలరి యానంద కందళిత హృదయస్థలియై సదాగతి తిరస్కార రయగతిఁ గంఖాణసంతతి ఘననీలాచల సదృశగంధ గంధిలసారంగ సంహతి నిర్జరగిరిశృంగ సంకాశగాంగేయ శతాంగాళి యసదృశసాహస సైనికరాజి రంజిల్ల శంఖకాహళతాళానకఢక్కానిస్సాణ ఘంటానాదక్రియల జేజేల్త్రుళ్లి డిల్ల శరశరాసనకటార శక్తి హలచక్రఖడ్గగదాది సాధనచ్ఛటల్ కరశాఖల సంధించి హాళిహాళి గేలం జెంగలించెడి దండనాయక ఘటలం దనరిన రాజసదనాంగణ ధాత్రి కేతెంచి దశకంఠలేఖారి నిలచి. 131

సీ. శశికళా సంఖ్యాతియై చక్ర సంహతి
గా నల్దిశలనైన గాన దాని
ఋక్షాజినచ్ఛన్న దృఢసహస్రహయాళి
చే నటక్రీడ గర్జిలెడి దాని
గాండకాండాసనఖడ్గాదినిఖిల సా
ధనరాజిచే సిరిఁ దగినదాని
ఘనతరశతలక్షగలఘంటికా శ్రేణి
చే నంతకంత రంజిలినదాని

జారణాహీనరాధీశ జైత్రలాంఛ
నాచ్ఛతర కేతనత్రయి నలరినట్టి

దానిఁ గనకాద్రిజాడ హెచ్చైనదాని
చేరదనసెక్కి నిలిచె నా దితిజకర్త. 132

కం. నిలిచి హితదండనాయక
హాళహాళికలచే నిశాచరాగ్రణి లంకా
స్థలిఁ గడచి హరిహయాశా
చల కందరనగరి హేళి సరణిం జనియెన్. 133

కం. లయకాలకాలదండ
క్రియచే రణధరణి దైత్యకేసరి చాలా
జయకాంతు నిలిచె నిర్జర
చయ చిత్తతచే[1]ఘనాతిశాతాసియనన్. 134

సీ. ఖచరారినాయక కాసారసారంగ
దహననీరజకాండ ధార్తరాష్ట్ర
దినకరనందన ధృతిలతికాధాత్ర
[2]చారణాహితశాత చండకిరణ
జలధిధాత్రీనాథ జగతిధరాశని
యనిలాంధకార రాకాద్రితనయ
యతురాజానిలాహార కేకి శ్రేష్ఠ
చంద్రశేఖర తటీ సాంద్రతటిని
యనికశాధర దితిజ సంహతి గడంగి
రెండెదలఁ జేరి ఘనఘనాఖండ నాద
కఠిన గద్యాది గాథల గణనసేయ
నిలిచె ననిదారి దశకంఠనిర్జరారి. 136

వ. ఇట్లు లయకాల చండకరాకృతి చంద్రహాసధారియై తేజరిల్లె నయ్యెడ

కం. రెండెడల దితిజకర్తల
జాండస్థలియగల ఢక్కల ఖలక్రియలన్

1. ఘనాతి(ము) 2. శారణాహిత శారద చండకిరణ(ము)

జండతర హస్తశాఖల
నిండఁగఁ జరచిరి దిశాధినేతల్గలఁగన్. 137

తే. అసదృశ స్యందనా ధ్యాసియై దశాస్య
[1]నిర్జరా రాతి గననయ్యె నింగిదాక
దాశరథి యంఘ్రిచారియై ధరణి నిలచె
దానికిని లేఖసంతతి తలఁక నంత. 138

చం. అని కడదండి నిల్చిన దశాననరాక్షసకర్త సాహసా
త్యనతకళ ల్గణించి హృదయస్థలిఁ [2]గంధి ధరాధరారి తా
ననిచె నిశాతసాయకశరాసనకీలి కరాళ శక్తి సా
ధన హయశాలి తేర ధనధాత్రికి సారధిచేత నయ్యెడన్. 139

కం. ఈ రీతిం దెచ్చిన తే
రారసి చేరఁ జని రాక్షసారాతి జయ
శ్రీరంజిల్లఁగ నెక్కెన్
ధార నసదృశాచ్ఛదృష్టిఁ దనరఁగ నంతన్. 140

చం. అలయక రాక్షసాహిత దశాస్య నిశాచర కర్త లిద్దఱల్
గలసి యహీన సారశర కాండ శరాసన దీర్ఘ శింజినీ
గళిత కరాళ శస్త్రికలఖండిత చర్యలగాడగా నసృ
గ్జల కణధార లెల్లెడల జారఁగ నాజి రచించి రయ్యెడన్. 141

కం. నింగిన్ నిర్జరకర్తల్
జంగిలియై గణనసేయ సాహసగతిచే
జెంగక యాగ్రహదృష్టిన్
దంగక కలహించి రధికతరసంధిలచేన్. 142

ఉ. ఆతటి దానవ స్త్యజటిలాగ్రణిరాఁగని సంతసిల్లి య
త్యాలత శక్రనీలరచనాచ్ఛరథస్థలిడిగ్గి జానకీ
నేత ధరిత్రిసాగిలి నుతించిన యాతని యంగయష్టికా
ఘాతలడంగరాచి హితకార్యరసస్థితి నాడెఁ జక్కఁగన్. 143

---

1. నిర్జరాహతి(ము) 2. గంధధరారితా(ము).

కం. అనఘదిననాథ సంతతి
జనియించితిగనక యతనిఁ జక్కఁగఁ గీర్తిం
చినఁ దనతేజది నీక
ల్లన హతగతి నీయఁగాఁ గలండని దయచేన్. 144

తే. ఆఖరారాతిచెంత డాయంగఁ జీటి
కార్యసిద్ధిగ నందఱ ల్గణనసేయ
దినకరాకర్షణస్థితిఁ దెలియఁజేసి
ఘటజజటికర్త తనయిచ్ఛఁ గదిలె నంత. 145

వ. ఇట్లధికతేజస్థితిఁగాననైన దాశరథిం గిరిచరసంతతి యార్కినిలిచిన యతని హృదయస్థలి యెఱింగి. 146

కం. తనసేనలచే నినసం
దనహరి రణకార్యచర్యదాలిచి ఖరగం?
జన(?) నికట ధరణి నిల్చిన
గని యాతని దృష్టి దెలిసి గ్రచ్చఱ ననియెన్. 147

కం. ఇల హరిసేనలచే
గళఖచరారాతిఁ జేరి కలహించంగా
దలచితి నర్కజ! యాహా-
నిలిచిననేగాక దృష్టి నిలిచెద రేరల్. 148

ఆ.వె. ధాతచేత కాయజాతారిచేతఁ దా
నందరాని కాంతు లందెఁగాన,
నచల నాకె కాని యన్యసాధ్యచికిత్స
గాదయా హరీంద్ర గణనసేయ. 149

కం. అదిగనక చంద్రహాసిం
గదనస్థలినేనెదిర్చి కలహించంగా
హృదయాహ్లాదస్థితిగా
గదలక దృష్టించరాదె ఖరకరతనయా, 150

కం. అన నాలకించి యగచర
జనకర్త ల్గగన సరణి సకలాశల శ్రృం
గనగాగ్రశాఖలన్ ధృతి
గన సాగిరి నిలిచి చిత్రగతి నయ్యెడలన్. 151

తే. దృఢతర సహస్రకర ఘృష్టి తేజరిల్ల
జానకీజాని నీక్షించి చంద్రహాస
ధారి యాగ్రహాశిఖిశిఖల్ ధరణి నిండ
ఖేచరనిశాటతతి యాలకించనాడె. 152

చం. అనఘ! జగత్త్రయిం గలచి యాడితి నాకెదిరించనేరలం
గనినదిలేదెకా! యయిన గాంచితి నిన్నతి సాహస క్రియా
ఖని, నికతేలకే నిలిచి కాలహరీంద్రకరాశసాయకా
సన శరలేఖలం గలన స్రగ్గగఁజేసిన లెస్స యన్నిటన్. 153

కం. నాయెడరాక్షసనేనల్
నీయెడ నాదిత్యఘట లనిందిత గణనల్
సేయఁగఁ జండతరాజిం
జేయఁగ హ్యాత్కాంక్షలెల్ల సిద్ధించుగనన్. 154

వ. అనిన యతనిగాథ లాలించి దరహసితాననస్థలియై దాశరథి యంగీక
రించిన దానికిఁ జంద్రహాసి యాగ్రహదృగ్జనితదహనకీలాకణచ్ఛట
లెగయ నశనిసదృశాట్టహాస నాదక్రియల కజాండస్థలి కలసిచలించ
కెల్లార్చి గద్దించి నల్దిశల్ గలయ నిరీక్షించి 155

సీ. కాంచనస్యందనఖరచక్రహతిచేత
శేషాహితల లెల్లఁ జితికిలంగ
సాయకాసన ఘనజ్యాటంక్రియలచేత
జలరాశియెంతంత కలకసాగ
గాఢకేతనదండ ఘర్షణస్థితిచేత
గగన తారాశ్రేణికంధి రాల
కంఖాణ నిశిత రింఖాఘట్టనలచేత
నచలారి నలినలియై చెలంగ

నళని సంకాశ కఠినాట్టహాస సరణి
దళహరిత్కర్త లలజడి దద్దరిల్లఁ
దరలి దళకంఠలేఖారి ధాక దాకి
తాటకేయారి నలదండధారి దారి. 156

ఉ. అన్నరకర్తతేర దితిజారి రథస్థలిఁ దాకెఁ దాక న
క్లిన్నగతింధరిత్రి దిరిఁగెన్ హాతిచే దిశలెల్లఁ గాసిలెన్
కన్నిధి నల్గడల్ చెదరె ఖస్థలి తారకలన్నిరాలె నా
కిన్నెర సిద్ధసాధ్యఖగఖేచర సంతతి దద్దరిల్లగన్. 157

కం. అనలకణచ్ఛట లెగయఁగ
ననిలరయక్రియలచే ధరాధీశనరా
శనకర్తల యరదాలం
టనదాకనజాండ[1]గలసినట్టయ్యెనటన్. 158

కం. హరి హరి గలసిన జాడల
కరటికరటి దారసిలినకరణిం జాలా
గిరి గిరి నెరసినగతి దా
శరధి ఖగారాతి యెదరి జగడించి రటన్. 159

కం. ఇతరేతరకరగళితాం
చితచండశరాసనాతిశితశరధారా
క్షతశాస్త్రశస్త్రికదన
క్షితియయ్యెం ద్రిదశరాజి గీర్తించంగన్. 160

ఉ. ఆ నరఖాదనాగ్రణి నయక్రియ సంధిల నంధకార నా
గానలకాండధారల జయస్థితి నేయఁగ గాంచి జానకీ
జాని దినేశతార్క్ష్యఘన శస్త్రికలం దెగనేసి యార్చె తే
ఖానక దంధణల్ చెలఁగ యష్ట దిగీశతతెల్ల నెన్నఁగన్. 161

కం. ఆనిర్జరారిఁ జేసిన
దానికి నన్నిఁటికి నన్ని తగఁజేయంగా

1. గలసెటట్టయ్యె (ము)

దీనాకృతిచే నేదియు
గానక దశకంఠదైత్యకర్త కలంగెన్. 162

తే. [1]అజతనయనందనాగ్రణి యంగయష్టి
చింతగింజంత యెడలేక చిత్రసరణి
తగల నెసఁగించె దశకంఠదైత్యకర్త,
సరగ నీరీతి గలహించసాగి రంత, 163

కం. కరరాతసగంజనసిత (?)
శరధారల్ కైకసేయ శక్రాహితకం
ధర లెటేఁగించఁగ నా తీ
రరసి గణించంగసాగి రందర లంతన్. 164

ఉ. ఆనరనాథకేసరి శరాహతి నిండఁగ నాట నిస్సహా
గ్లాని ధరించి రాత్రిచరకర్త యహంక్రియ సంధిలంగ[2]గా
(?) శీనదయాంతసంత్రిశిఖహేతి గదల్చి తెరల్చి యేసె ఘం
టానినదక్రియల్ గిరిఘటల్ నటియించఁగ నింగి గాసిలెన్. 165

చం. అదికడగాకరాఁగని ఖరారినగాహితదత్త శక్తి న
ష్టదిశల నిస్సహాగ్నికణసంహతి రాలఁగ నేసె నేయఁగా
నెదిరి సహస్రవృష్టిని గ్రహించి నరాశనకర్త లీలచే
నెదగ హరించె నాత్రిశిఖహేతి నిరాకృతిగాగ నయ్యెడన్. 166

తే. ఏసి యంతటఁ జాలక యీర్ష్యరేగి
దాశరథిశస్త్రికలచేత థాకసేయ
దాని కలిగి నిశాచరధరణిజాని
తలకి గద్దించి నిరసించి తత్తరించి. 167

చం. ఇనశశితారక ల్చెదర నెల్లదిశ ల్చలియించ శాక్రప్రా
దినికెనయైన శస్త్రికధృతిన్ ధరణీతనయాధిరాట్పరా

1. అదితనయనంగ (ము) 2. పాఠమునేలపణియ్యము.

సనఘనయష్టి గండ్రలయి జారఁగనేసె నిశాటసేన ల
ల్లిన చెలగంగ నిర్ఝరకళల్ దరుగన్ హరిరాజిగాసిలన్. 168

వ. అంత. 169

ఆ.వె. కలశజర్షి దత్తఘన శరాసనయష్టి
సంగ్రహించి నారిశమ్రిఁ జేర్చి
జనకధరణినాథజాజాని యత్యంత
చిత్రసరణి నాజిఁ జేయసాగె. 170

వ. ఇట్లు నిశాఽహఃకాలచర్య లెడతెగక షష్ఠ దినసంఖ్యల్ దాటిన
నాటి చెంత. 171

కం. అని యతని శిరఃకరతతి
గనియల్ సేయఁగ నిగిర్చగా దాశరథిం
గని కలశకర్ణసహజా
తనిశాచరకర్త నయహితస్థితి దేరన్. 172

వ. ఇట్లనియె. 173

కం. క్షితినాథ ! సంశయించక
యతని జఠరధాత్రిచార ణాహారరస
స్థితి తనరె నననక సదా
గతిహిత శరధార నేయఁగా లెస్స యనన్. 174

ఉ. అన్నరనాథకేసరి శరాసన సంఘటితాగ్ని శమ్రిన
చ్ఛిన్న దశాననత్రిదశజిజ్జఠరాంతర సంస్థితాదితే
యాన్న [1]రసగ్రహక్రియ నయస్థితి సంధిఁ జేయ నాత్రినా
చెన్నటి రిత్తయై నిలిచెఁ జెంగటి కీశఘటల్ హసించఁగన్. 175

వ. ఇట్లునిలిచిన చంద్రహాసింగాంచి 176

కం. ఇన్నాళ్లు దనుక నేనిఁట
చిన్నెలకై తెగక యాలసించితి నింకన్

1. రసంగ్రహా (ము)

నిన్నని గీటణంచంగ చన
దిన్నంగ దృష్టించ రాదె ధృతి యని యల్కన్. 177

మ. జననాథాగ్రణి కార్యసిద్ధిగన సచ్ఛస్త్రాగ్నిహతిన్ కైకసీ
తనయేంద్రాహితకర్త నేసినయెడం ధాత్రీస్థలిం ద్రెళ్లి ధా
రననింగి నగ్నిహరాజి తల్లడిల తారల్ రాల దిగ్దంతిదీ
ర్ఘనినాదక్రియ లెచ్చ కంధికలంగన్ గట్టెల్ల నల్లాడంగన్. 178

వ. ఇట్లు ధరణీస్థలిం ద్రెళ్లిన 179

సీ. సనకాది యతిరేఖ లెనసిన యానంద
జలరాశిం దేలిరి శైలహాగ్ని
తరణినందనదైత్య సరిదీశకారాజ
రాజకాళీక కీర్తన లెసంగె
తాళానకనినాద కీలల కచ్చర
చానల నృత్త సంసరణి నలరె
ఖచర నిస్సాణ సంఘాత ధణంధణల్
గ్రాలె నల్గడల పీక ట్లడంగె

జల్లనై గాలినిండంగ జల్లె ఖగల
తాంతసంతతి జెడి హెచ్చె యదితిజర్షి
శ్రీధరాంకిత గీతికిన్ జేయసాగె
యద్దితిజకర్త ద్రెళ్లినయట్టి కతన. 180

వ. అత్తఱి సనకాదియతిసంతతి శతానందాదినిర్జరశ్రేణిశక్రాదిదిగీశసంహతి
యతకిన్నరసిద్ధసాధ్యనాగ చారణాండజరాజి యంత స్థలిడిగ్గి దాశరధికి
సాష్టాంగ దండక్రియ లాచరించి లేచి నిలచి. 181

సీ. జయజయశ్రీకాంత జలజాండకకరండ
సంతాన కలితదేహాంతరాళ
జయజయ నిఖిలేశ జనకకన్యానన
జలజాతసంచరచ్చంచరీక

జయజయ సాయకాసన నిర్గళిత చండ
కాండఖండిన దశకంఠకంఠ
జయజయ శేషాహిశయన కాంచనచేల
రత్నకిరీట హారగణశాలి
జయహృషీకేశ ! జలజాక్ష ! జయ యనంత !
జయ జనార్దన ! జయశార్ఙ్గి ! జయగదాంక !
జయజయహిరణ్యరాక్షసజఠరదళన !
నర్తితప్రహ్లాదినీశాత నఖరశిఖర ! 182

తే. ఆదిగాథల్ గ్రహించి లేఖారియైన
తన్కరాగ్రణికంనిధి దాగఁదెలిసి
జలచరాకృతి నాతని సంహరించి
ధాత కన్నింట నిచ్చితి దయ యనంత! 183

తే. *శైలహారికిఁ గీడైనలీలఁ దెలిసి
క్షీరనిధిఁ ద్రచ్చ గిరిఁదాల్చి కీర్తి హెచ్చ
సరగఁ దలదాచినట్టి యాసరణి నిల్చి
చెడనిక్రియ చెలఁగఁజేసితి శ్రీసనాథ ! 184

తే. ధరణిని హరించదలచిన దైత్యనేత
నంటి కిటిరీతి హరియించి హర్షగతిని
యచల నిజగతినెత్తిన యాఖ్యలెన్న
నేర్చగలరయ్య యేరైన నీరజాక్ష ! 185

ఉ. రేగినయట్టి కాంచనశరీర నిశాచరకర్త యీర్ష్యచే
సాగిట ధిక్కరించి తనసంతతి చిన్ననంచ దల్చఁగా

---

*184వ పద్యమునకే 'పాఠాంతరముగా' ఈ పద్యము'ము'లో గలదు

చం. "దితితనయాదితేయతతి దెచ్చి గిరిన్ ఘనచక్రికాటనా
యతగతిగట్టి రెండెడల యక్కఱదీర్చఁగ జాలినంతనే
యతిరయశక్తిచే జలచరాకృతిలీల ధరించి దాని యా
తత కఠినాంసధాత్రి కడఁదాల్చిన నీతెఱఁగెన్న నేటికిన్."

నాగడియందె శ్రీనృహరియాతనినాకృతిజెందినట్టి నీ
లాగెడజేర్చి లెస్సఁగ దలంచఁగ గల్గిరె యెందరే నటన్. 186

చం. కడఁగి సహస్రహస్తఘనకాయఖగాహితనేతతండ్రి నా
గడగతి కాంతుచేఁ దిరియగా జని ధాత్రి త్రిరీతి కాళ్లచే
నడిఁగి గ్రహించి యాదితిజజాగ్రణి కిచ్చినయట్టి నాటి నీ
నడక గణించఁగా గలరె నాకధరాతలనాగసంస్థలిన్. 187

చం. నిలిచి సహస్రహస్తనరనేత యడాటలకాక నిద్ధరన్
గల నరనాథ సంతతిని గండ్రికలై తెగనేసి తండ్రికిన్
గలఁగక రక్తధారలనె కార్యగతిన్ రచియించినట్టి నీ
కిల సరిసేయఁగాగలరె యెన్నిక లెందఱైన శ్రీహరీ. 188

చం. ఇట దశకంఠదైత్యకరి యెన్నికగా ఘనకాంతులంది తో
గటికితనాన నందఱల గారియచే నలియంగఁ జేయఁగా
నటయిట జేరనీ కతని యాననహస్తతతిన్ దృఢస్థితిన్
నటననె శస్త్రసంహతిని నాటగ్రదెంచితి తాటకాంతకా! 189

చం. అలరగ నింకిటన్ హలధరాకృతి నాగడరీతి కాంతలం
గలఁచెడి యాకృతిన్ గలిఁగి గాఁగలచర్య లెటన్నినన్నయా
జలజజ శక్రలేఖతతి జక్కని దృష్టిని దేరి కాంచి దా
గలకలగేరె దాశరథి కాంతి దనర్చి శశాంకరీతిగాన్. 190

వ. అంత 191

సీ. తారకాఖ్యఖగారి దండించి జయగతి
కీర్తిహెచ్చన కార్తికేయలీల
యంధకాఖ్యనరాశనాగ్రణి నణఁగించి
ఘనతకెక్కిన కాలకంఠులీల
యశనిధార దెరల్చి హంకార లేఖారి
జండినయట్టి యా శక్రులీల
గాంగేయ గేహ సంగర గరిష్ఠనిశాట
దతుఖండన నృహార్యత్తులీల

దసగళత్రిదశారి నీ ధరణిజార్చి
తనజయఖ్యాతి యలరంగ దశరథేశ
నందనాగ్రణిదాయిని నండజీటి
శింజిన వెరల్చి శరయష్టి చేతికిచ్చె. 192

వ. అయ్యెడ 193

సీ. చిరగతినిర్జరశ్రేణి యానందించె
యహిరాజసంతతి యలగి తలఁచెఁ
జారణతతి యంత సంతసించి గణించె
సిద్ధసాధ్యఖగాళి జేరియాడ
నినశశిగ్రహతార లెంతయేని దిశించె
నాక నారీజన నటన లెచ్చెఁ
గీశసంతతిజాల గీర్తించిఁ జలరేగె
దిఙ్నరేశితలెల్లఁ దేజరిల్లె
దైత్యనాయక దశకంఠదళన రాజ
తిలకయని యెన్ని నతిఁజేసి దీనరక్ష
సరగజేయంగ దలఁచిన చక్రి యీతఁ
డే కదాయని హర్షించి రెల్లరంత. 194

శా. ఈలీలన్ దశకంధరాఖ్యగల యాహీనాగ్రణిం జెండినన్
జాలానార్తిఘటిల్ల యగ్రసతి తన్ చానల్ తగన్నంటిరా
నాలంకాస్థలి దాటి కాంచి యహాహా! హా! నాథ! నేఁడిట్లయీ
నేలంద్రెళ్లితె రాజహేళి కటా నిన్నిట్లఖండించెనే. 195

తే. రాక్షసాధీన నీసతిరాజి యడల
దయఁ జిగిర్చంగ కట్టెదఁ దార్చకేల
ధరణి నింతింత గంద్రలై తలఁగి చనితె
కట కటా! యేదిదిక్కని కలగి చీఱ. 196

కం. అందఱు లన్నియడాటల
దందడినేడ్చంగ నతనిదాయి కలంకన్

గంది యరచెనది దశరథ
నందన నరనేత నీతినయగతి నణఁచెన్. 197

ఉ. అంతటఁ దాటకారి తనయండనె నిల్చిన దైత్యకేసరిన్
జింతదలంగఁ జేసి యతిశీఘ్రత దేరఁగ నగ్నిసంస్క్రియల్
సంతసిలంగ నన్న కిటసాగఁగఁ జేయగరాదెయన్న తా
రంతట తాళిశాస్త్రగతి రాక్షసనేత రచించె తత్క్రియల్. 198

తే. అగ్నిసంస్కార సత్క్రియ లాదిగాఁగ
నెల్ల క్రియల నెసంగించి చిత్తసరణి
తిరిగి యేతెంచినట్టి దైతేయనేత
గాంచి తనదాయిరానెలఁ గడఁగి చీఱ. 199

తే. దాశరథియెంతొ హర్షించి దాయి గాంచి
దశగళకనిష్ఠఖచరారి ధరణినేతఁ
గలసి చని లంక కేలికగాఁగఁ జేయ
ననఘ యేతేరరాదె యటంచునాడె. 200

సీ. అర్కనిశాకరు లష్ట[1]దిక్కుల గ్రహ
తారకాతతి యెంతదాక నిలచు
నజ హరి హర దిగీశాకాశధర కంధి
ధరణీంద్రగతి యెంతదాక నిలచు
నిలయాదిగా జగాలీరెంటి నిలతన
తలలుదాల్చిననెంతఁ దాకనిలచు
నాచర్యలెల్ల యిన్నర నాగఖగతతి
దలఁచగ కథల నెందాకనిలచు
నంతదాక ననేక ఘనాతిశయత
లంక నీతవి కిచ్చి యలంకరించి
దాయి రారాజె యన నాజ్ఞఁ దల ధరించి
కదలి యతవిని దద్రాజ్యకర్తఁ జేసె. 201

1. దిక్కరి (ము)

వ. ఇట్లు దాశరథి యాజ్ఞ నింద్రజిద్దితిజారాతి యగచర సేనలాచ్ఛాదించ దశకంఠ సహజుసం గలిసిచని లంకారాజధాని చేరి ఝల్లరీకాహళ నిస్సాణ శంఖానక ఢక్కానాదక్రియల్ జెలంగ గేహినీసంగతి నతని సింహాసనస్థాయిగా రచియించిన కాంచనరచితచేల కంఖాణ సారంగ శతాంగ సైనిక[1]దాసదాసీ సకలార్థిసంతతికిం గర్తయై హితరాక్షసరేఖల్ నిండ హర్షసిద్ధిం జెంద నిట్లు న్నిశాచరనేతకనిష్ఠదాయిని నధిష్ఠితం జేసిన నత్యంతసంతతాతిశయతఁ జెలంగి యా చిన్నఊనెల ననేకయలంక్రియల నలంకరించిన నటఁ గదలి తదగ్రస్థలి నంగదహరినెక్కియేతేర తానతని దండనేచని రాజశశిం గాంచి కాళ్లు కెరఁగి లేచి నిలిచి యిట్లనియె. 202

ఉ. రాక్షసహారి ! నీచరణరక్షుల దాల్చితి నాహృదంతరిన్
దీక్ష ఘటిల్ల ధన్యగతి తేజితగాంచితి రాజ్యకర్తనై
యీక్షణకాంతి చాలదయ యేచికలంగదసాగఁ గంటి కం
జాక్ష ! యహీశయాన ! యనసాదరలీలలఁ దేల్చె నాతనిన్. 203

వ. అంత. 204

ఆ.వె. దైత్యహంతయాజ్ఞ దాల్చి యనిలజుండు
జనకరాజతనయ సరస కేఁగి
హర్షసిద్ధిసతకరాస్యలఁ గైసేయ
యనచినంత జేరి యాశ్రయించి. 205

కం. తలయంటి యలక లిడి చె
న్నలరఁగ నీరార్చి చిన్నియల దేర్చిన చా
యల చెంగట్టఁగ నిచ్చిరి
కలయఁద జిగియైన తేటకై సందడఁగన్. 206

సీ. ఘనఘనాంత స్థలాగత తటిల్లత లెల్లఁ
దనర నాకాకృతి దాల్చె ననఁగ
స్రష్టధాత్రీస్థలి జక్కదనాలన్ని
యేర్చికెంకిగ రచియించె ననఁగ

1. దాసీదాస (ము)

గణనకెక్కనయట్టి కలిత రత్నశ్రేణి
      సిరినిండరాశిగా జేసి రనఁగ
నంధకారాతి నాఁడైన తియ్యని కాయ
      జాంచిత నచ్ఛాయ లల్లనంగ
సారణాదితి నందన సాధ్య సిద్ధ
నాగ యక్షాండజాత కిన్నర నిశాచ
రాంగనా సంచయాఖ్యాదితాతిశయత
జనకకన్యక రంజిల్లె సాంద్రకళల. 207

తే. తెలియకర లేనియట్టి లేఁనెల యనంగ
సానదీర్చిన యంగజ శస్త్రిజాడ
కంటి[1]కంకియైరి చాలఁగాన నయ్యె
జనకనందన తా జగజ్జనని యనఁగ. 208

వ. ఇట్లు లంకరించి నిర్జర స్త్రీలాచ్ఛాదించఁ దేరెక్కించి దాశరథి యగ్రస్థలి నిల్కడఁ జేసిన. 209

ఉ. అంతట సీతగాంచి యతఁడాగ్రహదృష్టి నిరాకరించినన్
జింతిలనేల యగ్ని [2]యతడెచ్చెఁ జేరెద నందె నాయెడన్
యెంత కలంకయైన శిఖయే కని యాడెడినన్న గ్రక్కునన్
జెంతనెగాకగా ననలచిహ్నల రాజగ జేసినం దరిన్. 210

తే. విలిచి నతిజేసి "దహన ! నానిల్కడయిల
దాశరథిగాక యన్యువిఁ దలచినట్టి
దేవి నాయంగలతిక దహించరాదె
యితర గతిలేని యెడ సీత గతియె సాక్షి". 211

కం. అవికిలిఁ జేరి నిలిచిన
కనకనయని యనలశిఖ లెగందిగ నెగురన్
దన లసదాకార స్థితి
జననాయక హేళిదండ సరగ నయగలిన్. 212

---

1. కంకెలియై (ము) 2. నదె (వ్రా).

వ. నిలిచి శిఖి యారాజశశిం గాంచి యిట్లనియె. 213

కం. జానకి యిదె యీసనుసతి
గాన నరాధీశ యక్షఖగనాగ నర
స్థాన స్త్రీలం దైనన్
యీనిల్కడలేద యనిన నెంతే నలరెన్. 214

కం. ఆగతిగని ఖగదిక్చర
నాగదితిజ యక్షసిద్ధనాయకతతియీ
శ్రీగద యిందిర యిక సరి
యేగతిలేదనినఁ జెలఁగి రెల్లర నంతన్. 215

ఆ.వె. తండ్రియైనదశరథక్షితిరక్షిత
ఖచరతతిని గలసి ఖగతినిల్చి
తనయ సత్య నిష్ఠ ధన్యతగాంచితె
యవి యనంగ చెలగె హర్ష సరణి. 216

వ, అంతట. 217

సీ. కఠినదారిద్ర్యసంగతి దనర్చినయతఁ
డెన్నఁ జెంగట నిధిగన్న సరణి
దిననాథచండదీధితి గ్రుక్కిన యతఁ
డెన్న శాఖిచ్ఛాయఁ గన్నదారి
కటికయాకటి చింత కాక జెందిన యతఁ
డెన్న నన్నస్థితిఁ గన్నజాడ
కరిఖడ్గకిటిరాజికాన జిక్కిన యతఁ
డెన్న తత్సరణిఁ దా గన్నసరణి

తే. జనకజాకాంత ఘనకళాజాతి కాంత
యగ్రధర నిల్కడగఁ జేయ హర్ష జలధిఁ
దేలి తేలి దృగంచలతృష్ణరీతి
గాంచి కాంచి నయక్రియ గణన జేసె. 218

తే. కాకజల్లారఁ దనయంత గానసైన
సీత నందఱి యానతిచేత నేల
ఘనత ఖగతతి యిచ్చిన కాంతులెల్లఁ
గీశసంతతి నీదేర్చి కీర్తి హెచ్చె. 219

వ. ఇట్లు సీతంగాంచి దాశరథిలేచి కౌఁగలించి యాజగజ్జనయిత్రిం దనచెంగట నధిష్ఠింపజేసి యనేకచర్య లాచరించి. 220

కం. నాచేతగానినడకల్
నీచే నీడేరెగనుక నీదృఢచర్యల్
నాచర్యల్ ధరణిస్థలి
నాచంద్రార్కతన నిల్చె నక్కఱఁదేరన్. 221

సీ. నీకయి యద్రిజానేతకాండాసన
యష్టి గంఢించితి యందరెఱఁగ
నీకయి గట్లచే నీరధి హరిసేన
చేత గట్టించితిఁ జిత్రసరణి
నీకయి దశకంఠ నిర్జరారాతి సం
తతి గీటడంచితి సతతశక్తి
నీకయి శక్రాది నాకజనశ్రేణిఁ
జాల రక్షించితి జగతియలర
నీకయి చిరంతనఖ్యాతి నిఖిలదిశల
శ్రీలనెన్నిక నెక్కంగఁ జేసినాఁడ
గనుక నీచేతియుల్లేకా కథజనించె
సరసలాతన్యజాజాత ధరణిజాత. 222

కం. తతకాలస్థితి దశగళ
దితిజాగ్రణి గాంచ నల్కదృఢసంధిరచిం
చితి యదె సత్యక్రియయై
క్షితి నిలిచె న్నీచరిత్ర సిరి సంధిల్లన్. 223

ఆ.వె. తండ్రికంటె ధరణిఁదల్లికిఁ దనయ సం
తతియధాట నధికదయ దలంచి
యిట్టి సరణి ననక హెచ్చయ్యె నా శక్తి
నీకె కల్గినయది నీరజాక్షి. 224

మ. అదిగాకే దశకంఠదాయికయి యాశాధీశకంజానన
త్రిదశశ్రేణి తరంగిణీశతటి నర్థి న్నిల్పి కీర్తించఁగా
నెదచే నిందఱకైన నేటి చెఱఁగాయేనేఁగి దాసాళి గా
చెదనం చాడినజాడ జేసితిగదా సీతా జగన్నాయికా. 225

కం. అని సీతనెన్ని చాలా
యని నలసిన కీశఘటల నందర రక్షిం
చిన లేచి సంతసిల్లిరి
గని జేజే ల్గణనసేయఁగా నా యెడలన్. 126

కం. జానకిని గలసి ధరణీ
జాని తరచి చన దలచి సరగ నిశాట
స్థానాధినేత జీటినఁ
దాననియెం దాశరథియెదన్ సంతసిలన్. 227

సీ. ధనదయానస్థితి దరలితారానేఁడె
సాకేతనగరికిఁ జరిగిరాదె
దశకంఠలేఖారి తన యన్నె దండించి
యది తెచ్చి చరియించె నఖిలదిశల
నెందఱెక్కిన నేనింట కెదగల్గి
గాలికంటెను శీఘ్రగతిని దనరి
కాంచనరత్న సంఘాతర రచనలచేత
యెంతయేని దనర్చె నిదియె దీని

నెక్కి చనరయ్య యని తెచ్చి యీయ నలరి
రాత్రిచరకీశసంతతి రాగఁజేసి
యందఱల నెక్కఁగా నన్చి హర్ష సరణి
ధానధిష్ఠించె ఔంకె యాధరణిజాని. 228

కం. జననాయకహారి సీతం
దనదాయిని నెక్కఁజేసి తగినట్టి యెడన్
ఘనఁదలఁచి యనరసరణిన్
దనరఁగ నాకాశగతిని దరలినయంతన్. 229

మ. రణధాత్రింగనజేసి సీత యిచటన్ రాత్రించరాగ్రేశితన్
గణనాతీతశరాళినేసి తలలన్ గండ్రించితిన్ గంటె కం
కణకాంతింగల తక్కరాలిదెగియన్ గంజాతనాశక్రియ
న్నణఁగం జేసితి నిచ్చటన్ గలశకర్ణాఖ్యాక దైత్యాగ్రణిన్. 230

సీ. అతికాయఘననాథహననసంస్థలి యిదే।
యదె యగ్ని కేశ సంహారణధాత్రి।
సకలరాత్రించరుల్ జచ్చిరి యిచ్చట
జలరాశిఁ గట్టిరి సరగ నిచట।
నీరధి గననయ్యె నిజరీతి నిచ్చట
గలసె రాత్రించరకర్త యిచట।
ఖగకర్తచే జాడ గాంచిరి యిచ్చట
సేనలఁ గలసితి చాన యిచట

నెలల నాల్గింటి జడగట్టి నీరధార
లడర నీగిరి నిలిచితి నధికచింత
[1]నర్కికిచ్చితి కిష్కింధ నదియె దాని
కాంతి యెంతేని తెలియంగఁ గానరాదె. 231

మ. అనిన న్నక్కడ నిల్పి క్రీశతతిసాహాయ్యక్రియన్ దాల్చినన్
జననాథాగ్రణి యట్లరా ననిచినన్ జాలాయెదల్ రంజిలన్
గనకాలంక్రియ లెల్ల సీత యరలన్ గాన్కల్ తగన్నిచ్చి యా
యినజాతాగ్రసతీ సహాయ్యచెలియన్ నేతెంచె యందెక్కినన్. 232

వ. అయ్యెడఁ దరలి దనసతికి యారాజశశి యిట్లనియె. 233

---

1. లర్కికిచ్చితి కిష్కింధలదియ (ము)

సీ. శక్రనందనహారి సంహారించితి నిటఁ
జెట్లందె దాగితిఁ జెలియ యిచట
ద్రాళ్ల నేడింటిని దరిగితి నిచ్చట
గెడసిన రక్కసి గీటితి నిట
నర్కిసంగతి గంటి నరయంగ నిచ్చట
నీయలంక్రియ లెచ్చె నెలఁత యిచట
యనిలజనగచారి నలరి కాంచితి నిట
జెంచెత సత్క్రియల్ జేసి తిచట
దీర్ఘకరరాత్రిచరనేత ద్రెళ్లె నిచట
నర్కసారథి తనయ ఖగాధి నాథ
సంగరస్థలి యిది కంటె జలజనయన
కానఁగానయ్యె దళశాల కాంత ! యిచట. 234

కం. తాటకతనయఖగారిన్
గీటఁడఁచితి నిచట నిష్ఠ్రక్రియ నేతేరన్
నెట్టించి యతఁడ చీటిన
నాటినదయ [1]గల్గిదాయి నాకై రాగన్. 235

ఆ.వె. జరశరీర హైన జటిలీల నేతెంచి
కదసి కల్ల లరసి దండ నిలచి
తస్కరాన సిన్నె తనరథస్థలినిడి
చనియె దితిజకర్త చాన యిచట. 236

కం. ఖరదైత్యాది నిశాచర
హరణ క్రియచేత దండకారణ్యానన్
సరగనె నిష్కంటకగతి
జరఁగగ జేసితిని యిట్టిచాయం జాయా ! 237

కం. అల్లన దైతేయాగ్రణి
చెల్లెల్ నిన్నేచ దాయి శీఘ్రుత గిసెన్

1. కనె (ము)

గల్లరి ¹నాసిక కర్ణా
లెల్లెడలన్ రక్తధార లెగయఁగ నిచటన్. 238

ఉత్సాహ. కలశజాత జటిలనేత గాంచి యిచ్చ నిచ్చటన్
అలశరాసయష్టి నందినట్టి జాడఁగట్టి గా
నలర నత్రికాంతయిడిన యంగరాగసంగతిన్
చెలఁగి హెచ్చినట్టి లీల చెలియ యుందె దెలియఁగన్. 239

స్రగ్విణి. దండకారణ్య సంస్థాని కేతెంచి యా
చండదైత్యాగ్రణిన్ జక్కఁగాఁ జెక్కితిన్
అండగాఁజిత్రశృంగాద్రి కేతెంచి నే
గండడంగించితిన్ గాకి రా నీ కడన్. 240

స్రగ్విణి. చక్రసంజాతరాకన్యసైన్యాల దై
న్యక్రియన్ గానరానంత నాతండ్రి దా
శక్ర సంస్థానికిం జన్నదిందెల్సి శా
స్త్రక్రియంజేసితిన్ దత్క్రియల్ యిక్కడన్. 241

కం. అనియాద్యంతస్థితిదాఁ
జనకజ కెఱిఁగించి యిట్లు చనఁజన నంతన్
గని యండజాతు జటికా
వన సంస్థలిఁజేరి నిల్చి నరకర్త దగన్. 242

సీ. కేసరినందనకీశాగ్రణిని గాంచి
యీరాత్రి నిచ్చెద నిజ్జెచింత
కాన శీఘ్రత నేగి కని కిరాతాగ్రణి
యలరంగ నారాక దెలియఁజేసి
సాకేరనగరికిఁ జని జననీత్రయి
కెఱిఁగించి నతిఁజేసి యొదజిగిర్చ
నగ్రదాయుని గాంచి యతనికి నీచర్య
కర్ణరంధ్రానందగతిగఁ దేల

1. నాశా (ము)

తే. సకల సన్నాహసంగతిజతదనర్చి
రయగతిని యెల్లి యిచటికి రాగఁజేసి
తిరిగి రారాదె యనియన్న సరగనట్లు
చనియె హరికర్త లందఱల్ సంతసిల్ల. 243

కం. అగచారినేతయటఁ జని
నగకాననతతినిఁ గడచి నయగతి నంతన్
దగఁగంగదండ గ్రక్కున
నిగిడిన దయగల కిరాతనేతన్ గాంచెన్. 244

కం. కని దశరథతనయాగ్రణి
యెనయఁగఁ గానన జరించి యేతెంచి తగన్
ఘనత నిటకెల్ల రాఁగలఁ
డని తెలియఁగఁజేసి చనియె నతిశీఘ్రగతిన్. 245

ఆ.వె. తరలి గంగదాటి తానంత సాకేత
రాజధానిగడచి రాగ నచట
సకలనరశరీరచర్యల గని యింక
నేనిలైన నగరె నిజతఁ తెలియ. 246

కం అని నరదేహాక్రియ దా
నెనయంగాఁ దాల్చి నగరికేఁగఁగ ఖరజి
జ్జననీత్రయు యలరంగా
సనయగతిం దెలియఁజేసి సాగిలియంతన్. 247

తే. జానకీజాని యిచ్చట సరగ నెల్లి
రాగలఁ డటన్న నందఱన్ రంజిలంగ
నటఁ దరలి నందినగరిఁజ క్రాంశజాత
శశినిగని హర్షియై చక్కఁ జాగినిల్చి. 248

ఉ. తాటకహంత యిచ్చటికి దానని చెందఁగ దెల్పఁ జేయఁగా
నేటికి [1]నండజాతుజటినేత సహాయత నాశ్రయస్థలిన్

---

1. కేగట (ము) (2. నండజాఖ్య ?)

చాటఁనిల్చెగాన తనదాయికి సీత కనేక తెస్పతే
గీటడఁగించె రాత్రిచరకేసరి కైకసనందనాగ్రణిన్. 249

వ. అదియెట్లంటేని. 250

సీ. నిన్నిటకంచి నీయన్నదండక కానఁ
జేరి దైత్యాగ్రణిఁ జెండి హెచ్చె
దశకంఠలేఖారి దయగల చెల్లెలి
నాసిక కర్ణాలి గీసి చెలఁగె
దానికై కెరలిన దైత్యాలి గెడయించె
యఘచింత గలయిట్టి నణఁగఁజేసె
తస్కరగతిసీత దనయింటఁజేర్చిన
నానిశాచరకర్త నరయ దలఁచి
కడఁగి ఖగకర్తచే జాడ గానసైన
నార్కి రక్షించి యాతనియన్న నేసి
యెనయఁ గిష్కింధ హారికర్తకిచ్చి సరగ
ధరణి కంజాత నరయంగ దలఁచినంత. 251

కం. నన్నాదిగఁ గీశతతిన్
యెన్నికగానెల్ల యెడల కేఁగఁగఁజేయన్
దిన్నని దక్షిణదిశగల
కన్నిధిలంఘించి సీత గాంచితి నచటన్. 252

మ. కనినేనంతట రాక్షసాలి నణఁచన్ గట్టెం దగం ద్రాళ్ళచే
ఘననాదాఖ్య ఖగారి యట్టియెడ లంకం గాలఁగా జేసితిం
జని యాజానకియాజ్ఞఁ గంధితిరుగన్ జంగం ధృతిందాటి యా
జననాథాగ్రణి కెర్కసేయ నడచెన్ సైన్యచ్ఛటల్ దండరాన్. 253

ఆ.వె. తరలి సేనలెల్ల దనచెంత నేతేర
నెరయ జలధిదండ విలిచినంత
తలఁగి సఖ్యగతికి దశకంఠదాయి రా
లంకకర్తగా నలంకరించె. 254

ఆ.వె. అట్లనిల్పి కడలి గట్లచే గట్టించి
డానిదారి లంక దండఁజేరి
రాక్షసారి సంగరస్థలి కేశేర
కీశఘట లెదిర్చి గీటఁడంచె. 255

వ. అంతట 256

సీ. కలశకర్ణలతికాఘననాధదశకంధ
రాఖ్యరాక్షసతతి యాదిఁగాగ
నెఱిఁజండి కైకసి యిష్టనందన దంతి
కంతేని దయ లంకయిచ్చి యంత
సీతయేతెంచిన శిఖిఁజేరఁగాఁజేసి
కందక నిలచిన గతికి నలరి
తగనేలి యంశట ధనదయానస్థితి
దరలి రాక్షసకీశ తతినిగలసి
చెలఁగి యేతెంచి నిలిచె నీచెంత నంద
జాఖ్యజటినేత సత్క్రియలంది నేటి
రాత్రియదిగాన యదిరికిరాగఁ దగదె
యని తెలియజేసి తిరిగిరానంత నిచట. 257

కం. ఆయండజాఖ్యజటి జన
నాయకశశిఁ గాంచి యింక నాచేఁకాంతుల్
యేయేగతి గన నడగ గ
దేయన నంగీకరించి తెలియఁగజేయన్. 258

తే. కీశసంతతి కావేర క్రియలకెల్ల
నరయ సాకేతనగరికి నన్నిదిశలఁ
జెట్ల కాయల తేనెల జెందనిచ్చె
నంతనాజటియానతి నచటఁదరల. 259

వ. అంత. 260

మ. అట జ్రకాంశజరాజకర్త సరగన్ హర్షాతిహృచ్ఛాలియై
కటకాలంక్రియలెల్ల జేసి[1]కణనత్థంఖాణదంతీ రథ
చ్ఛటలన్ శానల కాహళానక ఘటాఝుంకార ధకాృదిగా
రట దత్యంత ధణంధణల్ నలుదిశల్[2]రంజిల్లఁగా దానటన్. 261

చం. చని ఖరహంతయాదికృతసంధిలనిచ్చినదాశ కైకయీ
తనయ ధరాధినేత లసదాగతి ధిక్కరణాతి శీఘ్రన
ర్తన దినచర్యలం గలసె ధాత్రి దిగంతహితక్షితీశతల్
గని ధనరత్నదంతి రథకాండఘటల్ సిరికాన్కలీయఁగన్. 262

ఆ.వె. ఇట్లు దలరి యెదిరి కేతెంచి దశరథ
యగ్రతనయశశికి నతని సతికి
కాళ్ల కెరఁగి లేచి గణియించి దాయిచే
గడఁగి యతనిఁ గాంచి కౌఁగిలించె. 263

తే. అహితహరణాఖ్యగలదాయి యట్టిచెంత
జరణకంజాల కెరగిన జక్కనెత్తి
కదిసి జననీత్రయునిగాంచి కాళ్ల కెరఁగి
ఘనతనీయ తదాశిషల్ గాంచి రచట. 264

కం. అంత కిరాతాగ్రణిఁ గని
సంతసగతి నతనిసతికి సహజస్నేహా
త్యంత దయాజనిత నిజహృ
దంతరియై తాటకారి యలరించె దయన్. 265

కం. ఆదైత్యాగ్రణినారిని
సాదరగతి కౌఁగిలించి సంతసిలెఁ దగన్
యేదెసఁగాంచిన జయజయ
నాదక్రియ లెసఁగగీతి[3]నర్తన లలరెన్. 266

వ. అట్టియెడ. 267

---

1. కణకక్కంఖాణ(ము) 2. రంజిల్లగందరెన్‌దగన్(ము) 3. గీర్తన ర్తన(ము)

కం. నగరిజనగణన లెచ్చఁగ
జగతియదరఁ గాహళాది ఝర్ఝర లెసఁగన్ -
అగణిత ఢక్కాఢణఢణ
ఖగసంతతి దద్దరిల్ల గ్రక్కున గదలెన్. 268

ఆ.వె. కదలి గంగగడచి కాంతుచే యశేశ
యానధాత్రి డిగ్గి హర్షలీల
సరగఁదాని ధనదసంగతికై యంచి
రాష్ట్రదంతినెక్కె రాజకర్త. 269

కం. చక్రాంశజాతదాయిన్
చక్రీశాంశగలదాయి సరగ రయగతిన్
చక్రికి నీకడ నాకడ
చక్రీచక్రియలఛత్రశార్జ్గధృతిగతిన్. 270

తే. ఏనిగలనెక్కి తగఁదాల్చియిద్దఱురుగ
చరణరతుల కడదాయి చేతదాల్చి
కరటికంఖాణరథరాజి ఘనతనెక్కి
గీశరాత్రించరేశితల్ కెలనరాగ. 271

ఆ.వె. అందలాలయంద యట జననీత్రయి
ధరణితనయఁ గదిసి తరలి రంత
రాజధానిఁ జేరరా నట్టిశృంగార
కాంతి యన్నిదిశల గాననయ్యె. 272

తే. నిర్జరాధీశ శిఖికాల[1]నిర్జరారి
కంనిధీనేత యనిలయక్షాధినాథ
శంకరాది దిగీశితల్ సరసలీల
గణన లెచ్చంగ రెండెడ గలసిరాగ. 273

తే. అఖిలదేశనరేశిత లచట గదిసి
సందడిదనర్చి యేతేర సరగనంది

---

1. నిరజతీశ (ము)

నగరికడనిల్చి యాయజనందనజటి
యాదిధరణిశిగచ్ఛట లంది కనిన. 274

మ. కరకంజాలనె రెంటినంటిలఁగ జక్కంజాలి యల్కస్థితిన్
నెరయం జేరిచి నిల్చినం గని యెదల్ నిండార హర్షస్థితిన్
సనగ న్నందరలీయ నాశిషల హెచ్చం గాంచి హర్షాసనా
లరయంజేర్చిన నెంతయేనలరి యయ్యాసీనత న్నిల్చినన్. 275

కం. ఆజటినేతల యానతి
రాజకళలఁ జెం:నట్టి రాజశిశి యటన్
రాజసగతి గద్దియకడఁ
దేజిత సంస్థానియయ్యె దిగ్గననంతన్. 276

తే. కైకనందనరా నేలగదిసి చరణ
కంజరక్షలఁ దలదాల్చి కడననిల్చి
యన్న ! నీయాజ్ఞ నాశిర స్సందె దాల్చి
నేర్చిన ట్లధినేతనై నిలిచినాడ. 277

ఆ.వె. రాజనీతిచేత రాష్ట్రిజనాళికి
శ్రీలెసంగ రక్షఁ జేసినాఁడ
విట్టి చరణరక్ష లిన్నిదినాల్దాక
గద్దెయందె జేర్చి కడనలిచ్చి. 278

ఉ. రాజశశాంక నీ చరణరక్షల హృత్తనలి దాల్చి దండినై
రాజితరాష్ట్రి సంస్థలి నరాతిజనాళికి దేరికాంచనెం
తేజడియంగ నాజ్ఞ జగతీస్థలిఁ జల్లఁగ నింతదాకనే
నీ జనరక్ష దాలిచితి నిల్చెద నీకడదాస సంతతిన్. 279

సీ. కలశజ జటిగాక కంధినీ రరగించి
తక్కిన ఋషితతి త్రాగఁగలరె !
హరకంఠసంస్థిత హాలాహలక్రియ
దైత్యఖగచ్ఛటల్ దాల్చఁగలరె !

శేషాహి తనదృఢస్థితిని దాల్చినధాత్రి
నితరయహిశ్రేణియెత్తఁగలదె ?
కనకాద్రి శ్రీహరి గదిసిదాల్చినయట్లు
నన్యనిర్జరతతి యానఁగలదె ?
కాన ధాత్రిని రక్షించఁగాను బెంకి
నీకె తగెఁగాక నేనెంత నిల్చిదాల్చి
దశరథాగ్రజ తరణిసంతతికి నెల్ల
మార్గగతిగా నధిష్ఠాతవైన వెన్స. 280

ఉ. కాన నరాగ్రగణ్య ! యిక గ్రక్కున నిచ్చట దర్లి రాజసం
స్థానికి నేఁగి యచ్చటనె సంగతి నిల్చిన వెన్స యన్న శ్రీ
ఘ్రూనవె తర్లి రత్నకనకాంచితచిత్రరథస్థలిం దగన్
దానటకెక్కి దాశరథి తన్నగరీస్థలిఁ జేరరా నటన్. 281

శా. శ్రీకంఠాదిఖగార్చితాంఘ్రినిధి యాసీతాంగనానేత తా
సాకేతస్థలిఁ జేరరాఁ దెలిసి రాజన్యచ్చటల్దార ల
త్యాకాంక్షల్ రథకాండసైనిక గజేంద్రశ్రీ నెదిర్చం గన
ద్రాకాసీత కరాకృతిన్ దనరె నత్యానందసంసిద్ధిచేన్. 282

వ. ఇట్లు సాకేతరాజధానిఁ జేరంజనియె. 283

సీ. రథచక్రజర్ఝరల్ రయగతి న్నడిచెడి
ఘనధక్కధణధణల్ గలసి చెలఁగ
గాహాళ ఝుర్ఝురల్ ఘంటాఘణంఘణల్
సకలాశలందును సరగనిండ
రాయిడిఁ గరిహయరాజిఘట్టనలచే
సరగ రజశ్రేణిచదల నెగయ
సాలాంత కాంచనచ్ఛాయలఁ దనరిన
కేతన దీధితుల్ గ్రిక్కిరియఁగ
గణికనారీ రచిత నాట్యగతిచెలంగ
రెండెడలఁ జంద్రశాలల దండనిలిచి

[1]నగర సతితతి యక్షతల్ తగిన లాజ
లాదిగాఁజల్ల నత్యంతహర్షలీల. 284

కం. చని రాజనగరి డగ్గరి
తనర రథస్థలిని డిగ్గి తత్సదనాంత
ర్ఘన కాంచన శాలలకడ
జనకర్త చరించె నధికసంతసగతిచేన్. 285

వ. ఇట్టులా రాజశశి హర్షగతి నిజగృహాంతర స్థలిని నిలిచి తనదండ కేతెంచిన కీశరాత్రించరతతి కర్హస్థలినిల్కడసేయ నిచ్చియిష్టాహారక్రియల సంతసిలం జేసి యనేకక్రియల లాలించి యంతట తీర్థస్నాతయై చందనాక్షతాద్యలంకరణలం దనరి శతధృతి నందనాది ధరణిఖగచ్ఛట అహితజనసంతతినిదాయిత్రయిని దండనధిష్టించ జేసి క్షీరాన్నదధ్యన్నక్రియల షడ్రసకలితాహారతతి యాజ్యాది దధ్యంతగతిగా నారగించి దక్షిణల ననంతక్రియల ధాత్రీఖగతతి నలరించె నంతట సంధ్యాకాలగతియయ్యె నెట్లనిన. 286

తే. ఆదిదిక్కాంత గలిసినయట్టి సంత
సాన నాకాశగతి యంది సరగ నేగి
నీరనాయక దిక్తతి జేరనలరె
ననఁ దరణి జారె నంతట నడచె సంధ్య. 287

కం. చీఁకటి దిక్తటి నెల్లెడ
లేకక్రియ నిండినట్టి యెడ నక్షత్రా
ళాకీర్ణస్థితి దనరెన్
రాక చెలఁగి శశిదనర్చి రహి గననయ్యెన్. 288

కం. చంద్రికలు దిశలఁ గలయన్
సాంద్రక్రియ నిండెనంత సరఁగ ననంగన్
ఇంద్రకిరీటజఘృణియన
నింద్రాశన్ దారదనరె యెన్నిక నంతన్. 289

---

1. సగర (ము)

త. చీఁకటి యెడనెడజారఁగ
కేకిలచే చరణశస్త్రికిలరంతడరం
ఢాక చెదరి శశిధారన్
ఏకడలను నెఱ్ఱసంజ లెనసిన నడఁగెన్. 290

వ. అంత. 291

సీ. ఘనతరకఠినాంధకార దిక్కరిరక్త
శరధి నీరాడిన హరి యనంగ
నగ్రదిగ్గలనిధియం గాదని తర్లి
చెలఁగి యేతెంచిన శిఖి యనంగ
నాకాశ శరదైత్యహరణక్రియల హరి
యించనిల్చిన చక్రహేతి యనఁగ
నింద్రదిఙ్నగరంధ్రహేలాజనితశేష
కాలాహిచిరరత్న కాంతియనఁగ
జీఁకటియడంగ జలజనిశిచెలంగ
జనతతి దగంగ యర్ఘ్యాళి సరినిడంగ
గాంతియడగంగ కలహారకళదరంగ
తరణి గననయ్యె దశశతకిరణజాలి. 292

తే. తనర దశరథనందన తరణియంత
కాల్యకరణీయక్రియలెల్లఁ గడఁగిఁజేయ
నటితటి జలజనందన జలజనేత
సన్నిధి దనర్చి నతిఁజేసి సంతసాన. 293

కం. అయ్యెడ రాజటిలాగ్రణి
చయ్యన కీశాధినేత జని తగననిచెన్
దియ్యన నాతని నతిగని
యయ్యెడకే సాగరాల నన్నిటినీళ్లన్. 294

తే. గ్రక్కనే తెచ్చినది లెస్సగాదె యనిన
నగచరశ్రేణి నేయించి దలఁచికేల
ఘటతతిని దెచ్చి యిచ్చిన గాంచు నలరి
యతనియాజ్ఞ కెంతే లెస్సయని చెలంగి. 295

ఉత్సాహ. సాగరాల నాలిఁగింట జనదనర్చి[1]కొండలన్
దేగలట్టి నగచరాలి దిగ్గనించినంత నే
యేఁగి శీఘ్రయాన సరణి నిచ్చలం దలంచఁగా
నాగడియనె సంతసాన నట్ల తెచ్చి యిచ్చినన్. 296

సీ. అతిధృతిఘటరాజి నత్యంత సంతోష
గతి రాజనిలయసంగతిని డించి
శతధృతి నందనశాంతహృదయజటి
కల్యాణదినలగ్నఘటికఁ దెలిసి
ఘనత ననేకర్షి గణసంగతి దనర్చి
హితశాస్త్ర సరణిని యిచ్చనలరి
దశరథాగ్రజ రాజితరణిని తగఁజేటి
తనర సింహాసనస్థాయిఁ జేసి
సరగసాకేతరాజి సంస్థానికింక
గర్త యీతండెయని శంఖకలిత తీర్థ
స్నాయిగాఁజేయ నెదలందు సంతసించి
కణఁగి నరదైత్య హరిఘటల్ కాంతునిలచె. 297

సీ. కైకనందనదాయి యిద్దఱ (లంతట)
గాలికట్టఁచేత ఘటనదాల్చి (?)
యర్కజాంగదరాతుసాధీశుల నిజా
దృశల నాయకతతి యలరితలఁచ
శేషాంశజాతుఁడౌ చిన్నిరానెల దాస
గతిఁ గార్యసరణిఁ దాగడఁగి తీర్చ
శతధృతి నందన జటిలాగ్రణి యనేక
గణన నాశిషలీయఁ గాంతులెచ్చి
ధరణి కధిక ర్తయై సిరిదనర నిల్చెఁ
గనక సింహాసన ధరిత్రిఁ గళల నిండి
శశిగ్రహాళికినరి చక్కనెగసినట్ల
దాశరథి యష్టహరిదీశతతి జెలంగ. 298

చం. జలచరకేతనాస్త్రతతిఁ జిక్కఁఖగాలి జెలంగి చక్కఁగా
నిలిచి యనేక ఢక్కలట నింగి ధణధణలానఁ జేయఁగా
సలలిత గానన ర్తనల సంతసిలె న్నిక నారదర్షి గీ
తల నెసగించ రాజశశి తానలరెన్ సకలార్థ సిద్ధిచేన్. 299

సీ. ధనధాన్య సంగతి దనరి హెచ్చె ధరిత్రి
లక్ష్మీరాల్గని యంగఁజారె (?)
జెల్లెల్లఁ జికిలించె సిరియలర్చఁగఁ గాపెఁ
దస్కర క్రియ దహాదహ లడంగెఁ
జిన్నల కేయెడ జేటున్నఁ డెరుఁగరే
శ్రీలిక నాధతలీల దేరె
ఘనరసాల్ నెలకె ద్రికా లాల్గలకసాగె
జనతతి యందంద సంతసించెఁ

గనకరత్నాద్యనేక శ్రీకరతచేత
రాష్ట్రజనరాజియాఖ్యగా రాజికళల
నీతిచేదాన దాక్షిణ్యనిరతి గనియె
దాశరథిరాజ్య సంస్థలి దనరెనంత. 300

ఆ.వె. ఇట్ల రాజధాని కేలికయై యంత
గీశదైత్యఘటల క్రీడలరసి
యందటికిని రత్నహాటకశాటిక
లలరఁ దనియనిచ్చి యనిచెఁ దిరగ. 301

ఉ. ఈగతి నందటిం దిరగ నెన్నికనన్నె యథేష్టలీలలన్
రాగిలి జానకిం గలసి రత్నగృహాళి జరించి ఖ్యాతిగా
సాగి హయేష్టిజేసి సరసస్థితినేలె ననేకకీర్తిచే
ధీగణనల్ జెలంగ నగధీరత రానెల ధాత్రి లెస్సఁగాన్. 302

కం. తనరాజధాని దశరథ
తనయాగ్రణి నిలిచె సహజధరణీతలరా

జనతా హితజనసంతతి
[1]యనతా నందానజెలిఁగి యతిశయిలంగన్. 303

కం. ఎల్ల దిశల జనతతికిం
దల్లిందండ్రియన నధికధనధాన్యశ్రీ
సల్లలిత స్థితినుండఁగ
జల్లగ ధర యేలె జనకజాజాని తగన్. 304

ఆశ్వాసాంతము.

కం. దిశలజనులెల్లఁ బొగడఁగ
దశరథనందనచరిత్ర ధాత్రి వెలయఁగా
నిశిత మతిఁజేసె నసదృశ
యశుఁడగు మఱిఁగంటి సింగరాచార్యుఁ డిలన్. 305

కం. శతధృతకర[2]కంజక్షా
శితచరణ సరోరుహాంగుళీజనరిత్వా
పితనేత్రాయుధ శేఖర
దితిజాధిపవైరిదళన దృఢతరనఖరా. 306

*చం. ఘనఘనసార సారసమృగప్రఘకుంభవతార తారకా
వననిధిరాజ రాజహరవాఘృణిలాధిమనాగ నాగరా
ణ్ముఖునిపతీజ వజ్రభృథనోకహచందునకుండ కుండవా
హానముఖకీర్తి కీర్తితనయ ప్రతిభా గుణవిక్రమోన్నతా. 307

— నాగబంధము —

చం. నరహరి ధీరసూరివర నారద వర్ణిత గానలోల శ్రీ
వరకరుణావిచార కరివైరిహర స్థిర భోగపావనా!
నిరత నలీన హారధర నీరజ [3]సద్మ విహార భూరతా
హరి [4]నగజాత సారసుత యాతతలంఘనచారువాససా. 308

1. యనహానంద జెలనడాసి నతివయిలంగన్ (ము) 2. కంజాణా : (ము)
* సంశయములతో అర్థరహితముగా గలి పద్యము (ము)
3. పద్మ (ము) 4. నఘజాత (307)

— ఖడ్గబంధము —

ఉత్సాహ. శౌరిశౌరి సూరి వంద్య శాప తాప కోపనా
సూరిభూరివైరిహంస సోమసోమ లోచనా
నారిదుర్విచారికర్ణ నాసికా 1విఖండనా
2వారితోగ్రదైత్య గర్వవన 3కృశాను ! పావనా ! 309

మాలిని. జనకలుషవిదూరా సర్వలోకైకవీరా
ఘనతరశుభగాత్రా కంధికన్యాకళత్రా
కనక రచిత హేలా కద్రు గోపాలబాలా
ఘనతగుణ వికీర్ణా కాండ ఖాండప్రపూర్ణా. 310

— గద్య —

ఇది శ్రీమత్కర్పూరాచల లక్ష్మీనృసింహ వేంకటేశ్వర వరప్రసాదలబ్ధసకలై
శ్వర్య ధురీణ శారదాప్రశ్న వివరణ శతఘంటావధాన వినయధునీ
తరంగవిజృంభణాజృంభిత సలలితమృదుమధుర వాగ్వైఖరీఝరీధురీణ
స్థాపితాశేష విశేషప్రసిద్ధ సాహిత్య సారస్వతాశుకవితాష్ట
భాషావిశేష సంస్కృతాంధ్ర నిరోష్ఠ్యోష్ఠ్యాది వింశతి
ప్రబంధనిర్మాణధురీణ మౌద్గల్యమహర్షి గోత్ర పవిత్ర
తిరుమల దేశికేంద్ర పౌత్ర తిరువేంగళాచార్య పుత్ర
మఱింగంటి సింగరాచార్య కవిరాజప్రణీతంబయిన
దశరథరాజనందన చరిత్ర యను నిరోష్ఠ్య
మహాప్రబంధంబునందు పంచమాశ్వాసము
సర్వంబును సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీ

---

1. కోపనీ(ము) 2. విదారినీ(ము) 3. ర్వారితోగ్ర (ము) 4. కృశాన(ము)

# అనుబంధము

## దశరథరాజనందనచరిత్ర యందు ప్రతియాశ్వాసములో కవి వాడిన వివిధ వృత్తములు

| వృత్త నామము | ప్రథమాశ్వాసము | ద్వితీయాశ్వాసము | తృతీయాశ్వాసము | చతుర్థాశ్వాసము | పంచమాశ్వాసము | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| ఉత్పలమాల | 9 | 13 | 14 | 12 | 23 | 71 |
| చంపకమాల | 14 | 23 | 23 | 27 | 39 | 126 |
| | | 1.ము.ప.గ్ర | 1.ము.ప.గ్ర | 1.ము.ప.గ్ర | | |
| మత్తేభము | 11 | 7 | 2 | 4 | 10 | 34 |
| | 1.ము.ప.గ్ర | | | | | |
| శార్దూలము | 4 | 4 | 2 | 3 | 3 | 16 |
| సీసము | 14 | 8 | 12 | 15 | 31 | 80 |
| గీతము | – | – | – | 10 | 3 | 13 |
| తేటగీతము | 9 | 13 | 4 | 12 | 32 | 70 |
| ఆటవెలంది | 6 | 12 | 13 | 9 | 23 | 63 |
| కందము | 36 | 52 | 61 | 67 | 94 | 310 |
| మత్తకోకిల | – | – | 1 | – | – | 1 |
| కలహంస | – | 1 | – | – | – | 1 |
| తరల | 1 | – | – | – | – | 1 |
| స్రగ్విణి | – | – | – | 1 | 2 | 3 |
| మాలిని | – | – | – | – | 1 | 1 |
| ఉత్సాహ | – | – | – | – | 3 | 3 |
| మొత్తము. | 104 | 133 | 132 | 160 | 264 | 793 |

## — నాగబంధము —



చంపకమాలావృత్తము

చం. నరహరి ధీర సూరి వర నారద వర్ణిత గానలోల శ్రీ
వర కరుణా విచార కరివైరివిహార స్థిర భోగపావనా !
నిరత నవీన హార ధర నీరజ సద్మవిహా ఘూరతా!
హరినగజాత సారసుత యాతత లంఘున చారువాసనా ! (5-308)

— ఖ డ్గ బ ం ధ ము —



ఉత్సాహ. శౌరి శౌరిసూరివంద్యశాపతాపకోపనా
సూరి ఖూరివైరి హంసనోమనోమ లోచనా
నారిదుర్విచారికర్ణ నాసికా విఖండనా
వారితోగ్రదైత్యగర్వ వన కృశానుపావనా. (5-309)

# సారస్వతసర్వస్వములోని పద్యములు

దశరథరాజనందనచరిత్ర ము. ప్రలోలేక సా.సర్వస్వమువందున్న పద్యములివి(సా.సర్వస్వము 1సం 1సం. రుధిరోద్గారి భాద్రపదమాసము
1సం. 2సం. ,, ఆశ్వయుజము)

## ప్రథమాశ్వాసము

1. కం. ఇలజన్నదైనవిక కా
గలయెల్ల ధరాతలాధికర్తల కెల్లన్
దెలియగ నీనడకల తెర
గలరెన్ నా కెఱుక సేయకయ్య దృఢగతిన్. 55

2. కం. నీ నయగతి నీ దృఢక్రియ
నీ నయగతి నీతిదీక్ష నీ సత్యదయా
జ్ఞానస్థితి ధర నొరులకు
నేనాడు ఘటిల్లె చెపుమ యనఘచరిత్రా. 56

3. కం. జననాయక నీ వృత్తస్రవలి
ఎనయా కాంక్షాతిశయత దాల్చినయది చ
య్యన నేనెరిగించినగతి
గని నడచిన గార్యసిద్ధి కడయెట్లన్నన్. 57

4. ఆ. అనఘ యంగదేశజనకర్త తనకన్య
శాత ఋష్యశృంగ జటిలనేత
కిచ్చి యాతగాని కింటనే చెంకి సే
యించె కాంక్షలెల్ల నెదిగిరాగ. 58

5. మ. అనతశ్రీనిధి నాతగాని గృహిణిన్ హర్షస్థితిన్ దెచ్చినం
దనకాంక్షేష్టి రచించినన్ సకలశాస్త్రజ్ఞానలాక్షణ్యాదై

ర్యనయాచార దయాకళాతిశయ సారస్యక్రియల్ గన్న రా
చనెల్లగ్గెదరయ్య యష్టహరిదీశశ్రేణి కీర్తించగన్. 59

6. కం. అన సంతసిల్లి దశరథ
జననాయక హేళియంగజగతీవర రా
ట్తనయా సాంగత్యక్రియ
ననతస్థితి ఋష్యశృంగ యతిఁదెచ్చెదగన్. 60

7. ఆ. ఆక్షితిధరణినేత యతిఁదెచ్చి నిజశాల
యందెలెంకి జేసి హర్షనియతి
యజ్ఞకరణ దీక్ష నఖిలార్థ సంఘట
నాతిశయత నిలచె నంతకంత. 61

8. కం. తనయాగరత్న చర్యల్
గనగా హరిదంత రాజఘనులను దగరా
ననిచిన నేతెంచిరి య
త్యానతానంద రససిద్ధి యతిశయిలంగన్. 62

9. మ. హరిగాంగేయ శతాంగ గంధగజసేనాధ్యక్ష సంక్రాంతిచేఁ
గరఘంటానక కాహళాజలజ ఢక్కాతాళనిస్సాణ జ
ర్ఘర నాదక్రియ లంతరిక్ష సకలాశల్ ధాత్రియందానఁగా
నరనేతల్ నగరి స్థలిన్ గలయనిండన్ సాగిరా నాయెడన్. 63

10. తే. దశరథక్షితినాయక దంతినిష్ఠ
సంఘలగగేహినీత్రయి చక్కనలర
యజ్ఞదీక్షనధిష్ఠించె యాజియాజ్ఞ
శాస్త్రజనితార్థ సత్క్రియల్ చక్కనలర. 64

11. కం. ఈగతి నిష్టిరచింపఁ చగ
సాగెన్ దశరథనృనేత చక్కఁగా సకలా
శాగత రజచ్చటల్ నా
లా గరసి యనేక చర్యలన్ గీర్తించన్. 65

12. వ. అంతనక్కడ. 66

13. చం. హరినిరసించి, క్రీలినగి, యర్కిఁజయించి. ఖగారిగేరి, సా
గర ధరణీసుతున్ దెగడి, గాలినదల్చి, ధరాధినేత గె
ల్చి, రజితశైల కర్తగడఁజేసి, దశానన నిర్జరారికే
సరి చరియించె నాగనరచారణ హృద్గత శాతహేతియై. 67

14. తే. నిర్జరీనిర్జరశ్రేణి నిత్యకృత్య
దాసికాదాస చర్యల దండియడఁగి
యార్తిసంధిల్ల నయ్యాజియ్యిలిడ
ధరణి సంచరించడసాగె నేశంకలేక. 68

15. ఉ. ఆతరిశైలహంతయనిలార్కనిశాటజలేశకాళికా
నేతలలాట నేత్రహరినిర్జర కిన్నర సిద్ధసాధ్య సం
జాత సహాయతన్ గదలి సత్యజగత్స్థలిచేరనేగె న
త్యాతత హర్షసారజనితాశ్రుకణార్ద్రి శరీరయష్టియై. 69

16. వ. అట్లుచేరి. 70

17. చం. సనకసనందాదియతిసంతతి కీర్తనసేయ కాంచనా
సన ధరణీసహస్ర జలజాతహితాయత ఘృష్టి యంతటన్
దనరఁగ శారదాసహిత ధాత జగజ్జననేత నక్కరన్
గనినతిఁజేసి లేచి యలికస్థలికేలి ఘటించి యాడెదాన్. 71

(2 వ సంపుటము)

18. కం. అయ్యా దశాస్య ఖలాగ్రణి
కియ్యఁగ రానట్టి నాంతులిచ్చినకతనన్
నియ్యాన యిట్టి యందర
చియ్యల్ తరగంగసాగె క్షితి చరియింపన్. 72

19. కం. చెన్నటి నాతని గణనన్
దిన్నఁగ యందరల యార్తి దీరిచి రక్షిం

చ న్నీక కాక యితరుల
కన్నా దృఢశక్తి గలగె గణియింపంగన్. 73

20. చం. అనిన ధరాధరారి నయనక్రియ సంధిలనాదరించి యా
చెనటి యనేక కాంతులెడసేయక నాదయగాంచి యందరన్
జెనకఁగ గాననేరనె నశించఁగ నేటికి దాని గర్వసా
ధనగతి యాలకించి సహితస్థితిచే నెరిగించెదన్ దగన్. 74

21. తే. దిగధినాయక చారణఖగఖగాహి
యక్షకిన్నర సిద్ధసాధ్య తతిచేత
హానిఁజెందని కాంతునన్నడిగెగాని
తెలియలేదయ్యో నసురుఁడు దృఢతరార్తి. 75

22. కం. అదిగనుక నాతగానిన్
గదనస్థలి నణఁచ నేరికతనన్ గాలే
దది శ్రీహరిచేఁదక్కఁగ
త్రిదశ్ఛటలార యార్తి తెరలఁగనేలా ? 76

23. తే. అయినదానికిఁజింతసేయంగనేటి
కార్తిచే నతసంత్రాత యఖిలకర్త
ఘనదయానిధి శ్రీహరిగలిగెఁగాన
నతని సన్నిధికేగిన నదియెలెస్స. 77

24. సీ. నన్నాగడించిన నరకాదనాగ్రణి
జలచరాకృతిచేత సంహరించె
ఖచరరాక్షస కరాగ్రగ్రస్త కఠినాద్రి
నీరధికడనిల్చి నిష్ఠనానె
ఖలహిరణ్యాక్షు లేఖారితెగటార్చి
శృంగసంస్థితినెత్తి క్షితి ధరించె
సకలచరాచరస్థాయిగాడన్నరా
కాసి నఖాళిచే గాసిజేసె

నదితిజారాతిఁ గ్రింకి నణగదన్నె
చెనటిరారేండ్ల నందర చేరిచెండె
నట్టిఁగదేకకర్త శ్రీహరియెగల్గ
తెలియఁజాలక జాలి చింతించనేల. 78

25.కం. అనిగద్దె డిగ్గి కై జేసిన
తనరాయంచ నెక్కి జేజేల జత
ల్తనచెంతనిలచిరాగాఁ
జని తెల్లని కడలిచేరసాగఁగనచటన్. 79

26. సీ. రాకాశశాంక నీరంధ్ర చంద్రికలెల్ల
గలయ నేకాకృతిఁగాంచెననఁగ
నాళీక గేహినీనాథ దేహచ్ఛాయ
సకలాశ లందంగసాగె ననఁగ
త్రిదశ సంతతి యెడతెగనీక సంతాన
నగరాజియంతటనాడె ననఁగ
హార హీరచ్ఛటాలర్థి దిన్నెలుసేసి
జగతికి సరిగాఁగ జరచిరనఁగ
కానఁగానైన తెల్లని కడలిచెంత
నంచితాహ్లాదనియతి రాయంచ డిగ్గి
యష్టదిగ్రాజకీర్తనలతిశయిల్ల
సృష్టిరతుణకర్త తాస్రష్టనిలచె. 80

27.కం. నిలిచినశతధృతి దిక్కై
తలు చేరలిడంగఁజేయ ధారన హరియా
హాళహాళికల్ హృదయస్థలి
దెలసి దయారస నిధాన దృష్టి దనరఁగన్. 81

28. సీ. శంఖచక్రగదాసి శార్ఙ్గచిహ్నిత దీర్ఘ
కరశాఖ లత్యంత గళఁలదనర
శారద నీరద స్థల తటిల్లతిక చం
దాన గఔఁద లచ్చికానరాఁగఁ

దేటగా రత్నకిరీటాద్యలంకార
సంజాతనిగనిగచ్ఛాయ లెసఁగ
నంగయష్టి నలందినట్టి శ్రీచందన
స్థితి యష్టదిశల రంజిలఁగజేయ
నెల్లరెక్కలతత్తడి నెక్కియెల్ల
దాసనంతతి రెండెనల్ దడసి చనఁగ
హరి జగత్కర్త యందఱర్థి యెన్న
శారదాజాని చెంగట చేరినిలచె. 82

29.కం. నిలచిన శ్రీహరిగని ని
శ్చలసరణి దిగీశఖచరసంతతి ధర సా
గిలి లేచి స్రష్ట నిటల
స్థలిఘటితాంజలి దీపించ సనయ క్రియచేన్. 83

30.చం. శరవిధి రాజగేయ ఘనశారద నీరద దేహ యీశ శ్రీ
ధర యరుణాస్యయాన హితదాన జనత్రిదశాగ హేళిచెం
దిర శిఖనేత్ర మిత్త్రి హృత తీక్ష్ణ నిశాట యనాధనాథ సం
గర జయశీల నాహృదయ కాంతు ఘటిల్లఁగఁజేయవే దయన్. 84

31. తే. ఇల రజచ్ఛటలైన నదీశజాత
నీరకణ రేఖలైన నా నింగితార
లైన గణియించఁగలకాని యనఘ నీ క
ధాతిశయలేఖ కళలెన్నరిదిగాదె. 85

32.చం. ఇనశశితారకానల నదీశ దిగీశ నరేంద్ర నీరదా
శనిదటి దంగదాచల దశాకరటిక్షితి సింహనాగరా
డనిల ధరాంతరిక్ష జటి లాతత రత్నతటాక తీర్థకా
వనతతి నీ సదాకృతిగ నాకిటఁ గానఁగనయ్యె శ్రీధరా! 86

33.కం. ఎంచఁజరాచరతతి సృజి
యించఁగ రక్షించఁనిగ్రహించగగల య

త్యంచిత చర్యలచే న
ర్తించెడి నీనటనలనఘ ! తెలియఁగనేరన్. 87

34 కం. అనిగణియించిన ధాతన్
గనియానందించి హృదయకంజ స్థలసం
జనిత దయారస ధారల్
చినకఁగ నాశేషశాయి చీరి నయగతిన్. 88

35.చం. అనఘ చరిత్ర నీనడకలన్నిట లెస్సలె యద్రిశైలశా
సనశిఖి హేళి నందన నిశాచరనాయక నీరరాశినే
త్రనిలధరాధినాధ గిరిశాది ఖగస్థితి యంతకంత చ
క్కనె రజనీ చరేంద్ర కృతకాతరతల్ కడయయ్యెనేకదా ! 89

36. తే. కలక నీచెంతనిలిచిన ఖచరఘటల
యాన్యకళలెల్లఁదిగజాఱె నరయ దాని
కేదిగతి యది లెస్సగా నెరుక సేయఁ
జక్కజేసెద నందఱు సంతసిల్ల. 90

37. వ. అనియాడిన శేషశాయింగాంచి 91

38.కం. ఏ నజ్ఞానక్రియచే
గానక దశకంధరాఖ్యగలయమరున కీ
రానట్టికాంతులిచ్చితిఁ
గాన జగత్రయిఁగలఁచఁగా సాగెనయా ! 92

39. సీ. కన్నిచ్చ నచ్చర కన్నెల చెరసాగె
నగ్రహారశ్రేణి నిగ్రహించె
నిఖిలధాత్రీలేఖనేతల చెండాడె
యజ్ఞాది సత్క్రియలన్ని చెరచె
నతిథిజనార్చ నలార్చె ఋషిశ్రేష్ఠ
సంతతాచార నిష్ఠల హరించె

జలజనేత్రస్థాన శాలలఁ గెంటించె
సత్యదయాతితీక్షుల సడల్చె
సనృతగాధల కిక్కౖయె యాగడాల
కాదియై యఘచింతన కడలియై ది
గంతనాయక హృదయశాంతాసియైద
శాస్యఖచరారి యెంతైన యాజ్ఞ లేక. 93

40. వ. ఇట్లాడిన యాస్రష్టంగాంచి 94

41.కం. ఆనరఖాదాగ్రణి యా
శానాయక సకల ఖచర సంతతి చేతన్
హానింజెందని తెరగా
హా : నీచేగాంచె దీనికలుగఁగనేలా ? 95

42.కం. తెలియక నరకృతహాని
స్థలచక చెడెగాక దానిదలఁచిన నేనా
ఖలదశకంఠఖగారి
స్గలన జయించంగ గలనె గడతేరంగన్. 96

43. వ, అదిగాన నేనింకఁ గలతెలంగెటింగించెద. 97

44.చం. ధరనతినిష్టచే దశరథక్షితినేతయు యజ్ఞదీక్షతన్
స్థిరగతి నిల్చెనాతనికిఁ జిత్రత నేఁ నరదేహధారినై
యరయ జనించెదన్ దశగళాదినిశాచరరాజ సంతతిన్
సరగహరించి యందఱలఁ జక్కగఁగాచెదఁ జింతలేటికిన్. 98

45. తే. చక్కనేకాదశ సహస్ర సంఖ్యలైన
యేండ్లదనుక ధరిత్రి నేనేలి త్రిజగ
దంత స్థలసకలఖగాళి చింత
యడఁగఁజేసెద శ్రీలచే నతిశయిలఁగ. 99

46.కం. ఈయేతెంచినయందఱ
లాయతగిరిచారినేతలై నిజకళలన్

శ్రేయస్థితి జనియించర
యాయన నంగీకరించి రాదర సరణిన్. 100

47. వ. ఇట్లంగీకరించిన ధాత్రాది నిర్జరచ్ఛటల నందఱ ననిచి యాశేష
శాయి యథాస్థలికింజనియెనంతనక్కడ. 101

— దశరథుండు యజ్ఞదీక్షుడుండుట —

48. చం. అనిఘుడుడై నశృంగజటిలాగ్రణియానతి శాస్త్రచర్య తి
య్యన యజజాతరాజనిధి యక్కర నిష్ఠరచించి యందఱ
న్ఘనతర ఘృష్టరంజిత జగత్తతియైన నతం డశ్వ్యకీ
ర్తన జనియించె నెల్లెడల రాచనెలల్గని సంతసిల్లగన్. 102

# శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము

## కృత్యాది

శా. శ్రీరామామణిమేచకాంబుదముపైఁ జెల్వొందు విద్యుల్లతా
కారప్రక్రియ యక్కునందనర భక్తవ్రాత సస్యంబులన్
కారుణ్యాంచసుధాంబులన్ మనుపుచున్ గారామునన్ బ్రోచు లీ
లారోచిష్ణుఁడు కర్వరాద్రిహారి చాలాయుక్తిమమ్మేలుతన్. 1

చం. ఘన ఘనసారస క్రముక గంధపుపూత సహస్ర పత్రమై
యెనరెడుభర్త యక్కున సముజ్జ్వల కౌస్తుభ కర్ణిక స్థలం
బున విలసిల్లుచున్ గడు ప్రమోదముఁ జెందు రమావధూటి తా
ననిశము మాగృహంబున ప్రియంబొందవంగ వసించిగావుతన్. 2

ఉ. వెన్నునివేయినామములు వేడుకచే పఠియించుకోస మ
భ్యున్నతి పెక్కుమోములుసముజ్జ్వలవృత్తిధరించి పాదుకల్
సన్నిల సాతపత్రపటశయ్యలు దానయి సేవఁజేయు నా
పన్నగ భర్త మత్కృతి శుభ స్థితిచే సమకూర్పఁజేయుతన్. 3

చం. దనుజులనాజిఁగూల్చిన ప్రతాపము కీర్తియు రెక్కలందు నా
ననమున దాల్చుపద్ధతి ఘనంబగు శోణితపాండురద్యుతుల్
దనరఁగ (విష్ణుమూర్తి)కి ముదంబునవాహనమైన పక్షిరా
జనువున శరషనంబులు ప్రియంబునసూకు నొసంగుగావుతన్. 4

చం. నలినభవాండభాండ భువనంబుల దుష్టుల శిక్ష సేయఁగా
గలుఁగు ప్రతాప రేఖయన గాంచనవేత్రముఁబూని జక్రిదా
వల వసియించువేలుపుల బారులు దిద్దెడు కంధిరాట్సుతుం
డలరఁగ నిట్టి కావ్యము నయంబొదవ న్సమకూర్చునెంతయున్. 5

ఉ. చక్రముశంఖమున్గదయు శార్ఙ్గము ఖడ్గము నాదిగాఁగ ని
ర్వక్రపరాక్రమాయుధ పరంపరలన్ మణిభూషణంబులన్
(శక్ర) మణిప్రభోపమితశ్యామలకాంతియు వైజయంతియున్
సక్రమమొప్పనెల్లపుడు సన్నుతిఁజేసెద నిష్ఠ సిద్ధికిన్. 6

ఉ. శ్రీకరరామభారత విశేషకథా జలరాశిఁ ద్రావి య
స్తోకపదార్థ రత్నములు తోరముగా బుధకోటికిచ్చి సు
శ్లోకరుచుల్ దిగంతముల లోకములం బ్రసరింపఁజేయు వా
ల్మీకిఁ బరాశరాత్మజు నమేయగవీంద్రులఁ బ్రస్తుతించెదన్ 7

గీ. జలజలోచనపరికరాంశ ప్రభూతు
లైన పన్నిద్దరాళ్వార్ల నభినుతించి
వాసి దెబ్బదినాల్గు సింహాసనముల
గురువుల భజింతు శుభములు ఫరిఢవిల్ల. 8

ఉ. ఆరయ శబ్ద హీనమగునట్టి పదస్థితిగల్గి పైనలం
కారము లెవ్వియున్ననక గ్రమ్మినశయ్యలసంధి దెబ్బచున్
గౌరవవృత్తియర్థములుగానని యాకవిచోరకోటి ని
స్సారము సేయఁగాఁదగు వెసన్ ద్విజరాజకళాసమృద్ధిచేన్. 9

వ. అనియిట్లు నిష్టదేవతాప్రార్థనంబును బూర్వాచార్య సంకీర్తనంబును
సుకవిభూషణంబును గావించి మఱియు నొకనాటిరేయి నిద్రించు
సమయంబున 10

ఉ. నల్లనిమేనుఁ దెల్లతిరునామము ముంజి పసిండి జందెమున్
జల్లనిగన్నులున్ గరుణజల్లెడుచూపులు లేతనవ్వు భా
సిల్లఁగ కర్పరాద్రినరసింహుఁడు తానగు వేంకటేశ్వరుం
డల్లన బ్రహ్మచారిగతి నగ్రమహీస్థలి నిల్చి వేడుకన్. 11

గీ. వత్స! నీయెడ మత్కృప వనరు కతన
హెచ్చిభువిలోన నేరికి నెన్నరాని
యచ్చతెనుఁగైన పదముల నమితకృతులు
నిచ్చరచియించినొసఁగితౌ యెలమిమాకు. 12

వ. అవియెవ్వియనినన్ వివరించెద వినుండు 13

సీ. "సిరులతొమ్మిదియేండ్ల వరదరాజస్తుతి
శ్రీరంగ శతకంబుఁ జెప్పినావు

పదియేండ్లనాడును బహుచమత్కృతులచే
చక్రలాంఛనవిధిఁ జెప్పినావు
యెలమితో [1]పదునోకండేండ్ల బాలుడవయ్యు
కవికదంబరచన గాంచినావు
వరుసతో పన్నెండువత్సరంబుల వేడ్క
శతసంహితయుఁ దెన్గుఁ జేసినావు
రమణపదమూడు యేండ్లను రామకృష్ణ
చరితమెల్లను [2]ద్వ్యర్థి సంశ్లేష మొదవ
నాంధ్రభాషగవిరచించితౌరభువిని
శబ్దశాసనబిరుదాంకశాలివగుచు. 14

గీ. వరుస పధ్నాల్గుపదిహేను వత్సరముల
సరసకవితాష్టభాషావిశేషకృతుల
సరణి లేర్పడనాటకశాస్త్రమెల్ల
గరిమ విరచించితివిగాదె కవులనెంచ. 15

గీ. అనఘ ప్రేమాభిరామ ధనాభిరామ
కావ్యములు జాతివార్తలుఁగడబు కొనఁగ
ద్విపదలుగఁ జేసితివి కవినృపతులెన్న
పూనిషోడశవత్సరంబుననె మొదల. 16

కం. నలయాదవరఘు పాండవ
[3]సలలి తురీయార్థకావ్యసంశ్లేషకృతుల్.
యెలమి దశసప్తహాయన
మలవడు కాలంబునందు నతిమధురోక్తిన్. 17

సీ. ఒనర పద్దెనిమిది సంవత్సరంబులనాడు
సకల అలంకార సంగ్రహంబు
రాకాసుధాపూర్ణరసపుష్పగుచ్ఛంబు
నాంధ్రభాషాభూషణాఖ్య కృతులు

---

1. పదకొండేండ్ల ....(లి) 2. వియ్య....(లి) 3. సలలిత వియ్యార్ధ (లి)
('లి' యనగా దీనిమాతృకమైన 'లిఖితప్రతి')

విరివిగా రచియించియెలమి పండొమ్మిది
హాయనంబులనాడు నఖిలశబ్ద
కవితనేతలు శిరః కంపంబుగావింప
ఘనశబ్దశాస్త్రాది కల్పనంబు

యెలమిగావించితిరువదియేండ్లనాడు
ఘననిరోష్ఠ్యాది వింశతి కావ్యములను
విలసితప్రౌడి నిర్మించి వెలసితీవు
సింగరాదార్య కవిరాయ శ్రిత విధేయ. 18

వ. అదియునుంగాక 19

ఉ: రాఘవపాండవీయకృతిరత్నము పింగళసూరనార్యుఁడే
శ్లాఘ సముద్ధరించె నది సర్వబుధప్రతతుల్గణింప నా
హా! ఘనమయ్యె దానికెన యంధ్రనిరోష్ఠ్య మహాప్రబంధమెం
తేఘటియింపఁజేయ నలుదిక్కులయందుఁ బ్రసిద్ధమయ్యెడున్. 20

కం. మున్నెవ్వడునుడువని యీ
తెన్నెడయెడమీరి యచ్చతెనుఁగునిరోష్ఠ్యం
బెన్నికఁజెప్పిన ప్రోడన్
నిన్నుంబొగడంగఁగలఁడె నెలతాల్పయినన్. 21

ఉ. అచ్చతెనుంగుబద్దెమొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చనియాడుకొందురొగి నెన్నుచు (నేప్పన) గ్రంథమెల్లని
ట్లచ్చతెనుంగునన్ కుడువ నందలిచందమెఱుంగువారు వి
న్నెచ్చరో! యబ్బురంబనరొ! మేలనరో! కొనియాడరో! కడున్. 22

కం. అను సునయోక్తుల నిటులని
మనమలరఁగ ననునయించి మత్కులపతియా
వనజాతనిలయనేతయు
ననుధన్యునిజేయవచ్చినాఁడని తెల్పన్. 23

వ. అనిమేల్కాంచి పరమానందహృదయారవిందుడనై యేతత్ప్రబంధ బంధురవ్యాజకావ్యాలాపకృతతుణవీక్షణ ప్రసంగ సంగ్రహా నిర్వహణ కృత్యంబున నత్యంత కృతావసరుండనైన తలంపున 24

కం. శ్రుతులకసాధ్యుఁడు వేంకట
పతి నాకావ్యమున కానబడుటల్ దెలిసెన్
క్షితిసుతుని దొట్రుపల్కుల
కతిమోదను దాల్చు తండ్రియందంబయ్యేన్.

కం. అనవుఁడు భళి నాకవ్యం
బునకున్ నేఁడబ్బెతావి పుత్త్రుడికింగ
గ్గనఠీవిననుచు మదిలో
నను సంతసమంది కూర్మి ననఁలొత్తంగన్. 26

చం. తెనుఁగున గొన్ని గావ్యములు దెల్లము గారచియింపవచ్చుఁ జే
వొక్కనఁగ నిరోష్ఠ్యకావ్యములుఁగొన్ని యొనర్పగ వచ్చుఁగాక చ
క్కన నివిరెండు చందములు గ్రచ్చుఅ గూఱిచి నేర్పుచేత నె
వ్వనికి రచింప శక్యమగు వాంఛయొనర్చితి దాని సేయఁగన్. 27

గీ. చెప్పరానట్టి కావ్యంబుఁజెప్పబూని
నాడ, నుద్ధతగతి చేత నఢచినడవ
ములు విచారింపకయె యేఁగుజలధిదాట
చేరి సాహసిదొడ్డు కొంచెంబులగునె. 28

క. తొలుతటిసుకవులు ఘనులై
యిలనాంధ్ర నిరోష్ఠ్యకావ్యమేలా సేయం
దలచరో! నాకుబ్రసిద్ధము
గలుఁగఁగ నొనరించు కొఱకు గావలెనరయన్. 29

ఆ. ఒకరితెరువువోవ నొకరు నాతెరువురా
రీప్రబంధరచన నెన్నవళమె!
వెలయ దీనిమహిమ విన్నవారలె కవుల్
గారె! విననివారు కవులుగారె. 30

చం. ఇల కవితాప్రయాసమగు నెన్నికమై యుభయార్థ కావ్యముల్
గల విపు డిట్లు విన్నయది గద్దిక ముందర గల్గనేర్చునే
దెలుఁగు నిరోష్ఠ్యపుం గృతియుదే మఱిదక్కఁగ నిప్పటందులన్
గలుఁగదు వింటలేదె యికకాఁగలజాడలు నెన్న నేటికిన్. 31

కం. తరమక ప్రతిపదములు ప
ల్మరునరయుచు సముచితోక్తమార్గంబులనున్
దెలఁగులఁ దెలియుచు నర్థం
బెలఁగఁగ దగు నుభయసంధు లెనయుట కతనన్. 32

గీ. అరయ [1]కగచజటడతద నా యలసహ
రద్వయమె కాని యొండక్షరములు చొఱవు
మఱియు నౌత్వోత్వములుకొమ్ముమాముడియును
వలనదామీద సురభాష నిలుపరాదు. 33

క. ఇలసురభాషల కొన్నిటి
తిలకింపఁగ వికటమనుచు తిరమగునామం
బులు కథలుఁదెలియు [2]కొఱకై
నిలిపితి కవిసమ్మతాన నిల్కడగాఁగన్. 34

వ. అని యిట్లు సకలసుకవిజనానందకందళితంబై యొప్పు యేతత్ప్రబంధ
నిర్మాణసామర్థ్యంబు నిరూపించి మదీయవంశావతారం బభివర్ణించెద. 35

గీ. పరమద్రావిడయాసూరివంశవార్ధి
కుదిని శ్రీసాధుభట్టార్య గురువరుండు
కడుముదంబున బ్రభవించి ఘనతకెక్కె
పుడమి మౌద్గల్యబుషిగోత్రతప్రాజ్యుఁడనగ. 36

కం. నిరహేతుక కృపచేతను
సిరివరుఁడగురంగశాయిసిరులింపొందనన్
కరుణాకటాక్షవీక్షణ
[3]గరిమన్ బ్రియపుత్రుఁగాంచు కైవడికూర్మిన్. 37

---

1. కగచయ....(లి) 2. కోసము (లి) 3. గరిమతో (లి)

కం. మునురంగశాయి యతిపతిఁ
గనుఁగొని సూరాధినాథుఁ గాంచి మఱింగం
టి నదెవ్వరన నాశో
భనగతి నాసూరిసాధుభట్టరుఁడలరెన్. 38

గీ. పరమకృపచేత శ్రీరంగపతి యెయిట్లు
నానతిచ్చిన శ్రీసూక్తి యన్వయమున
నిల మఱింగంటివార నేఁబంటి పేర
గురుశిఖామణులెన్నఁగా బరిఢవిల్లె. 39

గీ. అట్టి శ్రీసాధుభట్టారకాహ్వయునకు
తనయుఁడై పిళ్లలోకార్యుఁడు జనించె
నతని కుదయించె పెరియపిళ్లాఖ్యగురుఁడు
శరధినుదయించు ఘనసుధాకరునిబోలె. 40

సీ. ఆదేశికేంద్రుని కాత్మజుఁడై భువి
రాజిల్లె శ్రీరంగరాయ గురుఁడు
నతనికి దీర్ఘదారయ్యయుజన్మించె
పేర్మియాఘనునకుఁ బెరియజియ్య
రుదయించె, సత్కీర్తిసదయుఁడా మేటికి
సూనుఁడై యామున సూరిబొడమె
గరిమతోనిమ్మహాఘనునకుద్భవమయ్యె
మాధవగురువర్యమహితయశుఁడు
నతనికుదయించె సకలరాజాధిరాజ
రాజమకుటాగ్రఘటిత చిరత్నరత్న
బహుళనీరాజనాతి విభ్రాజితాంఘ్రి
నరసిజుండు చెన్నయాచార్యచక్రవర్తి. 41

కం. పాయక [1]నలందిఘన్ నా
రాయణ జియ్యరుని మేనయల్లుండై య
త్యాయతకీర్తులమించెన్
ధీయుత మఱిఁగంటి చెన్నదేశికుఁడెలమిన్. 42

1. నల్లాంది (లి)

సీ. రాజపుత్రికఁబూను రాక్షసుఁ బ్రోఁద్రోలెఁ
బెనుబాముముక్తికిఁ బెట్టఁబంపె
నవనిబందొమ్మండ్ర యన్నల తోబుట్టి
హరిలీలఁ బావనుఁడగుచుఁ వెలసె
మనవాళయోగికి మఱియుద్దియైయుండె
వనదంతిచేతఁబూజనములందె
శాస్త్రోక్తినరటరచక్రవర్తులఁ గెల్చెఁ
బైకొన్న బెబ్బులిఁ బాఱనడఁచె

తననంతాళువారనఁదనరునట్టి
యురగపతిసంతతిని దల్లి కుద్భవించె
విమలగుణవర్తి ప్రత్యేకవిష్ణుమూర్తి
చారుతర హేళి చెన్నయాచార్యమౌళి. 43

గీ. సిరుల దేవరకొండకు చేర్వ పణక
రాజుపల్లి యగట్టుపైరాజులెన్న
శ్రీమఱింగంటి చెన్నదేశిక శశాంకుఁ
డహహ మఱింగంటి చెన్నరాయఁడన వెలసె. 44

ఉ. చెన్నగ బ్రహ్మరాజపురి చెన్నుఁడుదానిలవేల్పుగాఁగనా
చెన్నునిపేరుఁబూని సిరిజెందెడు దేవరకొండ సీమలో
సన్నుతపణ్కరాజు పలిశైలమునన్ మఱింగంటి చెన్నుఁడై
యెన్నికకెక్కె భూజనములెన్నగ నింటనుదొద్దపేరిడన్. 45

గీ. పుడమిలో పాచిపైకంబు ముడుచు వారి
కింటి బోజుఁగన బిరుదువహించు చెన్న
దేశికునకు తనూజులై తిరుమలయ్య,
భట్టరుఁడు, సింగరప్పడుఁ ప్రబలిరందు.

కం. సరసుఁడుభట్టరుగురునకు
తిరువేంగళసూరిగల్గె, ధీరాత్మునకున్

తిరుమలదేశికు, డతనికి
తిరువేంగళనాధ నామధేయుఁడువెలసెన్.

వ. అమ్మహామహుని మహనీయ ప్రభావంబు వివరించెద

సీ. కమనీయమైయొప్పుకలిమికి రారాజు
గాంభీర్యగరిమకు కంధిరాజు
రూపసౌందర్యాదిరూఢికి రతిరాజు
కడుధైర్యలక్ష్మికి గట్లరాజు
ఘనతర సత్కాంతి కళలకు ద్విజరాజు
తథ్యవాక్యములకు ధర్మరాజు
విరివిగ సద్భోగవితతికిసురరాజు
ఘనభాగ్యగరిమకు కమలరాజు
పరమద్రావిడయాసూరి వంశరాజు
గురుతరంబైన మౌద్గల్యగోత్రరాజు
చతురమటిగంటి వేంగళాచార్యరాజు
రాజరాజాధి దేశిక రాజరాజు. 49

ఉ. దాపున నాయనంతగిరి, ధర్మపురీస్థలి, యూరుగొండ, గం
గాపురి, బ్రహ్మరాయపురి, కర్పర, రేబలె, యుండజెట్ల, బా
దేపలి యాదియైనహరితీర్థములన్ గురురాయపట్టణ
స్థాపకుఁడై జెలంగె బుధసమ్మతి వెంగళనాధుఁడెంతయున్. 50

గీ. అట్టివేంగళగురు నియర్ధాంగలక్ష్మి
వరదయాగుణనికురుంబ వరదమాంబ
సిరులసౌందర్య విద్యావిశేషకళల
బలియులైనట్టియష్టపుత్రులనుగనియె. 51

సి. మత్తేభనరహయమను జేంద్ర మకుటాగ్ర
మిళితాంఘ్రియుగళుఁడప్పలగురుండు
నిగమచేతస్తంత్ర నిపుణార్థ సంపత్తి
నతిశయిల్లెడు వేంకటార్యమౌళి

సంగీతనాటకస్వరకల్పసాహిత్య
చిత్రకవియు నారసింహగురుఁడు
పరవాదికుమతుల పటుశాస్త్రహరణుఁడై
రాజిల్లుకోనేటిరాయ శౌరి

వినుతశతఘంటశిరుదాంకవిజయుఁడైన
జగ్గగురుకాంతదేశిక చంద్రునకును
ననుజుల గురంగ నరసింగరార్యఘనులు
నవని ప్రబలిరి; యే సింగరాహ్వయుండ. 52

మ. వరవందారు జనావళీహృదయ సద్వాంఛార్థకృద్వేంకటే
శ్వర సంపూర్ణకృపాసుధామిళిత వీక్షామాధురీ మార్గవి
స్ఫురితైకైకదిన ప్రబంధరచనా స్ఫూర్జద్వచ శ్రీకుఁడన్
నరనాగాశ్వనృపాల సభ్యగణితుండన్ సింగరాచార్యుఁడన్. 53

## షష్ఠ్యంతములు

కం. ఏవంవిధగుణవితతికి
దైవాధి పశాసితాభ్రదృఢజల ధారా
గ్రావాశని సముదయ హృ
ద్గోవర్ధన శిఖరి ధృతి కకుంఠితమతికిన్. 54

కం. నతుత్రాధ్యక్షు విరూ
పాక్షు సుధాక్షీరజలధి హర్యక్షమరు
ద్వృక్షుహిమక్షోణీంద్ర వ
శక్షుశరీరునకు సత్కళా సారునకున్. 55

కం. అనిమిషనాథాది దిశా
జననాయక మస్తకాగ్ర సంఘటిత మహో
ఘన మకుట రత్ననీరా
జనశోభితచరణునకు రసాభరణునకున్. 56

కం. కరధృతగిరికిన్, రక్షిత
కరికిన్, భక్తజనహృదయ కంభవహారికిన్,
హారికిన్, కర్పూరపురనర
హారికిన్, పదదళిత కాళియాహ్వయ ఫణికిన్.

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన సీతాకల్యాణంబను నాంధ్ర భాషా నిరోష్ఠ్యమహాప్రబంధరత్నంబునకు కథాసూత్రం బెట్టిదనిన 58

కథాప్రారంభము

— గద్య —

ఇది శ్రీమత్కర్పూరాచల లక్ష్మీనృసింహ వేంకటేశ్వర
వరప్రసాదలబ్ధ సకలైశ్వర్యధురీణ ప్రసిద్ధసిద్ధసారస్వత
దశరథరాజనందన చరిత్రనిరోష్ఠ్యాదివింశతి
ప్రబంధనిర్మాణ పారీణ శారదాప్రశ్నవివరణ
శతఘంటావధాన: మౌద్గల్య గోత్ర
పవిత్ర తిరుమలదేశిక పౌత్ర
తిరువేంగళాచార్యపుత్ర
మరింగంటిసింగరాచార్య
ప్రణీతంబైన
సీతాకల్యాణంబను నాంధ్రభాషా నిరోష్ఠ్యమహాకావ్యంబునందు
సర్వంబును తృతీయాశ్వాసము సంపూర్ణము.



# దశరథరాజనందన చరిత్ర

## అకారాది గద్య పద్య సూచిక

సమాప్తము